# రెండవ పంచవర్ష ప్రణాళిక

## విశాఖపట్టణం జిల్లా

## 1959 - 60

ప్రణాళిక, స్థానిక పరిపాలనాశాఖ
ఆంధ్ర ప్రదేశ్

25 న. పై.

# విషయసూచిక



## మొదటిభాగం



## రెండవ భాగం

## అభివృద్ధి కార్యక్రమాలు

# మనవిమాట

రాజ్య ప్రణాళికలోని జిల్లావారీ వివరాలను పొందుపరుస్తూ ప్రచురించిన జిల్లా ప్రణాళికల వరసలో 1959—60 సంవత్సరానికి సంబంధించిన యీ ప్రచురణ నాలుగవది. ఈ ప్రచురణయొక్క మొదటి భాగంలో జిల్లాకు సంబంధించిన సాధారణ గణాంక సమాచారం యివ్వబడింది. సాధ్యమైన మేరకు నేటివరకు లభ్యమయిన గణాంక వివరాలు యిందు పొందుపరుప బడినాయి. రెండవ పంచవర్ష ప్రణాళిక క్రింద రాజ్య ప్రభుత్వం తలపెట్టిన నాలుగవ సంవత్సరపు కార్యక్రమాన్ని గురించి కూడ క్లుప్తంగా యీ భాగంలో వివరింపబడింది. ఇక రెండవ భాగంలో తంతి, తపాలా, రైలుమార్గాలతో సహా అభివృద్ధి కార్యక్రమాల వివరాలు యివ్వబడినాయి. ఈ ప్రచురణ జిల్లా పరిషత్తులకు కొంత ఉపయోగకరంగా ఉంటుందని, యీ ప్రచురణను యింకా మేలుగా రూపొందించటానికి పరిషత్తులు సూచనలు చేస్తాయని ఆశించబడుతున్నది. సూచనలు ఎవరు పంపినా సంతోషంతో స్వీకరించబడతాయి. వాటిని హైదరాబాదులోనున్న ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వ ప్రణాళికాశాఖ డిప్యూటికార్య దర్శిగారికి పంపవచ్చును.

హైదరాబాదు.
తేది, 13-12-1959.

సి. నరసింహం.
ప్రభుత్వ కార్యదర్శి.
ప్రణాళిక, స్థానిక పరిపాలనా శాఖ

# సాధారణ విషయాలు

## విస్తీర్ణం, వర్గీకరణ

ఈ జిల్లా విస్తీర్ణం 5,201 చదరపు మైళ్లు. ఇందులో 2 రెవిన్యూ డివిజన్లు, 9 తాలూకాలు ఉన్నాయి. 1956—57 సంవత్సరంలో యీ జిల్లాలోని భూమి క్రింది విధంగా వర్గీకరించబడింది.

| | విస్తీర్ణం ఎకరాలలో | మొత్తంవిస్తీర్ణంలో శాతం |
|---|---|---|
| మొత్తం భూమి విస్తీర్ణం | 33,14,642 | — |
| అడవులుండే ప్రదేశం | 14,48,926 | 43.7 |
| బీడు భూమి, సాగుక్రిందకురాని భూమి | 3,76,254 | 11.3 |
| వ్యవసాయేతర కార్యాలకు ఉపయోగించబడుతున్న భూమి | 3,67,802 | 11.2 |
| సాగుకు లాయకీ అయిన బంజరు | 77,795 | 2.3 |
| శాశ్వత పచ్చికబీళ్ళు, యితర పచ్చిక బయళ్లు | 35,017 | 1.1 |
| సాగు చేయబడే నికరపు విస్తీర్ణంలో చేర్చబడని నానా రకాల చెట్లు, తోటలు, పంటలు ఉండే భూమి | 34,423 | 1.0 |
| ప్రస్తుత బంజర్లు | 1,85,289 | 5.7 |
| ఇతర బంజర్లు | 40,337 | 1.2 |
| మొత్తం సాగుచేయబడే భూమి | 7,48,793 | 22.6 |
| ఒకసారికి మించి సాగుచేయబడే భూమి | 1,82,166 | 5.5 |
| మొత్తం పంట భూమి | 9,30,959 | 28.1 |

## వేర్వేరు ఋతుపవనాలవల్ల మొత్తం వర్షపాతం
(అంగుళాలలో)

| | 1956—57 | 1955—56 | మామూలు |
|---|---|---|---|
| నైఋతి ఋతుపవనాలు | 36.8 | 25.6 | 22.2 |
| ఈశాన్య ఋతుపవనాలు | 15.2 | 16.9 | 11.6 |
| శీతాకాలం | 0.3 | 0.5 | 1.0 |
| వేసవికాలం | 2.5 | 5.5 | 4.2 |
| మొత్తం | 54.8 | 48.7 | 39.0 |

## నీటి వనర్లు. నీటి పారుదల

ఈ జిల్లాలోని నీటివనర్లు, వాటిద్వారా 1956—57 లో యీ జిల్లాలో నీటి పారుదల జరిగిన భూమి విస్తీర్ణం వివరాలు క్రింద యివ్వబడినాయి.

### నీటి వనర్లు

| | | |
|---|---|---|
| 1. | ప్రభుత్వ కాలువలు .... | 251 |
| 2. | ప్రయివేటు కాలువలు .... | 22 |
| 3 | బావులు | |
| | (ఎ) గొట్టపు బావులు .... | — |
| | (బి) నీటిపారుదలకు మాత్రం ఉపయోగించబడే యితరబావులు. .... | 915 |
| | (i) ప్రభుత్వమువారివి. | |
| | (ఎ) రాతికట్టడం గలవి. .... | 12,973 |
| | (బి) రాతికట్టడం లేనివి .... | 5,660 |
| | (ii) ప్రయివేటువి | |

| | | |
|---|---|---|
| | (ఎ) రాతికట్టడం గలవి .... | 12,973 |
| | (బి) రాతికట్టడం లేనివి .... | 5,660 |
| 4. | గృహకార్యాలకు మాత్రం ఉపయోగించ బడుతున్న బావులసంఖ్య.... | 6,599 |
| 5. | ఉపయోగంలో లేని బావులసంఖ్య .... | 98 |
| 6. | రిజర్వాయర్లు .... | — |
| 7. | చెరువులు | |
| | (ఎ) నూరు ఎకరాలు అంతకన్న ఎక్కువ ఆయకట్టు కలవి .... | 64,679 |
| | (బి) నూరు ఎకరాలకన్న తక్కువ ఆయకట్టు గలవి .... | 2 534 |

## నీటిపారుదల జరుగుచున్న భూమి విస్తీర్ణం

| | | |
|---|---|---|
| 1 | ప్రభుత్వ కాలువలద్వారా .... | 1,09,339 |
| 2 | ప్రయివేటు కాలువలద్వారా .... | 13,748 |
| 3. | చెరువులద్వారా .... | 1,98,269 |
| 4. | బావులద్వారా | |
| | (ఎ) కేవలం నీటి పారుదలకు ఉపయోగించ బడేవి .... | 25,260 |
| | (బి) ఇతర నీటి పారుదల వనరులకు తోడ్పడేవి .... | 8,457 |
| | (సి) ఇతర వనరులు (ఊటకాలువలు మొదలయినవి) .... | 27,622 |

| | | |
|---|---|---|
| 5. | నీటిపారుదల జరుగుచున్న మొత్తం భూమి .... | 3,74,238 |
| 6. | పంటపండే నికరపు భూమిలో నీటి పారుదల జరిగే భూమి శాతం .... | 50.0 |
| 7. | ఒకే సంవత్సరంలో ఒకసారి కంటె ఎక్కువగా నీటి పారుదల జరిగే విస్తీర్ణం .... | 1,31,907 |
| 8. | నీటిపారుదల వల్ల పంటలు పండే మొత్తం భూమి విస్తీర్ణం .... | 5,06,145 |
| 9. | పంటపండే మొత్తం విస్తీర్ణంలో నీటిపారుదల జరిగే విస్తీర్ణం యొక్క శాతం .... | 54 ౬ |
| 10. | స్వంత ఆయకట్టుండే బావులు .... | 264 |
| 11. | గుర్తించ బడిన నీటిపారుదల వనరులకు తోడ్పడే బావులు .... | 28,110 |
| 12. | నీటిపారుదల జరిగే మొత్తం నికరపు విస్తీర్ణంలో స్వంత ఆయకట్టుండే బావులద్వారా నీటిపారుదల జరిగే విస్తీర్ణం యొక్క శాతం .... | 5.8 |
| 13. | అయిలు ఇంజన్ల సంఖ్య ... | 24 |

## పంటలు

1956—57 లో ఈ జిల్లాలోసాగుచేయబడిన భూమి, పండించబడిన పంటల వివరాలు క్రిందయివ్వ బడినాయి.

| పంటలు | | విస్తీర్ణం ఎకరాలలో | మొత్తం పంట (టన్నులలో) |
|---|---|---|---|
| **1. చిరుధాన్యాలు** | | | |
| 1. | వరి | 3,12,986 | 1,44,250 |
| 2. | గోధుమ | — | — |
| 3. | జొన్న | 25,702 | 4,620 |
| 4. | సజ్జ | 1,19,905 | 23,660 |
| 5, | బార్లి | — | — |
| 6. | మొక్కజొన్న | 420 | 170 |
| 7. | రాగి | 75,078 | 30,350 |
| 8. | కొఱ్ఱ | 7,791 | 1,880 |
| 9. | వరగు | 5,281 | 1,600 |
| 10. | సమాయి | 9,956 | 2,000 |
| 11. | ఇతర చిరుధాన్యాలు | 5,942 | 1,190 |
| | మొత్తం చిరుధాన్యాలు | 5,63,061 | 2,09,730 |
| **2. పప్పుధాన్యాలు** | | | |
| 1, | శనగలు | 507 | 110 |
| 2. | పెసలు | 35,989 | 3,470 |
| 3. | కందులు | 8,981 | 1,370 |
| 4. | మినుములు | 7,192 | 690 |

| | | | |
|---|---|---|---|
| 5. | ఉలవలు | 45,550 | 3,500 |
| 6. | ఇతర పప్పుధాన్యాలు | 10,721 | 650 |
| | మొత్తం పప్పుధాన్యాలు | 1,06.940 | 9,790 |
| 3. | సంబారాలు | | |
| 1. | పోకచెక్కలు | — | — |
| 2. | మిరపకాయలు | 7,687 | 7,024 |
| 3. | అల్లం | — | — |
| 4. | పసుపు | 4 | వివరాలు అందుబాటులో లేవు |
| 5. | వెల్లుల్లి | — | — |
| 6. | ధనియాలు | 14 | వివరాలు అందుబాటులో లేవు |
| 7. | చింతపండు | 1,725 | వివరాలు అందుబాటులో లేవు |
| 8. | ఇతర సంబారాలు | 649 | — |
| | మొత్తం సంబారాలు | 10,059 | 7,024 |
| 4. | చక్కెర పంటలు | | |
| 1. | చెరకు | 37,106 | 1,07,240 |
| 2. | తాటి | 418 | — |
| 3. | ఇతరములు | — | — |
| | మొత్తం చక్కెర పంటలు | 37,524 | 1,07,240 |
| 5. | పండ్లు కూరగాయలు | | |
| 1. | (ఎ) తాజాపండ్లు | | |
| | (i) అరటి పండ్లు | 1,083 | వివరాలు అందుబాటులో లేవు |

| | | |
|---|---|---|
| (ii) నిమ్మజాతికి చెందిన పండ్లు | 715 | --- |
| (iii) మామిడిపండ్లు | 16,061 | --- |
| (iv) ఇతర తాజాపండ్లు | 156 | --- |
| మొత్తం తాజా పండ్లు | 18,017 | --- |
| (బి) ఎండుపండ్లు | | |
| (i) జీడిగింజలు | 300 | --- |
| (ii) ఇతరఎండుపండ్లు | 120 | --- |
| మొత్తం ఎండుపండ్లు | 420 | --- |
| మొత్తం ఎండు పండ్లు, తాజాపండ్లు, | 18,437 | --- |
| 2. కూరగాయలు | | |
| (ఎ) బంగాళ దుంపలు | --- | --- |
| (బి) కర్రపెండలము | 874 | 1,000 |
| (సి) చిలగడ దుంపలు | 1452 | --- |
| (డి) ఉల్లిగడ్డలు | 2,809 | 14,300 |
| (ఇ) ఇతరకూరగాయలు | 2,239 | 2,572 |
| మొత్తం కూరగాయలు | 8,230 | 17,872 |
| మొత్తం పండ్లు, కూరగాయలు దుంప పంటలతో సహా | 26,667 | --- |
| 6. వివిధ రకాలకు చెందిన యితర ఆహారపంటలు | 41 | --- |
| మొత్తం ఆహార పంటలు | 7,44,292 | --- |

## ఆహారేతర పంటలు

### 1. నారలు

| | | | |
|---|---|---|---|
| 1. | ప్రత్తి | 2,442 | 300 బేళ్లు |
| 2. | బొంబాయి జనుము | 4,317 | 12,820 |
| 3. | జనుము | 1,048 | --- |
| 4. | ఇతర నారలు | 6,743 | --- |
| | మొత్తం నారలు | 14,550 | 13,120 |

### 2. నూనె గింజలు

(ఎ) ఆహారంలో ఉపయోగించ బడేవి

| | | | |
|---|---|---|---|
| 1. | వేరుశనగ | 70,440 | 33,100 టన్నులు |
| 2. | కొబ్బరి | 2,972 | — |
| 3. | నువ్వులు | 55,286 | 7,800 |
| 4. | రేప్ విత్తనాలు, ఆవాలు | — | — |
| 5. | కుసుములు | — | — |
| 6. | ఇతరములు | — | — |
| | మొత్తం | 1,28,698 | 40,400 |

(బి) ఆహారంలో ఉపయోగించ బడనివి

| | | | |
|---|---|---|---|
| (i) | ఎల్లగిసె విత్తనాలు | 88 | — |
| (ii) | ఆముదాలు | 437 | 40 |
| (iii) | నిగర్ విత్తనాలు | 5,000 | — |
| (iv) | ఇతరములు | — | — |
| | మొత్తం ఆహారంలో ఉపయోగించబడని నూనె గింజలు | 5,525 | 40 |

| | | |
|---|---|---|
| మొత్తం నూనె గింజలు | 1,34,223 | 40,440 |
| 3. ఆర్ధకం రంగులు, తోళ్ల పరికరాలు | | |
| (1) నీలిమందు (అద్దకం కోసం) | 19 | — |
| (2) ఇతర అద్దకపు రంగులు | 10 | — |
| మొత్తం అద్దకం రంగులు | 29 | — |
| 4. మందులు, మత్తు పదార్థాలు | | |
| 1. కాఫీ | 4 ! | — |
| 2. జనుము | 230 | — |
| 3. తమలపాకులు | — | — |
| 4. పొగాకు | 3,123 | 2,000 |
| 5. ఇతర మందులు, మత్తు పదార్థాలు | — | — |
| మొత్తం మందులు, మత్తు పదార్థాలు | 3,397 | 2,000 |
| 5. పశు గ్రాసపు పంటలు | 810 | — |
| 6. పచ్చి ఎరువు పైరులు | | |
| 1. జనుము | 715 | — |
| 2. నీలిమందు | 14250 | — |
| 3. ఇతరములు | 900 | — |
| మొత్తం పచ్చి ఎరువు పైరులు | 15,864 | — |

| | | | |
|---|---|---|---|
| 7. | వివిధ ఆహారేతర పంటలు | 14,455 | — |
| | 1. మొత్తం ఆహారేతర పంటలు | 1,86,667 | — |
| | 2. మొత్తం పంట భూమి | 9,30,950 | — |
| | 3. ఒకసారి కంటె ఎక్కువగా పండే భూమి | 1,82,166 | — |
| | 4. నికరపు పంట భూమి | 7,48,794 | — |

## స్థానిక పరిపాలన

30—9—59 తేదీ నాటికి యీజిల్లాలో విశాఖపట్టణం, విజయనగరం అనకాపల్లి, భీమునిపట్టణంలలో నాలుగు మునిసిపాలిటీలు, 883 పంచాయతీలు ఉన్నాయి.

## తపాలా కార్యాలయాలు

1—4—1959 తేదీ నాటికి యీజిల్లాలో ఒక హెడ్ ఆఫీసు. 36 సబ్ ఆఫీసులు, 328 బ్రాంచి ఆఫీసులు, 24 టెలిగ్రాఫ్ ఆఫీసులు 5 టెలిఫోన్ ఎక్స్చేంజీలు. 12 పబ్లిక్ కాల్ ఆఫీసులు ఉన్నాయి.

## రైలు మార్గాలు

ఈ జిల్లాలో దక్షిణ రైల్వేవారికి చెందిన 58½ మైళ్ళ బ్రాడుగేజి రైలు మార్గం, ఈశాన్య రైల్వేకు చెందిన 69 మైళ్ళ బ్రాడుగేజి రైలుమార్గ ఉన్నాయి. ఎలమంచిలి, అనకాపల్లి, శృంగవరపుకోట, విజయనగరం, విశాఖపట్టణం, భీమునిపట్టణం తాలూకాలగుండా మద్రాసు—కలకత్తా రైలుమార్గం పోతుంది. ప్రధానమార్గంమీద ఉన్న వాల్తేరుతో కలుపుతూ విశాఖపట్టణానికి బ్రాంచిమార్గం ఉన్నది. ఇంకొక బ్రాంచిమార్గం విజయనగరంనుండి రాయపూరుకు శ్రీకాకుళం జిల్లాలోని బొబ్బిలి మీదుగా పోతుంది.

## రోడ్లు

ఈ జిల్లాలో 1,161 మైళ్ల రోడ్లు ఉన్నాయి. అవి క్రింది విధంగా వర్గీకరించ బడినాయి, (1-4-1959)

| | | మైళ్లు. |
|---|---|---|
| 1. | జాతీయ రహదారులతో సహా రాజ్యరహదార్ల శాఖచే నిర్వహించ బడుతున్న రోడ్లు. | 610 |
| 2. | మునిసిపాలిటీలచే నిర్వహించబడుతున్న రోడ్లు. | 145 |
| 3. | స్థానిక సంస్థలచే నిర్వహించ బడుతున్న రోడ్లు. | 406 |
| | మొత్తం. | 11,061 |

## సహకారం

30—6—1957 తేదీనాటికి యీ జిల్లాలో 18 రాజ్య మరియు కేంద్ర పరపతేతర సంఘాలు, 453 వ్యవసాయ సహకార సంఘాలు, 129 వ్యవసాయేతర సహకార సంఘాలు ఉన్నాయి- వీటిలో సభ్యుల సంఖ్య వరుసగా 7,249; 104,398; మరియు 49,223.

## విద్య

1955—56 లో యీ జిల్లాలోని విద్యా సంస్థల సంఖ్య క్రింద యివ్వ బడింది.

| | | |
|---|---|---|
| 1. | ఉన్నతపాఠశాలలు, | 35 |
| 2. | మాధ్యమిక పాఠశాలలు. | 6 |
| 3. | ప్రాథమిక పాఠశాలలు. | 1,704 |
| 4. | వయోజన విద్యా కేంద్రాలు, | 95 |
| 5. | ప్రత్యేక పాఠశాలలు, వృత్తి విద్యా కేంద్రాలు. | 17 |

| | | |
|---|---|---|
| 6. | కళాశాలలు. (వృత్తి విద్యాకళాశాలలు కలుపు కొని) | 9. |
| | మొత్తం. | 1,866 |

## వైద్యం, ఆసుపత్రులు.

శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలు రెండింటిలోను కలిపి 27 జనరలు ఆసుపత్రులు, 25 వైద్యశాలలు ప్రత్యేకచికిత్స కోసం 2 ఆసుపత్రులు ఉన్నాయి.

# రెండవ ప్రణాళికలోని నాలుగవ సంవత్సరపు కార్యక్రమ స్వరూపం

ప్లానింగు కమీషను ఉద్యోగులతోను, కేంద్ర మంత్రాంగశాఖల ఉద్యోగులతోను రాజ్య ప్రభుత్వోద్యోగులు సంప్రదింపులు జరిపిన తరువాత రెండవ ప్రణాళికయొక్క నాలుగవ సంవత్సరపు కార్యక్రమం క్రింద రు. 37.66 కోట్లమొత్తాన్ని ఖర్చుపెట్టడానికి నిర్ణయించబడింది. అయితే వివిధ విషయాలను పరిశీలించిన తరువాతను, ప్రణాళిక, అభివృద్ధి విషయాలను గురించి సలహాలనిచ్చుటకు ఏర్పాటు చేయబడిన రాజ్యసలహా సంఘంలో యీ విషయాన్ని గురించి సమగ్రచర్చలు జరిపినఅనంతరం రాజ్యప్రభుత్వం వారు ఈ సంవత్సరం ఖర్చుపెట్టదలచినమొత్తాన్ని రు. 42.03 కోట్లకు పెంచడానికి నిర్ణయించారు ఈ విధంగా కేటాయింపు మొత్తాన్ని పెంచటానికి ముఖ్య కారణాలేవంటే:

1. ఈ సంవత్సరం కేటాయింపు మొత్తాన్ని హెచ్చుచేయక పోయినట్లయితేరెండవ ప్రణాళిక యొక్క ఆఖరిసంవత్సరంలో చేయవలసిన పనులు ఎక్కువగా మిగిలిపోతాయి;

2. పెంచబడిన కేటాయింపు మొత్తాన్ని ఖర్చుపెట్టటానికి తగిన విధంగా రాజ్యపరిపాలనా యంత్రాంగం సంసిద్ధం చేయబడింది

3. ప్రస్తుతమున్న ఆదాయమార్గాలను పూర్తిగా వినియోగించుకోవలసిన అవసరం ఎంతో ఉన్నది.

4. రాజ్య ప్రభుత్వం యొక్క ఆదాయమార్గాలుకూడ యీపాటి ప్రణాళికను అమలు పరచటానికి చాలినంతగా వున్నాయి.

ప్రతి అభివృద్ధి కార్యక్రమంక్రిందా కేటాయించబడిన మొత్తం పెంచబడింది. ఈ వివరాల్ని మొదటి పట్టికలో చూడవచ్చును.

ఈ సంవత్సరం ఖర్చుపెట్టదలచిన మొత్తం ఇదివరకటి సంవత్సరాలకంటే చాలఎక్కువ. గత సంవత్సరం మొదట నిర్ణయించి, తరువాత సవరించబడిన మొత్తాలకంటే ఇది వరుసగా రు. 12 మరియు 7 కోట్లు ఎక్కువ. ప్రణాళిక యొక్క మొదటినాలుగు సంవత్సరాల్లోను కేటాయించబడిన మొత్తం వివరాలు రెండవ పట్టికలో చూడవచ్చును.

వివిధ విషయాల పద్దుక్రింద యివ్వబడిన కార్యక్రమాల కేటాయింపు విషయంలో చేయబడిన కొద్దిపాటి తగ్గింపు మినహా మిగతఅన్ని అభివృద్ధి కార్యక్రమాల క్రింద కేటాయింపు మొత్తం అధికం చేయబడింది. అయితే 1958-59 సంవత్సరంతో పోల్చిచూస్తే కేటాయింపులో ఎక్కువభాగం పరిశ్రమలకు, రవాణాకు, సాంఘిక కార్యక్రమాలకు ప్రత్యేకించబడిన విషయం విదితం కాగలదు. అయినప్పటికి వివిధ కార్యక్రమాలకు దాదాపు గత సంవత్సరంలో యివ్వబడిన క్రమంలోనే ప్రాధాన్యం యివ్వబడింది,

ఈ సంవత్సరం అమలు పరచటానికి ప్రతిపాదింపబడిన పథకాలు. వాటికి కేటాయించబడిన డబ్బు సాధించదలచిన లక్ష్యాలను గురించిన సమగ్ర వివరణలు రెండవ భాగంలో చూడవచ్చును.

ఈ సంవత్సరపు కార్యక్రమాన్ని గురించి సంగ్రహంగా తెలపటం కోసం 1959-60 లో సాధించదలచిన లక్ష్యాలను గురించిన వివరాలు క్రింద యివ్వబడినాయి.

## కొన్ని లక్ష్యాల వివరాలు.

| పద్దు | యూనిట్టు | 1959—60 సంవత్సరపు లక్ష్యాలు |
|---|---|---|
| 1. వ్యవసాయం | | |
| ఆహార ధాన్యాల ఉత్పత్తి | 000 టన్నులు | |
| (i) పెద్దతరహా నీటిపారుదల పనులు | ,, | 190.60 |
| (ii) చిన్నతరహా నీటిపారుదల పనులు | ,, | 38.70 |
| (iii) భూమి అభివృద్ధి | ,, | 44.50 |
| (iv) ఎరువులు, రసాయనిక ఎరువులు | ,, | 43.00 |
| (v) మేలురకం విత్తనాలు | ,, | 21,00 |
| (vi) సస్య రక్షణ | — | — |
| (vii) పై కార్యక్రమాల క్రింద ఉత్పత్తికి వీలు కల్పించ బడిన తరువాత మేలురకం వ్యవసాయ విధానాలు అవలంబించటానికి | | 89.60 |
| | | 427.40 |
| ఆహారేతర పంటలవల్ల తగ్గింపు. | | 11.30 |
| | | 416.10 |
| చిన్నతరహా నీటిపారుదల పనులు | 000 ఎకరాలు | |
| నీటిపారుదల కల్పించబడుతున్న భూమి | — | వివరాలు అందుబాటులో లేవు. |

| | | |
|---|---|---|
| విత్తనాల క్షేత్రాలు | సంఖ్య | 188 |
| (i) భూమి స్వాధీనం చేసుకోబడినట్టి వాటి సంఖ్య | — | — |
| (ii) వ్యవసాయ కార్యకలాపాలు ప్రారంభించ బడినట్టి వాటి సంఖ్య. | — | — |
| (iii) విత్తనాల ఉత్పత్తి ప్రారంభమైన వాటి సంఖ్య | — | — |
| ఎరువులు | 000 టన్నులు | |
| (i) పట్టణాలలో గోతి ఎరువు | ,, | 245 16 |
| (ii) గ్రామాల్లో గోతి ఎరువు | ,, | ప్రతి పంచాయతీలోను 75 టన్నులు. |
| (iii) పచ్చి ఎరువులు | ,, | 0.40 |
| రసాయనిక ఎరువులు | 000 టన్నులు | |
| (i) అమ్మోనియం సల్ఫేటు | ,, | 148.40 |
| (ii) సూపర్ ఫాస్ఫేటు | ,, | 47.60 |
| (iii) యూరియా | ,, | 19.50 |
| (iv) అమ్మోనియం నైట్రేట్ | ,, | 27 50 |
| (v) కాల్షియం అమ్మోనియం నైట్రేటు | ,, | 8.00 |
| రాజ్య ప్రభుత్వంచే భూములలో స్థిరపరచబడేటటువంటి భూముల్లేని కుటుంబాలు | సంఖ్య | వివరాలు అందుబాటులో లేవు |

2. పశుగణాభి వృద్ధి

కీలక గ్రామ పథకం.

| | | |
|---|---|---|
| కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాలు | సంఖ్య | 11 |
| కీలక గ్రామ కేంద్రాలు | ,, | 66 |

3. సహకారం

చిన్న తరహా సంఘాలు.

| | | |
|---|---|---|
| ( i ) ప్రతిష్ఠం చేయబడేవి | సంఖ్య | 1,000 |
| (ii ) క్రొత్తవి | ,, | 1,000 |
| (iii) సహకార వ్యవసాయ సంఘాలు | ,, | 12 |
| (iv ) సహకార వ్యవసాయ సంఘాలు. విస్తీర్ణం ఎకరాలలో | | 3,376 |

సహకార పరపతి సంఘాల ద్వారా ఇవ్వ బడే వ్యవసాయ ఋణం — రూపాయలు లక్షలలో (సంవత్సరానికి)

| | | |
|---|---|---|
| స్వల్పకాలిక ఋణాలు | ,, | 1,320 |
| మధ్యకాలిక ఋణాలు | ,, | 130 |
| దీర్ఘకాలిక ఋణాలు | ,, | 171 |
| మార్కెటింగు ఫైనాన్సు | ,, | 450 |

4. సామాజికాభివృద్ధి బ్లాకులు

(జాతీయ విస్తరణ సేవా కేంద్రాలతోసహా)

| | | |
|---|---|---|
| | సంఖ్య | మొదటిదశ బ్లాకులు 28 |
| | | రెండవదశ బ్లాకులు 20 |
| జనాభా | మిలియన్లు | 1,675 |
| ఉపయోగం పొందే గ్రామాల సంఖ్య | సంఖ్య | 1,600 |

5. పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు

| | | |
|---|---|---|
| | 000 | |
| సంభవమయ్యే అదనపు నీటిపారుదల | ఎకరాలు | 418 |
| అదనంగా నీటిపారుదల కల్పించబడే భూమి | ,, | 418 |

6. విద్యుచ్ఛక్తి

| | | |
|---|---|---|
| | 000 | |
| అదనపు ఇన్స్టాల్డు కెపాసిటి | కిలోవాట్లు | 29.750 |
| 33 కిలోవాట్లకు మించిన ట్రాన్సుమిషను లైన్లు | మైళ్ళు | 290 |
| 33 కె.వి. మరియు అంతకంటె తక్కువ ట్రాన్సుమిషనులైన్లు | మైళ్ళు | 400 |
| విద్యుతీకరణం చేయబడే పట్టణాలు, గ్రామాల సంఖ్య. | సంఖ్య | 200 |

7. వరద నివారణ.

| | | |
|---|---|---|
| | 000 | |
| అదనంగా రక్షణకల్పించబడే భూమి | ఎకరాలు | 48 |

8. రోడ్లు.

| | | |
|---|---|---|
| నిర్మించబడే కంకరరోడ్లు. | మైళ్ళు | 29.4 |

9. విద్య.

| సంస్థలు. | సంఖ్య | |
|---|---|---|
| ప్రాథమిక పాఠశాలలు, జూనియరు బేసిక్ పాఠశాలలు కలుపుకొని | ,, | 1,600 |
| జూనియరు బేసిక్ పాఠశాలలు | ,, | 419 |

| | | |
|---|---|---|
| మాధ్యమిక పాఠశాలలు, సీనియరు బేసిక్ పాఠశాలలు కలుపుకొని | ,, | 32 |
| సీనియరు బేసిక్ పాఠశాలలు | ,, | — |
| ఉన్నత పాఠశాలలు. | ,, | 18 |
| హైయ్యర్ సెకండరి పాఠశాలలు | . | 10 |
| బహూళార్థ సాధక పాఠశాలలు | ,, | 4 |
| సాంకేతిక విద్య—డిగ్రీ/డిప్లొమా | ,, | — |
| వివిధ తరగతులలో చేర్చుకోబడే విద్యార్థుల సంఖ్య | డిప్లొమా | 1,150 |
| | డిగ్రీ | 360 |
| i నుండి v తరగతి వరకు | సంఖ్య,, | 50,000 |
| vi నుండి viii తరగతి వరకు | ,, | 20,910 |
| ix నుండి xi తరగతి వరకు | ,, | 6,900 |
| ఉపాధ్యాయులకు శిక్షణ శిక్షణ పాఠశాల (బేసిక్, నాన్ బేసిక్ తరగతులు కలుపుకొని) లలో చేర్చుకోబడే వారి సంఖ్య ... | సంఖ్య | 2,250 |
| శిక్షణ కళాశాలలలో (బేసిక్, నాన్-బేసిక్ తరగతులు కలుపుకొని) చేర్చుకోబడేవారి సంఖ్య .... | సంఖ్య | 200 |

## 10. ఆరోగ్యం

| | | |
|---|---|---|
| ఆరోగ్య కేంద్రాలు | సంఖ్య | |
| సామాజికాభివృద్ధి కార్యక్రమం కింద ఇతర కార్యక్రమం క్రింద | ,, | 20 |
| కుటుంబ నియంత్రణ కేంద్రాలు | సంఖ్య | |
| i పట్టణ కేంద్రాలు | ,, | 15 |
| ii గ్రామీణ కేంద్రాలు | ,, | 44 |

శిక్షణ సౌకర్యాలు

| | | |
|---|---|---|
| i డాక్టర్లు | సంఖ్య | 450 |
| ii నర్సులు | ,, | 120 |
| iii దాయీలు | ,, | 720 |
| iv సహాయక నర్సు-మంత్రసానులు | ,, | 90 |
| v మంత్రసానులు | ,, | 158 |

11. గృహనిర్మాణం

| | | |
|---|---|---|
| పారిశ్రామిక గృహావసతి | | |
| నిర్మించ బడిన యూనిట్లు | ,, | 1,365 |
| తక్కువ ఆదాయం గలవారికి గృహ నిర్మాణం | ,, | |
| నిర్మించ బడిన యూనిట్లు సంఖ్య | ఆర్. సి. ఎస్. | 680 |
| | డి. టి. పి. | 180 |

12. కార్మికులు, కార్మిక సంక్షేమం.

| | | |
|---|---|---|
| వృత్తి పనివారికి శిక్షణ | సంఖ్య | వివరాలు అందుబాటులో లేవు |
| శిక్షణ కేంద్రాలు | ,, | — |
| శిక్షణ యివ్వబడిన వారి సంఖ్య | ,, | 1 816 |

13. వెనుకబడిన తరగతుల సంక్షేమం.

| | | |
|---|---|---|
| షెడ్యూల్డు తెగలు. | | |
| స్కాలరుషిప్పులు | ,, | 2,465 |
| సహాయం చేయబడిన కుటుంబాలు | ,, | 637 |
| తెరవబడిన వైద్యాలయాలు | ,, | — |

| | | |
|---|---|---|
| నిర్మించబడిన రోడ్లు. | మైళ్ళు | 78 |
| షెడ్యూల్డు కులాలు. | | |
| స్కాలరు షిప్పులు | సంఖ్య | 4,900 |
| సహాయంచేయబడిన కుటుంబాలు | ,, | 850 |
| విముక్త జాతులు. | | |
| స్కాలరు షిప్పులు | ,, | — |
| పునరావాసం కల్పించబడిన కుటుంబాలు, | ,, | 275 |
| ఇతర వెనుకబడిన తరగతులు. | | |
| స్కాలరు షిప్పులు | ,, | 5.730 |
| సహాయంచేయబడిన కుటుంబాలు | ,, | — |

# మొదటి పట్టిక

## 1959—60 సం.పు ప్రణాళికలో కేటాయించబడిన మొత్తం వివరాలు
## (రూపాయలు లక్షలలో)

| వరుస సంఖ్య | అభివృద్ధి కార్యక్రమం | 1959-60 లో కేటాయింపు ఆంధ్ర | తెలంగాణా | ఆంధ్ర ప్రదేశ్ | మొత్తం ప్రణాళిక కేటాయింపుకు శాతం |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| | వ్యవసాయ కార్యక్రమాలు — | 687.142 | 373.080 | 1060.222 | 25.23 |
| 1. | వ్యవసాయోత్పత్తి | 120.710 | 47.180 | 167.890 | 4.00 |
| 2. | చిన్నతరహా నీటిపారుదల పనులు | 105. 81 | 69. 19 | 175.000 | 4.16 |
| 3. | భూమి అభివృద్ధి | 5.300 | — | 5.300 | 0.13 |
| 4. | పశుసంవర్ధన | 66.062 | 21.470 | 87.532 | 2.08 |
| 5. | పాడిపరిశ్రమ, పాల సరఫరా | 12.550 | 15.940 | 28.490 | 0.68 |
| 6. | అడవులు | 16.520 | 21.720 | 38.240 | 0.91 |
| 7. | భూసార సంరక్షణ | 13.810 | 6.060 | 19.870 | 0.47 |
| 8. | మత్స్య సంవర్ధన | 15.710 | 7.290 | 23.000 | 0.55 |
| 9. | సహకారం, గిడ్డంగులు, మార్కెటింగు | 81.370 | 58.270 | 139.640 | 3.32 |
| 10. | వివిధ విషయాలు | 3.000 | 1.360 | 4.360 | 0.10 |
| 11. | జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు, సామాజికాభివృద్ధి కార్యక్రమాలు. | 240.850 | 119.150 | 360.000 | 8.57 |
| 12. | పంచాయితీలను పటిష్టం చేయటం. | 5.450 | 5.450 | 10.900 | 0.26 |

| వరుస సంఖ్య | అభివృద్ధి కార్యక్రమం | 1959-60 లో కేటాయింపు ఆంధ్ర | తెలంగాణా | ఆంధ్ర ప్రదేశ్ | మొత్తం ప్రణాళిక కేటాయింపుకు శాతం |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| | నీటి పారుదల, విద్యుచ్ఛక్తి | 994.960 | 711.090 | 1706.050 | 40.60 |
| 13. | బహుళార్థ సాధక ప్రాజెక్టులు | 445.000 | 255.000 | 700.000 | 16.66 |
| 14. | పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు. | 242.470 | 265.220 | 507.690 | 12.08 |
| 15. | విద్యుచ్ఛక్తి. | 307.490 | 190.870 | 498.360 | 11.86 |
| | పరిశ్రమలు, | 219.720 | 75.410 | 295.130 | 7.02 |
| 16. | పెద్దతరహా, మధ్యతరహా పరిశ్రమలు | 83.850 | — | 83.850 | 1.99 |
| 17. | గ్రామీణ పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు | 88.750 | 54.630 | 143.380 | 3.41 |
| 18. | చేనేత పరిశ్రమలు | 47.120 | 20.780 | 67.900 | 1.62 |
| | ర వా ణా | 145.920 | 64.430 | 210.350 | 5.01 |
| 19. | రోడ్లు. | 116.090 | 64.430 | 180.520 | 4.30 |
| 20. | రోడ్డు రవాణా | 29.830 | — | 29.830 | 0.71 |
| | సాంఘిక కార్యక్రమాలు | 514.980 | 361.826 | 876.806 | 20.86 |
| 21. | విద్య. | 188.670 | 134.610 | 323.280 | 7.69 |
| 22. | వైద్యం | 88.060 | 61.940 | 150.000 | 3.57 |
| 23. | ప్రజారోగ్యం | 46.540 | 30.390 | 76.930 | 1.83 |

| వరుస సంఖ్య | అభివృద్ధి కార్యక్రమం | 1959-60 లో కేటాయింపు ఆంధ్ర | తెలంగాణా | ఆంధ్ర ప్రదేశ్ | మొత్తం ప్రణాళిక కేటాయింపుకు శాతం |
|---|---|---|---|---|---|
| 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| 24. | గ్రామీణ, పట్టణ నీటి సరఫరా | 16.340 | 33.280 | 49.620 | 1.18 |
| 25. | గృహ నిర్మాణం | 46. 17 | 66. 08 | 112.250 | 2.67 |
| 26. | కార్మికులు, కార్మిక సంక్షేమం | 16.510 | 14.050 | 30 .560 | 0.73 |
| 27. | వెనుకబడిన తరగతుల, షెడ్యూల్డు కులాల సంక్షేమం | 40.920 | 14.350 | 55.270 | 1.32 |
| 28. | షెడ్యూల్డుతెగల సంక్షేమం | 48.160 | 5.666 | 53.826 | 1.28 |
| 28. | స్త్రీ సంక్షేమం | 4.110 | 1.460 | 5.570 | 0.13 |
| 30. | సాంఘిక సంక్షేమం | 19.500 | — | 19.500 | 0.46 |
| | వివిధ విషయాలు. | 49.250 | 4.710 | 53.960 | 1.28 |
| 31. | రాజధాని అభివృద్ధి. | 20.000 | — | 20.000 | 0.48 |
| 32. | మునిసిపలు రోడ్లు, అభివృద్ధి పనులు | 11.590 | — | 11.590 | 0.28 |
| 33. | రేడియో ప్రసారం | 4.860 | 1.670 | 6.530 | 0.15 |
| 34. | ప్రచారం. | 3.760 | 3.040 | 6.800 | 0.16 |
| 35. | అర్థ గణాంక శాఖ. | 9.040 | — | 9.040 | 0.21 |
| | మొత్తం. .... | 2611.972 | 1519.546 | 4202.518 | 100.00 |

25

# వ్యవసాయోత్పత్తి

## మేలురకం విత్తనాల ఉత్పత్తి, పంపకం

## (విత్తనాల క్షేత్రాలు, విత్తనాల స్టోర్లు)

వ్యవసాయోత్పత్తిని ఎక్కువచేసే ఉద్దేశంతో ప్రతి బ్లాకులోను ఒక విత్తనాల క్షేత్రాన్ని ఏర్పాటు చేయడానికి, ఒక విత్తనాల స్టోరును నిర్మించడానికి సంబంధించిన పథకం భారత ప్రభుత్వం వారి ప్రోద్బలంతో ప్రారంభించబడింది. ప్రాథమిక విత్తనాల క్షేత్రాలను నిర్వహించటం కోసం రిజిస్టరయిన ఉత్పత్తి దారులకు పంపకం చేయడానికి గాను పెద్ద ఎత్తున మూల విత్తనాలను ఉత్పత్తి చేసేటందుకు యీ విత్తనాల క్షేత్రాలు ఉపయోగపడతాయి. రిజిస్టరయిన ఉత్పత్తిదారులు తమ పొలాల్లో మేలు రకం విత్తనాలను వ్యవసాయశాఖవారి కట్టుదిట్టమైన పర్యవేక్షణ క్రింద ఉత్పత్తి చేస్తారు. ఇందులో సగం విత్తనాలు వీరినుండి సేకరించబడి రైతులకు సరఫరా చేయటంకోసం వివిధ విత్తనాల స్టోర్లలో నిలువ చేయబడతాయి. ఈ సంవత్సరంలో 129 విత్తనాల క్షేత్రాలను, 129 విత్తనాలస్టోర్లను ఆంధ్ర ప్రాంతంలో ఏర్పాటు చేయడానికి గాను ప్రణాళికలో రు. 42.29 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 4.26 లక్షల మొత్తం ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది. ఈ మొత్తంతో 13 విత్తనాల క్షేత్రాలు 13 విత్తనాల స్టోర్లు ఈ జిల్లాలో ఏర్పాటు చేయబడతాయి.

### పంట చీడల, తెగుళ్ల నివారణ

పంటలకు తగిలే చీడలను, తెగుళ్లను అరికట్టేటందుకు నివారణ చర్యలను తీసికోవడం కోసం వ్యవసాయశాఖ డిపోలలో ఉన్న పరికరాలను ఎక్కువ చేయటానికిగాను స్ప్రేయర్లను (పిచికారీలు), డస్టర్లను (పొడిచల్లుసాధనాలు) కొనటానికి యీ పథకం క్రింద ఉద్దేశించ బడింది. ప్రతిజిల్లా కేంద్రంలోను నియమించ బడిన ప్లాంట్ ప్రొటెక్షన్ అసిస్టెంట్లకు సలహాలివ్వటంకోసం ఇద్దరు ప్లాంట్ ప్రొటెక్షన్ ఆఫీసర్లు (మైకాలజీకి ఒకరు, ఎంటమాలజీకి ఒకరు) నియమించబడినారు. సస్యరక్షణ చర్యలు తీసికోవటం కోసం ఒక సంచార దళం

కూడ 1957—58 లో ఏర్పాటు చేయబడింది. ఈ దళానికి మూడు సంచార వ్యానులు సమకూర్చ బడినాయి. ఇవి యిప్పుడు ఆంధ్ర ప్రాంతంలో పని చేస్తున్నాయి. ఈ పథకం క్రింద నియమించబడిన సిబ్బందిని, సంచార సస్య రక్షణ దళాన్ని కొనసాగించటానికి, విదుచ్ఛక్తితో నడుపబడే 70 స్ప్రేయర్లను, చేతితో నడుపబడే 500 డస్టర్లను కొనటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 5.42 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.49 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## తక్కువ ధరలకు విత్తనాల సరఫరా

ఈ పథకం క్రింద మేలురకం వరి, జొన్న, గోధుమ, మొక్కజొన్న, కాయధాన్యాల విత్తనాలు రిజిస్టరయిన ఉత్పత్తిదారులనుండి కొనబడి తగ్గింపు ధరలకు రైతులకు సరఫరా చేయబడతాయి. ఇలా తగ్గింపుధరలకు సరఫరా చేయబడే వరి, గోధుమ, మొక్కజొన్న విత్తనాల ఖరీదు మణుగుకు రెండు రూపాయలు; జొన్న విత్తనాల ఖరీదు మణుగుకు ఒక రూపాయి. ఈ పథకం 1956—57 నుండి తెలంగాణా ప్రాంతంలో అమలు నందున్నది. ఈ సంవత్సరంలో యీ పథకాన్ని ఆంధ్ర ప్రాంతానికి కూడ విస్తరింప చేయడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు గాను 1959—60 ప్రణాళికలో రు. 7.53 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులోరు. 5.22 లక్షల మొత్తం ఆంధ్ర ప్రాంతంలో విత్తనాలను పంచడానికిగాను ప్రత్యేకించ బడింది. మిగత రు. 2.31 లక్షల మొత్తం తెలంగాణా ప్రాంతానికి ప్రత్యేకించబడింది. ఈ జిల్లాలోని రైతులకుకూడ యీ పథకం క్రింద సమకూరే లాభాలు లభ్యమవుతాయి.

## అద్దెకొనుగోలు పద్ధతిపై వ్యవసాయ పనిముట్ల పంపకం.

షుగర్ కేన్ క్రషర్లు (చెరకుగానుగలు), బండ్ ఫార్మర్లు (గట్లు వేసే పనిముట్లు), థ్రాషింగు మెషన్లు (గింజవిడదీసే యంత్రాలు), విన్నోయింగ్ ఫాన్లు, (గాలిచక్రాలు) మొదలయినటువంటి మేలురకం వ్యవసాయ పనిముట్లను నగదు చెల్లించి చిన్న తరహా రైతులు కొనుక్కోలేరు. ఇందువల్ల అవసరమున్న ఆంధ్రప్రాంతంలోని రైతులకోసం పీటినికొని ఆయిలు ఇంజన్లు, ఎలక్ట్రిక్

మోటారు పంపు సెట్ల విషయంలో వలనే అద్దె-కొనుగోలు పద్ధతిపై రైతులకు పంపకం చేయటానికి యీ పథకం క్రింద ఉద్దేశించ బడింది. ప్రతిరైతుకు వ్యక్తిగత హామీపై రు 800 ల వరకు పనిముట్ల రూపంలో ఋణం యివ్వ బడుతుంది. ఈ ఋణంపై సంవత్సరానికి నూటికి నాలుగు రూపాయల వడ్డీ లెక్కకట్టబడుతుంది. ఈ మొత్తం, నాలుగు సమానవాయిదాలలో వసూలు చేయబడుతుంది. 1957—58 లోను 1958—59 లోను యీ పథకం అమలు జరుపబడింది. ఈ సంవత్సరంలో యీ పథకం కొనసాగించ బడుతుంది. ఇందుకు రు. 1.00 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.10 లక్ష యీ జిల్లాలో వినియోగించ బడుతుంది.

## పట్టణాల్లో కంపోస్టు ఎరువుతయారి, పంపకం.

పట్టణాల్లో కంపోస్టు ఎరువు తయారిని, పంపకాన్ని అధికంచేసే ఉద్దేశంతో యీ పథకం క్రింద మునిసిపాలిటీలకు, మేజరు పంచాయితీలకు ఋణాలు యివ్వబడతాయి. ఆంధ్ర ప్రాంతంలో స్థానిక సంస్థలకు ఋణాలను యివ్వటం కోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ జిల్లాలోని స్థానిక సంస్థలకుకూడ యీ ఋణ సహాయం లభిస్తుంది. 14,000 టన్నుల కంపోస్టు ఎరువు తయారు చేయబడి యీ జిల్లాలోని రైతులకు పంపకం చేయబడుతుందని, ఇది 2,800 ఎకరాల భూమికి సరిపోగలదని, ఇందుమూలంగా అదనంగా 350 టన్నుల పంట పండుతుందని ఆశించ బడుతున్నది.

## స్థానికంగా లభ్యమయ్యే చెత్తచెదారాలతో ఎరువుల తయారి.

స్థానికంగా లభ్యమయ్యే చెత్త చెదారం మొదలైన వాటిని నిలువచేసి మేలురకపు పద్ధతులలో కంపోస్టు తయారు చేయడం ద్వారా గ్రామ సీమల్లో ఎరువుల ఉత్పత్తిని అధికం చేయడమే యీ పథకంయొక్క లక్ష్యం. మొట్ట మొదట బ్లాకు ప్రాంతాలలో యీ పథకాన్ని అమలు జరపడానికి, తరువాత రెండవ ప్రణాళికాంతంనాటికి రాజ్యం అంతటికి యీ పథకాన్ని విస్తరింపచేయు డానికి ప్రతిపాదింప బడింది. 1957—58 లోను 1958-59 లోను రాజ్యంలోని 56 బ్లాకులలో యీ పథకం అమలు జరుప బడింది. ఎరువులను తయారు

చేయడంకోసం స్థానికంగా లభ్యమయ్యే పదార్థాలను అభివృద్ధి చేయడానికి అవలంబించ వలసిన విధానాలను గురించి 12,565 మంది రైతులకు శిక్షణ యివ్వబడింది. ఇద్దరు ఫీల్డు మెన్యూరియల్ ఆఫీసర్లు, 20 మంది కంపోస్టు ఇన్‌స్పెక్టర్లు, 20 మంది ఫీల్డుమెన్‌లు, ఒక అప్పరు డివిజను గుమాస్తా, యిద్దరు లోయరు డివిజను గుమాస్తాలు, ముగ్గురు టైపిస్టులు, నలుగురు జవానులతో కూడినప్రత్యేక సిబ్బంది కూడ యీ పథకం క్రింద నియమించ బడింది. పై సిబ్బందిని కొనసాగించటానికి, మరి 47 బ్లాకులకు, యీ పథకాన్ని విస్తరింప చేయడానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 4.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ 47 బ్లాకుల్లో 30 ఆంధ్రప్రాంతంలోను, 17 బ్లాకులు తెలంగాణా ప్రాంతంలోను ఉంటాయి. ఈ సంవత్సరంలో 13,000 మందిరైతులకుశిక్షణ యివ్వబడుతుందనికూడ ఆశింపబడుతున్నది. ఈ సంవత్సరంలో ఈ పథకం గాజులరేగ, అచ్యుతపురం, వడ్డాది బ్లాకులకుయీ పథకం విస్తరింప చేయబడుతుంది. ఈ జిల్లాలోని రైతులుకూడ ఈ పథకంవల్ల ప్రయోజనంపొందుతారు.

## మలమూత్రాదులనుండి గోతి ఎరువును తయారు చేయడం

సఫాయి సౌకర్యాలున్న గ్రామపంచాయితీలలో మలమూత్రాదులనుండి, చెత్తనుండి గోతి ఎరువును ఉత్పత్తి చేయడాన్ని ఈ పథకం ఉద్దేశిస్తున్నది. 1958—59 లో ఆంధ్రప్రాంతంలోని 66 పంచాయితీలకు, తెలంగాణా ప్రాంతంలోని 33 పంచాయితీలకు మొత్తం 99 పంచాయితీలకు ఋణాలను ఇవ్వడానికి రూ. 2.00 లక్షలమొత్తం కేటాయించబడింది. ఈ సంవత్సరం ఆంధ్ర తెలంగాణా ప్రాంతాలలోని పంచాయతీలకు ఋణాలక్రింద మరొక రూ. 2.00 లక్షలు ఇవ్వడానికి ఉద్దేశింపబడింది. అందులో కొంత మొత్తం ఈ జిల్లాలోని పంచాయతీలకుకూడా ఇవ్వబడుతుంది. సుమారు 200 టన్నుల గోతి ఎరువు ఉత్పత్తి చేయబడుతుంది. 40 ఎకరాలలో యిది ఉపయోగించబడుతుంది ఇందువల్ల ఈ జిల్లాలో అదనంగా 5 టన్నుల పంట పండుతుంది.

## చేతితో నడుపబడే స్ప్రేయర్లను, డస్టర్లను తగ్గింపు ధరలకు సరఫరా చేయడం

పంటలకు పెద్ద ఎత్తున చీడలు, తెగుళ్లు తగిలినప్పుడు వీలయినంత త్వరగా సస్య రక్షణ చర్యలను తీసికోవడానికిగాను రైతులు, సహకార

సంఘాలు, పంచాయితీలు మొదలైన సంస్థలు కావలసినన్ని స్ప్రేయర్లను డస్టర్లను కలిగి యుండేటట్లు చేయడమే యీ పథకం యొక్క ఉద్దేశం. కొన్న ధరలో సగం ధరకు యీ పరికరాలు సరఫరా చేయబడతాయి. మిగత సగం ధరను కేంద్ర, రాజ్య ప్రభుత్వాలు భరిస్తాయి. 500 చేతితోనడుప బడే స్ప్రేయర్లను, డస్టర్లను కొనటంకోసం 1958—59 లో రు. 0.90 లక్ష మంజూరు చేయబడింది. ఇంకా 500 స్ప్రేయర్లను, డస్టర్లను కొని సరఫరా చేయడం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.90 లక్ష కేటాయించ బడింది. ఇందులో 25 యీ జిల్లాలో రు. 0.045 లక్ష వ్యయంతో సరఫరా చేయబడతాయి.

## ఆంధ్ర ప్రదేశ్‌లో పండ్లతోటల అభివృద్ధికి సంబంధించిన పథకం

ప్రస్తుతం పండ్లతోటల క్రింద ఉన్న ప్రాంతాన్ని అధికం చేయడం, క్రొత్త ప్రాంతాల్ని పండ్లతోటల క్రిందికు తీసుకురావడం మూలంగా పండ్ల ఉత్పత్తిని పెంచడానికి, వ్యవసాయోత్పత్తిని వివిధ మార్గాలలో అభివృద్ధిచేసే టందుకు, పండ్ల ఉత్పత్తిని అధికంచేయడానికిగాను ప్లానింగు కమీషనువారు చేసిన సిఫారసులకు అనుగుణంగాను యీపథకం 1957—58లో ప్రారంభించ బడింది. ఈ పథకంక్రింద రైతులకు పాత పండ్ల తోటల సముద్ధరణ కోసం ఎకరానికి రు. 65 లు చొప్పున స్వల్పకాలిక ఋణాలు, క్రొత్త ప్రాంతాలను పండ్లతోటల క్రిందకు తీసుకొని రావడం కోసం ఎకరానికి రు. 150 లు మొదలు కొని రు. 300 ల వరకు దీర్ఘకాలిక ఋణాలు మంజూరు చేయబడతాయి. 1957—58, 1958—59 సంవత్సరాలలో రు. 11.0 లక్షల వరకు ఋణాలు యివ్వబడినాయి. ఈ పథకాన్ని కొనసాగించటం కోసం ప్రణాళికలో రు. 8.83 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 1.36 లక్షల మొత్తం కడప జిల్లా అనంతరాజు పేటలో ఉన్న ఫ్రూట్ స్పెషలిస్టు ఆధీనంలో ఉంచ బడింది. అవసరం కలిగే జిల్లాలకు యీ డబ్బు తిరిగి పంపకం చేయడానికి వినియోగించ బడుతుంది. మిగత మొత్తంలో రు. 0.40 లక్ష యీ పథకం క్రింద యీ జిల్లాలో ఋణాలు పంపకం చేయడానికిగాను వినియోగించ బడుతుంది.

## ప్రత్తి పంట అభివృద్ధి పథకం

బీడు భూములను, బంజరు భూములను సాగు క్రిందకు తీసుకురావడం. ఆహారేతర పంటలకు బదులు ప్రత్తి పంటను వేయడం. రెండు పంటలను వేయడం. పంటకుపంటకు మధ్య ప్రత్తిని పండించటం. మేలురకపు విత్తనాలను పంపకం చేయడం. రసాయనిక ఎరువులు వాడడం మొదలైనటువంటి విస్తృతమయిన, తీవ్రమయిన వ్యవసాయ విధానాలను అవలంబించడంద్వారా యీ పథకం క్రింద రెండవ ప్రణాళికా కాలంలో ఒక్కొక్క బేలు 392 పౌనులుండే 20,000 బేళ్ల ప్రత్తిని అధికంగా ఉత్పత్తి చేయటానికి ప్రతిపాదింపబడింది. మొదటి మూడు సంవత్సరాల కాలంలో ఉత్పత్తి 12, 000 బేళ్ల వరకు పెరిగింది. ఈ పథకం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. **1.40** లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ పథకాన్ని నిర్వహించ వలసిన బాధ్యత అప్పగించబడిన క్రింది అధికార్లకు పై మొత్తం క్రిందివిధంగా పంపకం చేయబడింది. విత్తనాలు మొదలయిన వాటిని కొని వారు పంపకం చేస్తారు.

| | | | రూపాయలు. లక్షలలో, |
|---|---|---|---|
| 1. | కాటన్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు, వ్యవసాయ శాఖ డైరెక్టరేటు | ... | 0.9190 |
| 2. | అసిస్టెంట్ కాటన్ ఎక్స్‌టెన్షన్ ఆఫీసరు, అదిలాబాదు | .... | 0.1495 |
| 3. | ,, కడప | .... | 0.1743 |
| 4. | ,, గుంటూరు, | .... | 0.1572 |
| | మొత్తం | .... | 1.4000 |

ఈ జిల్లాలో 20 ఇంపీరియల్ మణుగుల ప్రత్తి విత్తనాలు సరఫరా చేయబడతాయి. ఇవి 2,050 ఎకరాలలో ఉపయోగించబడతాయి. ఇందువల్ల 300 బేళ్ళ ప్రత్తి ఉత్పత్తి చేయబడుతుంది.

## అరకులోయలో గట్టిగాను, కురచగాను ఉండే ప్రత్తిరకాన్ని గురించి పరిశీలనలు జరపటానికి, అభివృద్ధికి సంబంధించిన పథకం

ఆంధ్రలో గట్టిగాను, కురచగాను ఉండే ప్రత్తిని పండించడానికి గల అవకాశాలకు సంబంధించిన సమాచారం ఏదీ అందుబాటులో లేకపోవడవల్ల అరకులోయ ప్రాంతంలో గట్టిగాను, కురచగాను ఉండే పలు రకాల ప్రత్తిని పండించి చూడడం ద్వారా యీ విషయాన్ని గురించి సమగ్రపరిశీలన జరపడం అవసరమయింది. మొట్టమొదట యీ పథకం రెండు సంవత్సరాలపాటు అమలు జరిపిచూడ బడుతుంది, ఇది సఫలమయితే యీ పథకం యింకా విస్తృతం చేయబడుతుంది. 1958-59 లో యీ పథకాన్ని అమలుజరపడానికి ప్రతిపాదింపబడింది. కాని పరిపాలనా సంబంధమైన కొన్ని కారణాలవల్ల యిది అమలు పరచడం జరగలేదు. ఈ సంవత్సరం యిది అమలు జరుపబడుతుంది. ఇందుకు రు. 0.13 లక్ష ప్రణాళికలో కేటాయించబడింది,

## చెరకు పంటకు ఎక్కువగా ఎరువు వేయడానికి సంబంధించిన పథకం

పంటదిగుబడి ఎక్కువ అయ్యేటందుకు చెరకు పంటకు ఎరువులను వగాఎక్కువేయడాన్ని ప్రచారంలోకి తీసికొనిరావడమే ఈ పథకంయొక్క ఉద్దేశం. ఈ పథకం 1958-59 చివరి భాగంలో అమలు జరపబడింది. ఆంధ్రలో 28 మంది, తెలంగాణాలో 12 మంది కాంగార్‌లచే వివిధ కేంద్రాలలో ఈ పని జరపబడుతున్నది. ఈ పథకాన్ని 1959—60 లో కొనసాగించడానికి ఉద్దేశింపబడింది. అందుకు రూ. 0.30 లక్ష మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. ఈ జిల్లాలో చెరకు పండించే వ్యవసాయదారులకుకూడా ఈ పథకంవల్ల లాభం చేకూరుతుంది.

## ఆంధ్రలో చెరకుపంట అభివృద్ధి

అభివృద్ధి కార్యక్రమాలను విస్తృతంగా అమలు పరచడం మూలంగా చెరకుపంట దిగుబడిని, చెరకురసంయొక్క నాణ్యతను అభివృద్ధి చేసేఉద్దేశంతో 1956-57 లో యీ పథకం చెరకుపండే శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి, కృష్ణ, చిత్తూరు, అనంతపురం జిల్లాలో అమలు

పరచబడింది. రెండవ ప్రణాళికాంతం నాటికి చెరకు ఉత్పత్తిని నూటికి 33 1/3 వంతులు పెంచడమే యీ పథకంయొక్క అంతిమ లక్ష్యం. వీలయినచోటల్లా క్రొత్త ప్రాంతాలను చెరకు పంటక్రిందకు తీసుకరావడం మూలంగా అదనంగా చెరకు పంట పండించ బడుతుంది. పై జిల్లాల్లో యీ పథకం 20 అభివృద్ధి కేంద్రాల్లోను, 5 మండల కేంద్రాలోను అమలులో ఉంది. ఈ సంవత్సరం యీ కార్యక్రమంపై కేంద్రాలలో కొనసాగించ బడుతుంది. ఇందుకు ప్రణాళికలో రు. 3.07 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0,53 లక్ష ఈ జిల్లాలో పై కార్యక్రమాన్ని కొనసాగించుటకు గాను ప్రత్యేకించ బడింది.

## ఆంధ్రలో భీమునిపట్నం జనపనార అభివృద్ధి

భీమునిపట్నం జనపనార నాణ్యతను, పంట దిగుబడిని హెచ్చించటమే యీ పథకంయొక్క లక్ష్యం. ఈ పథకంక్రింద అమలు జరుపబడే కార్యక్రమం క్రింది విధంగా ఉంటుంది. రాజ్యంలో గోగు పండించబడే ప్రాంతాలను సర్వేచేయుటం, రాజ్యంలోను, బయటా ఉండే గోగు రకాలను సేకరించడం, పనికొచ్చే గోగురకాల విత్తనాలను ఎంపిక చేయడం, వాటి నారయొక్క నాణ్యతను పరిశీలించడం—యివే పై కార్యక్రమంక్రింద జరిగే పనులు. మిశ్రమజాతి విత్తనాలు రూపొందించబడతాయి. భూసార పరిశీలనలుకూడ జరుపబడతాయి. ఈ పథకంక్రింద పరిశోధన కార్యక్రమం, లాంలోని వ్యవసాయ పరిశోధన కేంద్రంలో మిల్లెట్ స్పెషలిస్టు పర్యవేక్షణ క్రింద 1958—59 లో ప్రారంభించబడింది. ఈ పథకం కొనసాగింపుకుగాను యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.09 లక్ష కేటాయించబడింది.

## జీడితోటల అభివృద్ధి

రాజ్యంలో ఉన్న బంజరు భూములను జీడితోటల క్రిందకు తీసుకువచ్చే ఉద్దేశంతో క్రొత్తగా ఎంపికచేయబడిన ప్రాంతాలలో నాటుటకుగాను 15,000 పౌన్ల మంచిరకం జీడిగింజలను సేకరించటానికి ప్రతిపాదింపబడింది. జీడితోటలను విస్తరింపచేసేటందుకుగాను తగిన ప్రదేశాలను నిర్ణయించడంకోసం శ్రీకాకుళం, తూర్పుగోదావరి, గుంటూరు జిల్లాలలోని భూమిని సర్వేచేయ

టానికికూడ ప్రతిపాదింపబడింది. క్రొత్త భూములను జీడితోటల క్రిందకు తీసికొనివచ్చుటకు రైతులను ప్రోత్సహించే నిమిత్తం వారికి ఎకరానికి రు. 100 లు చొప్పున ఋణాలనివ్వటానికికూడ యీ పథకం క్రింద ప్రతిపాదింపబడింది.

ఒక క్యామునట్ డెవలప్‌మెంటు ఆఫీసరును, నలుగురు అసిస్టెంట్లను, ఒక అప్పరు డివిజను గుమాస్తా, 5 మంది జవానులను నియమించడంద్వారా యీ పథకం 1958—59 లో అమలు జరుపబడింది. 3,000 ఎకరాల భూమిని జీడితోటల క్రిందకు తీసుకురాపటంకోసం ఋణాలు యివ్వబడినాయి. ఈ సంవత్సరంలో యీ పథకాన్ని కొనసాగించడానికి, 6,000 ఎకరాల భూమిని జీడితోటల క్రిందకు తీసుకురావడానికిగాను ప్రణాళికలో రు. 6.11 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.12 లక్ష అవసరం అయ్యే జిల్లాలకు అదనంగా డబ్బును సర్దటం కోసం ప్రధాన కార్యస్థానంలో రిజర్వునందు ఉంచబడింది. రు. 0.11 లక్ష సిబ్బంది క్రింద అయ్యే ఖర్చు మొదలయినవాటికోసం ప్రత్యేకించబడింది. మిగత మొత్తంలో రు. 0.30 లక్ష యీ జిల్లాలో 300 ఎకరాల భూమిని జీడితోటల క్రిందకు తీసుకురావటం కోసం ఋణాలుగా ఇవ్వబడుతుంది.

## చెరకుపంటకు చీడలు, తెగుళ్లనుండి రక్షణ కల్పించడం.

చెరకు పంటకు తగిలే చీడలు, తెగుళ్ళలో చెరకు మొవ్వు చచ్చుట, కాటుక తెగులు ముఖ్యమైనట్టివి. ఈ తెగుళ్ళను అదుపులో పెట్టడానికి సక్రమమైన చర్యలను సకాలంలో తీసికోవడం అవసరం. సకాలంలో నివారణ చర్యలను తీసికొనడానికి వీలు కల్పించే నిమిత్తం ప్రతి మండల కేంద్రానికి విద్యుచ్ఛక్తితో నడుపబడే రెండు స్ప్రేయర్లను (పిచికారీలు), డస్టర్లను (పొడి చల్లు సాధనాలు) సరఫరా చేయడానికి, ఇన్‌సెక్టిసైడల్, ఫంగిసైడల్ స్ప్రేయర్ల ఉపయోగాన్ని ప్రదర్శన పూర్వకంగా తెలియచేయడానికి ప్రతిపాదింపబడింది. ఈ రసాయనిక మందులు తగ్గింపు ధరలకు సరఫరా చేయబడతాయి, 1957—58 లో ఈ పథకం ప్రారంభించబడింది. 1959—60 లో కొనసాగించబడుతుంది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.24 లక్ష కేటాయించ బడింది. ఈ పథకం అమలులో ఉన్న 7 జిల్లాలలోని 15,800

ఎకరాల భూమిలో పైచర్యలు తీసికోబడతాయి. పై మొత్తంలో రు. 0.043 లక్ష ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ జిల్లాలో 3,160 ఎకరాల భూమికి ఈ పథకంవల్ల ప్రయోజనం చేకూరుతుంది.

## ఆంధ్రలో పోకతోటల పెంపకం

రాజ్యంలో ప్రస్తుతం ఉత్పత్తి అవుతున్న పోక చెక్కలు యీ రాజ్యం యొక్క జనాభా అవసరాలకు సరిపడగాలేవు. ఇందువల్ల ఆంధ్రలో పోకతోటలను పెంచుతున్న వారికితగు ప్రోత్సాహం ఇచ్చేటందుకు యీ పంట బాగా పండడానికి అనువుగా ఉండే ప్రదేశాలలో ప్రదర్శనక్షేత్రాలను ఏర్పాటుచేయడానికి ప్రతిపాదించబడింది. ఒక్కొక్క ప్రదర్శనక్షేత్రపు విస్తీర్ణం 10 సెంట్లు ఉంటుంది. 1957—58 సంవత్సరపు ఉత్తర భాగంలో యీ పథకం క్రింది 10 కేంద్రాలలో ప్రారంభించబడింది. 1958—59 లో యీ పథకం కొనసాగించబడింది.

| కేంద్రం ఏర్పాటు చేయబడిన గ్రామం పేరు | తాలూక | జిల్లా |
|---|---|---|
| 1. కోడూరు | హిందూపురం | అనంతపురం |
| 2. హాళ్ళికెల | మడకసిర | అనంతపురం |
| 3. అంగనపూడి | అనకాపల్లి | విశాఖపట్టణం |
| 4. నరసాపూరు | నరసాపూరు | పశ్చిమగోదావరి |
| 5. బంగనపల్లి | నరసాపూరు | పశ్చిమగోదావరి |
| 6. తాటిపాక | రాజోలు | తూర్పుగోదావరి |
| 7. నందంపూడి | అమలాపురం | తూర్పుగోదావరి |
| 8. ఊటుకూరు | కొవ్వూరు | నెల్లూరు |
| 9. కలూరు | కర్నూలు | కర్నూలు |
| 10 కవిటి | ఇచ్ఛాపురం | శ్రీకాకుళం |

ఈ ప్రదర్శనక్షేత్రాలను కొనసాగించటంకోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.03 లక్ష కేటాయించబడింది.

## సామర్లకోట, అనకాపల్లి, మార్టేరులలో కొబ్బరి మొక్కల ఉత్పత్తిని అధికం చేయడానికి సంబంధించిన పథకం

కొబ్బరితోటలు పెంచేవారికి మేలురకం కొబ్బరి మొక్కలను సరఫరా చేసే ఉద్దేశంతో వాటి ఉత్పత్తిని రెండింతలు చేయడమే యీ పథకంయొక్క ఉద్దేశ్యం. సామర్లకోట, అనకాపల్లి, మార్టేరులలో యీ పథకం 1958-59లో ప్రారంభించబడింది. రు. 0.37 లక్ష వ్యయంతో యీ సంవత్సరం యిది కొనసాగించబడుతుంది. ఇందులో రు. 0.10 లక్ష యీ జిల్లాలోని అనకాపల్లిలో ఉన్న కేంద్రానికిగాను ప్రత్యేకించబడింది. ఈ కేంద్రంలో యీ సంవత్సరం 40,000 కాయలు ఉత్పత్తి చేయబడతాయని ఆశించబడుతున్నది.

## ఫీల్డుమెన్‌లకు, డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలకు శిక్షణ.

ప్రదర్శనపూర్వకంగా వివరించటానికి, మేలురకం వ్యవసాయ విధానాలను గురించి తీవ్ర ప్రచారం చేయటానికిగాను వ్యవసాయశాఖలో నియమించే నిమిత్తం ఫీల్డుమెన్‌లకు, డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలకు ఆరు నెలలపాటు ఉత్తమ వ్యవసాయ విధానాలలో శిక్షణ యివ్వటానికి యీ పథకం ఉద్దేశించబడింది: రెండవ ప్రణాళిక యొక్క మొదటి రెండు సంవత్సరాల కాలంలో ఆంధ్ర ప్రాంతంలోని క్రింది 5 కేంద్రాలలో 197 మంది డెమాన్‌స్ట్రేషన్ మేస్త్రీలకు శిక్షణ యివ్వబడింది.

1. చెరకు పరిశోధన కేంద్రం, అనకాపల్లి
2. వ్యవసాయ పరిశోధన కేంద్రం, సామర్లకోట
3. వ్యవసాయ పరిశోధన కేంద్రం, మార్టేరు
4. కళాశాల క్షేత్రం, బాపట్ల
5. వ్యవసాయ పరిశోధన కేంద్రం, నంద్యాల.

1958—59 లో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలకు చెందిన 178 మంది డెమాన్‌స్ట్రేషన్ మేస్త్రీలు, 178 మంది ఫీల్డుమెన్‌లు ఆంధ్ర ప్రాంతంలోని

5 కేంద్రాల్లోను, తెలంగాణా ప్రాంతంలోని క్రింది 3 కేంద్రాల్లోను శిక్షణ నిమిత్తం చేర్చుకోబడినారు.

1. ప్రభుత్వ ప్రధాన క్షేత్రం, రాజేంద్రనగరు
2. ప్రభుత్వ ప్రధాన క్షేత్రం, వరంగల్లు
3. ప్రభుత్వ ప్రయోగ కేంద్రం, రుద్రూరు.

శిక్షణ కార్యక్రమం యీ సంవత్సరం కొనసాగించబడుతుంది. 178 మంది డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలు, 178 మంది ఫీల్డుమెనులు చేర్చుకోబడతారు. ఇందుకు ప్రణాళికలో రు. 0.81 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.09 లక్ష యీ జిల్లాలోని అనకాపల్లిలో ఉన్న వ్యవసాయ పరిశోధన కేంద్రంలో 20 మంది డెమాన్‌స్ట్రేషను మేస్త్రీలకు, 20 మంది ఫీల్డుమెన్లకు శిక్షణ ఇవ్వడం కోసం వినియోగించబడుతుంది.

## ఆయిలు ఇంజన్లను నడుపుటలో రైతులకు శిక్షణ

ఈ పథకం తెలంగాణా ప్రాంతంలో అములులో ఉన్నది. ఆయిలు ఇంజన్లను నిర్వహించటం, నడపడానికి సంబంధించిన విషయాలలో రైతులకు శిక్షణ యిచ్చే ఉద్దేశంతో యీ పథకాన్ని 1958—59 లో ఆంధ్ర ప్రాంతానికి విస్తరింపచేయటం జరిగింది. ఈ పథకాన్ని కొనసాగించటానికి, 420 మంది రైతులకు శిక్షణ యివ్వటానికిగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.16 లక్ష కేటాయించబడింది.

## సిబ్బందికి సంబంధించిన సమగ్ర పథకం

వ్యవసాయ శాఖకు సంబంధించిన ప్రణాళికా పథకాలను కట్టుదిట్టమైన పర్యవేక్షణ క్రింద విజయవంతంగా అమలు జరిపేటందుకుగాను వ్యవసాయశాఖ ప్రధాన కార్యాలయంలోను, జిల్లాలలో ఉన్న వ్యవసాయ శాఖ కార్యాలయాలలోను అదనంగా పర్యవేక్షణ (సాంకేతిక) సిబ్బందిని, మినిస్టీరియల్ సిబ్బందిని నియమించటానికి ప్రతిపాదింప బడింది. 1956—57 నుండి ఈ పథకం అమలు నందున్నది. ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించే నిమిత్తం ఈ సంవత్సరపు ప్రణాళి

కలో రు. 2.93 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో కొంత మొత్తం యీ జిల్లాలో యింతకుముందు నియమించ బడిన సిబ్బంది కొనసాగింపుకుగాను వినియోగించబడుతుంది.

## అనకాపల్లిలో చెరకు పరిశోధన కేంద్రం.

అనకాపల్లిలోని చెరకు పరిశోధన కేంద్రంలో జరిగే పరిశోధనా కార్యక్రమాన్ని విస్తృతం చేసేటందుకు వీలుగా యీ కేంద్రాన్ని అభివృద్ధి చేయటానికి యీ పథకం ఉద్దేశించబడింది. 1956—57 లో యీ పథకం అమలు జరుపబడింది. అదనపు సిబ్బంది నియామకానికి, భవనాల నిర్మాణానికిగాను ప్రణాళిక యొక్క మొదటి రెండుసంవత్సరాల్లో రు. 3.943 లక్షల మొత్తం ఖర్చుపెట్టబడింది. 1958—59 లో యిది కొనసాగించబడింది, ఈ సంవత్సరం ఈ పథకం కొనసాగించటంకోసం ప్రణాళికలో రు. 1.89 లక్షల మొత్తం కేటాయించబడింది.

## ఆంధ్రప్రదేశ్‌లో నలగర్ కమిటీవారి సిఫారసులను అమలు పరచుటకుగాను లాంఛన ప్రాయమయిన కేటాయింపు

రాజ్యాలలో నమూనా వ్యవసాయ సంస్థలను స్థాపించే విషయంగురించి వ్యవసాయ శాఖకు చెందిన అన్ని వర్గాల సిబ్బందికూడ తమకు అప్పగించబడిన కార్యక్రమాన్ని బాధ్యతతో నిర్వహించేటందుకు వీలుగా అధికారాలను కలిగి యుండటంకోసం అనిస్థాయిలలోని వ్యవసాయాధికారులకు అధికారాలను అప్పగించే విషయంగురించి రాజ్య ప్రభుత్వాల పరిశీలనార్థం సిఫారసులు చేయటానికిగాను భారత ప్రభుత్వంవారు 1957—58 లో వ్యవసాయ పరిపాలనా సంఘం అన్న పేరుతో ఒక కమిటీని నియమించారు. కమిటీవారి నివేదిక అందచేయబడింది. ఈ కమిటీవారి సిఫారసులను పరిశీలించి, అమలుపరచటంకోసం అంతిమ ప్రతిపాదనల వివరాలను తయారు చేయుటానికి ముందుగానే లాంఛన ప్రాయంగా 1959—60 లో రు. 1.00 లక్ష కేటాయించబడింది.

## వ్యవసాయోత్పత్తి సూచీలను తయారు చేయటం

రాజ్యంలోని వ్యవసాయ ఆర్థిక వ్యవస్థకు సంబంధించిన వివిధసూచీలను సంకలనం చేయటానికి యీ పథకం క్రింద ప్రతిపాదింప బడింది. వ్యవసా

యోత్పత్తికి, పొలాలలో పంటల ధరలకు, వ్యవసాయ కూలీకి సంబంధించిన సూచీలు యిందులో ఉంటాయి. 1957—58లో యీ పథకం అమలు పరచబడి. 1958—59 లో కొనసాగించ బడింది. ఈ సంవత్సరంలో కూడ యీ పథకాన్ని కొనసాగించటం కోసం రు. 0.06 లక్ష కేటాయించ బడింది.

## పట్వారీల పనిపై పర్యవేక్షణ

భూమి వివరాలు, పంట వివరాలు మొదలైన వాటిని మొదట పట్వారీలు కరణాలు తయారు చేస్తారు. ముఖ్యమైన పంటల విషయంలో సరియైన వివరాలు జిల్లా స్థాయిలో సేకరించి సరిచేయడమే ఈ పథకం యొక్క ప్రధాన ఉద్దేశం. వివిధ పంటల క్రింద రాజ్యంలో ఉన్న భూమి అంచనాలను సక్రమంగా తయారుచేయడానికి ఈ వివరాలు అవసరం. ఈ పథకాన్ని ఈ సంవత్సరం రాజ్యంలోని అన్ని జిల్లాలలోను అమలు జరపటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు అవసరమైన సిబ్బంది నియమించబడుతుంది. ఈ సంవత్సరపు ప్రణాళికలో యీ పథకంకోసం రు. 0.35 లక్షమొత్తం కేటాయించ బడింది. ఈ వివరాలకోసం భూములను పరిశీలించే పనిని రెవిన్యూ ఇనస్పెక్టర్లు నిర్వహిస్తారు. ఈ పథకంక్రింద నియమించబడిన తహశీలుదార్లు, ఎకనామిక్ ఇన్వెస్టిగేటర్లు, వారు చేసే పనిపై అజ్మాయిషీ వహిస్తారు. విధానాల్ని నిర్ణయించడం, పర్యవేక్షణజరపడం, సేకరించినవివరాల్ని సంకలనం చేయడం మొదలైన పనులను అర్థగణాంక శాఖవారు నిర్వహిస్తారు.

## "ఎక్స్‌టెన్షన్" (విస్తరణ) శిక్షణ కేంద్రాలు

ఇదివరలో గ్రామసేవకులుగా నియమించటానికి ఎంపికచేయబడిన అభ్యర్థులు 18 నెలలపాటు శిక్షణపొందేవారు. ఒక సంవత్సరంపాటు ప్రాతిపదిక వ్యవసాయ విధానాలలోను, ఆరు నెలలపాటు విస్తరణ విధానాలలోను వారు ఈ శిక్షణను పొందేవారు. ఈ రెండుకోర్సులుకూడా ప్రత్యేకకోర్సులుగా పరిగణింపబడుతుండేవి. ఈ కోర్సులను విజయవంతగా పూర్తిచేసిన అభ్యర్థులకు రెండుకోర్సులకు సంబంధించి విడివిడిగా సర్టిఫికేట్లు యివ్వబడుతుండేవి. ఈ శిక్షణ స్థాయిని పెంచే ఉద్దేశంతో యీ రెండు కోర్సులను ఏకీకృతంచేయుటకు నిశ్చయింపబడింది. అదే ప్రకారం రాజ్యంలో ఉన్న నాలుగు

విస్తరణ శిక్షణ కేంద్రాలు, 5 ప్రాతిపదిక వ్యవసాయపాఠశాలలు గ్రామ సేవకుల శిక్షణ కేంద్రాలు అన్న పేర 8 ఏకీకృత సంస్థలుగా పునర్వ్యవస్థీకరించబడి వాటిలో 1958 అక్టోబరునుండి పై ఏకీకృత కోర్సు ప్రవేశపెట్టబడింది. తూర్పు గోదావరి జిల్లా సామర్లకోటలో ఒకటి, పశ్చిమ గోదావరి జిల్లా గోపన్నపాలెంలో ఒకటి, చిత్తూరు జిల్లా కాళహస్తిలో ఒకటి, గుంటూరు జిల్లా బాపట్లలో ఒకటి, కర్నూలు జిల్లా నంద్యాలలో ఒకటి, విశాఖపట్టణం జిల్లా అనకాపల్లిలో ఒకటి, హైదరాబాదు జిల్లా రాజేంద్రనగరులో రెండు-పై ఎనిమిది గ్రామసేవక శిక్షణ కేంద్రాలు నెలకొల్పబడినాయి. పై శిక్షణ కేంద్రాలలో 627 మంది గ్రామసేవకులకు—ఆంధ్ర ప్రాంతానికి చెందిన 511 మందికి, తెలంగాణా ప్రాంతానికి చెందిన 116 మందికి—యీ సంవత్సరం శిక్షణ యివ్వబడుతుంది. ప్రస్తుతం సామర్లకోటలో ఒకటి, రాజేంద్రనగరులో ఒకటి గ్రామసేవికలకు శిక్షణ యివ్వటం కోసం గృహ శాస్త్ర బోధన విభాగాలు ఉన్నాయి. ఒక్కొక్క విభాగంలో 20 మందికి శిక్షణ యివ్వటానికి వీలుంది. క్రొత్తగా బ్లాకులను ఏర్పాటుచేయటం మూలంగా శిక్షణపొందిన గ్రామ సేవికలు అదనంగా కావలసి వస్తున్నారు. ఈ అవసరాన్ని తీర్చటంకోసం ప్రస్తుతం సామర్లకోట, రాజేంద్రనగరులలో ఉన్న సంస్థలలో శిక్షణపొందడానికి చేర్చుకోబడే వారి సంఖ్య 1958—59 లో 20 మంది 40 కి పెంచబడింది. ఇంతేకాక అదనంగా మరొక గృహశాస్త్ర బోధన విభాగం కాళహస్తిలో ఏర్పాటుచేయబడింది. ఇందులోకూడ సంవత్సరానికి 40 మంది గ్రామసేవికలకు శిక్షణయివ్వడానికి వీలుంది. ఈ సంవత్సరం యీ 3 గృహశాస్త్ర బోధనా విభాగాల్లోను 120 మంది గ్రామసేవికలకు శిక్షణ యివ్వబడుతుంది.

సామర్లకోట, రాజేంద్ర నగరులలో ఉన్న గ్రామసేవికల శిక్షణ కేంద్రాలకు అనుబంధించబడి రెండు వర్కు-షాపు విభాగాలు ఉన్నాయి. వాటిలో గ్రామాల్లో పనిచేసే పనివారల బాలురకు మేలురకం వ్యవసాయ పనిముట్లను తయారుచేయటంలోను మరమ్మతు చేయటంలోను శిక్షణ యివ్వబడుతుంది. ప్రతి విభాగంలోను ఏటా 20 మంది బాలురకు శిక్షణ యివ్వబడుతుంది. ఇంతవరకు 80 మంది పనివారికి శిక్షణ యివ్వబడింది. ఇందులో 60 మందికి సామర్లకోటలోని వర్కు-షాపు విభాగంలోను, 27 మందికి రాజేంద్ర నగరులోని వర్కు-షాపు విభాగంలోను శిక్షణ యివ్వబడింది. ఈ సంవత్సరం యీ

రెండు శిక్షణ విభాగాల్లోను 40 మందికి శిక్షణ యివ్వబడుతుందని ఆశించబడు తున్నది. ఈ సంవత్సరపు శిక్షణ కార్యక్రమానికి గాను 1959—60 ప్రణాళికలో రు. 9.16 లక్షల మొత్తం కేటాయించబడింది.

# చిన్న తరహా నీటి పారుదల పనులు

## లచ్చిరాజు ఆనకట్ట పథకం

ఈ పథకం క్రింద విశాపట్టణం జిల్లా ఎలమంచిలి తాలూకాలోని మాయవరం విభాగం దగ్గర వరహానదిమీద ఉన్న లచ్చిరాజు ఆనకట్టపై రెండు "ఫాలింగ్ షట్టర్లు" నెలకొల్పబడతాయి. ఈ పథకంకోసం ఈ సంవత్సరం రు. 1.00 లక్ష కేటాయించబడింది. 1,365 ఎకరాల ఆయకట్టుకు యిందువల్ల లాభం చేకూరుతుంది.

## చెరువుల అభివృద్ధి పథకం

రెండవ ప్రణాళికాకాలంలో ఆంధ్ర జిల్లాలలో కొన్ని చిన్నతరహా నీటి పారుదల పనులను ప్రారంభించడానికి, కొన్ని చెరువులను పునరుద్ధరించడానికి ప్రతిపాదింపబడింది. ఇందువల్ల క్రొత్తగా 9,469 ఎకరాల ఆయకట్టుకు, ప్రస్తుతమున్న 29,545 ఎకరాల అయకట్టుకు నీటిపారుదల జరుగుతుంది. ఈ సంవత్సరానికి యీ పథకంక్రింద రు. 13.12 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ పథకంవల్ల యీ జిల్లాకుకూడ లాభం చేకూరుతుంది.

## ఫిల్టరు పాయింటు బావులు

ఈ పథకంక్రింద వ్యవసాయదార్ల పొలాల్లో ఫిల్టరుపాయింటు గొట్టపు బావులు త్రవ్వబడతాయి. ఫిల్టరు పాయింట్లు యితర పరికరాలు వారికి సరఫరా చేయబడతాయి. సరఫరా చేయబడిన గొట్టాలు, పరికరాల పూర్తి ఖరీదు వారినుండి వసూలు చేయబడుతుంది. అవసరమయిన పంపింగ్ యంత్రాలను కొనుక్కునేటందుకుగాను ప్రతి వ్యక్తికి రు. 2,500 లు మించకుండా ఋణాలు మంజూరు చేయబడతాయి. ప్రభుత్వం వారిచే నిర్ణయించబడే వడ్డీతో యీ ఋణాలు రైతులనుండి 5 సమాన వాయిదాలలో వసూలు

చేయబడతాయి. 140 ఫిల్టరు పాయింటు బావులు త్రవ్వేటందుకు ఋణాలు ఇవ్వడంకోసం 1959—60 సంవత్సరానికి రు. 3.50 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.025 లక్ష మొత్తం యీ జిల్లాలో 140 ఫిల్టరు పాయింటు బావులను త్రవ్వటానికి ఋణాల నిచ్చేటందుకై ప్రత్యేకించబడింది.

## అద్దె కొనుగోలు పద్ధతిపై ఆయిలు ఇంజన్లు, ఎలక్ట్రిక్ మోటార్ల పంపకం

నీటిపారుదలకోసం నీటిని తోడేటందుకై ఆయిలు ఇంజన్లను, ఎలక్ట్రిక్ మోటారు పంపుసెట్లను కొనుక్కోలేని రైతులకు, అవి సరఫరా చేయబడుతున్నాయి. ఆయిలు ఇంజన్ల విషయంలో రు. 4,000 లకు మించకుండాను, ఎలక్ట్రిక్ మోటార్ల విషయంలో రు. 2,000 లకు మించకుండాను యీ ఋణాలు యివ్వబడతాయి. నూటికి నాలుగు రూపాయలు వడ్డీ, మూడు రూపాయలు సెంటేజి చార్జి కలిపి యీ ఋణాలు 5 నుండి 7 వాయిదాలలో వసూలు చేయబడతాయి. 122 ఆయిలు ఇంజన్లు. 155 ఎలక్ట్రిక్ మోటారు పంపు సెట్లు సరఫరాచేసే నిమిత్తం ఈ సంవత్సరానికి రు. 8 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.66 లక్ష యీ జిల్లాకు 11 ఆయిలు ఇంజన్లను, 11 ఎలక్ట్రిక్ మోటార్లను సరఫరా చేయటంకోసం ప్రత్యేకించబడింది.

## గొట్టపు బావులు, పవరు డ్రిల్లు పథకం

ఈ పథకంక్రింద భారతప్రభుత్వం వారి సహాయంతో టి.సి.ఎమ్. కార్యక్రమంక్రిందప్రయోగాత్మక పద్ధతిపై 25 గొట్టపు బావులను ఆంధ్రప్రాంతంలో త్రవ్వటానికి ప్రతిపాదించబడింది. 1958—59 లో 15 గొట్టపు బావులు త్రవ్వబడినాయి. ఈ పథకాన్ని కొనసాగించేటందుకు ఈ సంవత్సరానికి రు. 10.27 లక్షల మొత్తం కేటాయించబడింది. పవరు డ్రిల్లు పథకాన్ని అమలుజరపటానికి చేయబడిన కేటాయింపుకూడ పై మొత్తంలో చేరిఉంది. పవరుడ్రిల్లు పథకంక్రింద పవరుడ్రిల్లు యంత్రాలను కొనడం, అసిస్టెంటు ఇంజనీర్లను యితర సహాయక సిబ్బందిని నియమించడం, పరికరాల తయారీ, మరమ్మత్తులకుగాను వర్కుషాపులను ఏర్పాటు చేయటం మొదలయినపనులు నిర్వహింప

బడతాయి. ఈ పథకం వల్ల యీ జిల్లా రైతులకుకూడ లాభం చేకూరుతుంది.

## చిన్నతరహా నీటిపారుదల పనుల అభివృద్ధి పథకాలు

ఈ జిల్లాలో ముఖ్యంగా ప్రభుత్వంవారిచే స్వాధీనం చేసుకోబడిన ఎస్టేట్లలో ఉన్న వాడకంలో లేని. గండ్లుపడిన చిన్నతరహా నీటిపారుదల చెరువులను పునరుద్ధరించే ఉద్దేశంతో చిన్నతరహా నీటిపారుదల వనరుల పునరుద్ధరణకు, అభివృద్ధికిగాను యీ జిల్లాకు రు. 1.50 లక్షలమొత్తం కేటాయించబడింది.

## క్రొత్త బావులకు సబ్సిడీ పథకం

వ్యవసాయోత్పత్తిని హెచ్చు చేసేటందుకుగాను నీటి పారుదలకు ఉపయోగపడే బావులను త్రవ్వుకోవటానికిగాను యీ పథకంక్రింద రైతులకు సబ్సిడీ యివ్వబడుతుంది. ఒక్కొక్క బావికి రు. 750 ల చొప్పున యీ సబ్సిడీ యివ్వబడుతుంది. ఆంధ్రప్రాంతంలో 1,750 బావులను త్రవ్వుటకు సబ్సిడీల నివ్వటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 13.125 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.3125 లక్షల మొత్తం యీ జిల్లాలో 175 బావులను త్రవ్వటంకోసంప్రత్యేకించబడింది.

# భూమి అభివృద్ధి

## భూమిని సాగుక్రిందకు తేవటం; ట్రాక్టర్లు, బుల్‌డోజర్ల సహాయంతో వ్యవసాయం చేయటం

ఎక్కువగా ఉన్న గిరాకీదృష్ట్యా, రెండవ ప్రణాళికాకాలంలో బుల్‌డోజర్లను కొనటానికి ప్రతిపాదించబడింది. ఈ బుల్‌డోజర్లు రైతులకు అద్దెకు ఇవ్వబడతాయి. విదేశీ మారకద్రవ్యం యిబ్బందివల్ల యింతవరకు బుల్‌డోజర్లు ఖరీదుచేయబడలేదు. అయినప్పటికీ ఈ సంవత్సరంలో 5 బుల్‌డోజర్లను కొనటానికిప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 5.30 లక్షల, మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో రైతులకుకూడ అద్దెకు తీసుకోవటానికి యివి అందుబాటులో ఉంటాయి.

# పశుగణాభివృద్ధి

## కీలక గ్రామ పథకం

పశుగణాభివృద్ధికోసం నిర్ణీత ప్రాంతాలలో తీవ్రకృషి చేయటానికి యీ పథకం ఉద్దేశించబడింది. ఈ పథక క్రింద నాసిరకం ఎద్దులకు విత్తుకొట్టడం, కృత్రిమ గర్భోత్పత్తి కేంద్రాల నియంత్రణ క్రింద పశువుల ఉత్పత్తి కార్యక్రమాన్ని అమలుజరపటం, సబ్సిడీ పద్ధతిపై దూడలను పెంచడం, సహకార పద్ధతులపై పశుగ్రాస వనరులను అభివృద్ధిపరచడం జరుగుతుంది. 1957—59 సంవత్సరాలలో 10 కీలకగ్రామ కేంద్రాలు ఆంధ్రలో స్థాపించబడినాయి. ఇంకా 9 కేంద్రాలను ప్రారంభించటానికి, యిప్పుడున్న వాటిని కొనసాగించటానికి ప్రతిపాదించబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 11.107 లక్షలమొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.598 లక్ష ఒక క్రొత్త కీలక గ్రామ కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ఈ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## గోశాలల అభివృద్ధి

గ్రాంట్-ఇన్-ఎయిడ్ (ఆర్థికసహాయం) యివ్వడంద్వారా గోశాలను అభివృద్ధి చేయటానికి యీ పథకం ఉద్దేశించబడింది. 1959—60 లో 4 క్రొత్త గోశాలలకు, 5 పాత గోశాలలకు గ్రాంట్-ఇన్-ఎయిడ్ యివ్వటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.81 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.046 లక్ష యీ జిల్లాలోని ఒక గోశాలకు గ్రాంట్-ఇన్-ఎయిడ్ యివ్వటానికిగాను ప్రత్యేకించబడింది.

## జిల్లా, రాజ్య పశుప్రదర్శనాలు.

పశువుల పెంపకపు దార్లకు ఉత్సాహం కలిగించటానికి, శాస్త్రీయ పద్ధతులతో పశువులను పెంచడం, మేపడం, నిర్వహించడం గురించి జనసామాన్యానికి తెలియ చెప్పటానికిగాను రాజ్య, జిల్లా పశుప్రదర్శనలను ఏర్పాటు చేసేటందుకు యీ పథకం క్రింద తలపెట్టబడింది. 1959—60 లో 4 జిల్లా పశు ప్రదర్శనలను ఒక రాజ్య పశుప్రదర్శనను ఏర్పాటు చేయుటకుగాను యీ జిల్లాకు రు. 0.022 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## కోళ్ల పరిశ్రమ విస్తరణ, అభివృద్ధి కేంద్రాలు

భారత ప్రభుత్వం వారిచే ప్రారంభించ బడిన పైలట్ ప్రాజెక్టు అభివృద్ధి పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలో 12 కోళ్ల పెంపకపు విస్తరణ, అభివృద్ధి కేంద్రాలు 1957—59 సంవత్సరాలకాలంలో ప్రారంభించ బడినాయి. 1959—60 లో యింకా 4 కేంద్రాలను ప్రారంభించటానికి, యింతకు ముందు ప్రారంభించిన వాటిని కొనసాగించటానికిగాను ప్రతిపాదింప బడింది. ఇందుకు ప్రణాళికలో రు. 2.76 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.051 లక్ష యీ జిల్లాలో ఒక విస్తరణ కేంద్రాన్ని కొనసాగించేటందుకు గాను ప్రత్యేకించ బడింది.

## వివిధ రకాల పశువుల సరఫరా

స్థానిక పశుగణ స్థాయిని పెంచే ఉద్దేశంతో ఆబోతులను, దున్నపోతులను, మేకలను, పోతుపందులను, ఆడపందులను, పొట్టేళ్లను విదేశీరకం కోడిపుంజులు, పెట్టలను, గ్రుడ్లను తక్కువ ధరలకు రైతులకు రెండవ ప్రణాళికా కాలంలో పంపకం చేయటానికి ప్రతిపాదింప బడింది. అంటే కొన్న ధరలో సగం ధరకు తగ్గించి యివి సరఫరా చేయబడతాయి. 1959—60 లో ఈ జిల్లాలో పంపకం చేయడానికి ఉద్దేశించ బడిన పశువుల సంఖ్య, అందుకయ్యే ఖర్చు వివరాలు క్రింద యివ్వబడినాయి.

| | | సంఖ్య | కేటాయించటబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|---|
| 1. | ఆబోతులసరఫరా | 9 | 0.0945 |
| 2. | దున్నపోతులు | 10 | 0.105 |
| 3. | మేకపోతులు | 8 | 0.009 |
| 4. | ఆడమేకలు | 9 | 0.008 |
| 5. | పోతుపందులు | 5 | 0.133 |
| 6. | ఆడపందులు | 3 | 0.008 |
| 7. | పొట్టేళ్లు | 6 | 0.005 |

| | | | |
|---|---|---|---|
| 8. | విదేశీ కోడిపుంజులు | 170 | 0.020 |
| 9. | కోడిపెట్టలు (విదేశీరకం) | 170 | 0.020 |
| 10. | గ్రుడ్లు (విదేశీరకం) | 400 | 0.004 |

## ఉన్ని ప్రదర్శన యూనిట్ల ఏర్పాటు

ప్రస్తుతం అనంతపురం, నెల్లూరు, కాకినాడలలో మూడు ఉన్ని ప్రదర్శన యూనిట్లు పని చేస్తున్నాయి. గొర్రెలను మేపటం, పెంచటం, నిర్వహించటానికి సంబంధించిన విషయాలను గురించి యీ యూనిట్లు ప్రచారం చేస్తాయి. ప్రతి యూనిట్టు ఒక వెటర్నరీ అసిస్టెంటు సర్జను, ఇద్దరు స్టాక్ మెన్‌ల అజమాయిషీ క్రింద నిర్వహింపబడుతున్నది. 1959—60 తో ప్రస్తుతమున్న మూడు యూనిట్లకు అదనపు సిబ్బందిని నియమించడానికి, నంద్యాల, విజయవాడ, విశాఖపట్టణం, ఆదోని పట్టణాలలో యింకా 4 క్రొత్త యూనిట్లను ఏర్పాటు చేయటానికి, యింతేకాక అదనంగా మినిస్టీరియల్ సిబ్బందిని నియమించటంద్వారా షీప్ అండ్ గోట్ డెవలప్‌మెంట్ ఆఫీసరు కార్యాలయాన్ని పటిష్ఠం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.94 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.187 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## జిల్లా వెటర్నరీ కార్యాలయాల్లోను, ప్రధాన కార్యాలయంలోను అదనపు సిబ్బంది నియామకం

పని ఎక్కువ కావడంవల్ల అవసరమైన అదనపు సిబ్బందిని ప్రధాన కార్యాలయంలోను, చింతలదీవి ప్రభుత్వ పశుగణక్షేత్రంతోసహా జిల్లా వెటర్నరీ కార్యాలయాల్లోను నియమించడానికి తలపెట్టబడింది. అందుకు 1959—60 ప్రణాళికలో రు. 0.72 లక్ష మొత్తం కేటాయించబడింది. ఆ మొత్తంలో ఈ జిల్లాకు రు. 0.037 లక్ష మొత్తం కేటాయించబడింది.

## విశాఖపట్టణంలో "ఎమర్జన్సీ షార్టుటర్మ్ కోర్సు"

పశు వైద్యంలో తర్ఫీదు పొందినవారి అవసరం రోజు రోజుకూ ఎక్కువవుతున్నందువల్ల విశాఖపట్టణంలోని ప్రభుత్వ పాడిక్షేత్రంలో 1955—56 లో రెండేళ్ళ "ఎమర్జన్సీకోర్సు" ఒకటి ప్రారంభించబడింది. 1956—59 లలో

300 అభ్యర్థులు శిక్షణనిమిత్తం చేర్చుకోబడినారు. ఈ సంవత్సరం 100 మంది అభ్యర్థులతో కూడిన యింకోజట్టును చేర్చుకోవడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు రు. 0.80 లక్ష కేటాయించబడింది.

## గాళ్లవ్యాధి నిర్మూలనాపథకం

దేశంలో గాళ్లవ్యాధిని నిర్మూలించే ఉద్దేశంతో భారత ప్రభుత్వంవారు వ్యాధిరాకుండా పశువులన్నిటికి టీకాలు వేయడానికి ఒక పథకాన్ని ప్రారంభించారు ఈ టీకాలువేసే ఉద్యమంక్రింద టీకాలు వేయబడకుండా మిగిలిపోయిన పశువులకోసం గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, అనంతపురం, కర్నూలు జిల్లాలలో టీకాలు వేయటానికిగాను మరొక పథకంకూడ మంజూరు చేయబడింది. టీకాల మందు దొరకకపోవడం మొదలయినటువంటి కొన్ని చిక్కుల కారణంగా ఈపని పూర్తిచేయడానికి వీలులేకపోయింది. అందువల్ల ఈ రెండు పథకాలను పై జిల్లాలలో కొనసాగించడానికి, తలపెట్టబడింది. మొదట ప్రారంభించబడిన పథకం కృష్ణానదికి ఉత్తరాన ఉన్న జిల్లాల్లో యీ సంవత్సరం పూర్తవుతుంది. అయితే యీ జిల్లాల్లోకూడ టీకాలు వేయబడకుండా మిగిలిపోయిన పశువులకుకూడ టీకాలు వేసే నిమిత్తం యీ రెండవ పథకం ప్రారంభించబడుతుంది. ఈ పథకాన్ని అమలు పరచేటందుకు 1959—60 ప్రణాళికలో రు. 1.95 లక్ష మొత్తం కేటాయించబడింది.అందులో రు. 0.597 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది

## క్లినికల్ లేబరేటరీలను స్థాపించటం

రసాయనిక పరీక్షలద్వారా సకాలంలో వ్యాధులను కనిపెట్టి నిర్ధారణ చేయటంకోసం జిల్లా ప్రధాన పశువైద్య ఆసుపత్రులతోను, రాజ్యంలోని పశుగణాభివృద్ధిక్షేత్రాలలోను క్లినికల్ లేబరేటరీలను ఏర్పాటుచేయటానికి ప్రతిపాదింపబడింది. విశాఖపట్టణం, కాకినాడ, నెల్లూరు, చిత్తూరు, కర్నూలులోఉన్న ప్రధాన పశువైద్య ఆసుపత్రులలో 5 క్లినికల్ లేబరేటరీలు 1957—58 లో ఏర్పాటు చేయబడినాయి. 1959—60 లో పశ్చిమ గోదావరి, కృష్ణ, అనంతపురంజిల్లాలలో ఇంకా 3 క్లినికల్ లేబరేటరీలను ఏర్పాటుచేయడానికి, ఇంతకుముందు ప్రారంభించబడిన పాత లేబరేటరీలను కొనసాగించడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.89 లక్ష మొత్తం కేటాయించబడింది. ఇందులో యీ జిల్లాకు రు. 0.934 లక్ష కేటాయించబడింది.

## విశాఖపట్టణంలోఉన్న ప్రభుత్వ పాడిక్షేత్రానికి అభివృద్ధిపనులు

విశాఖపట్టణంలోని ప్రభుత్వ పాడిక్షేత్రం చాలాకాలంనుండి పనిచేస్తున్నది. ఈ క్షేత్రంలో ఉత్పత్తి అయ్యేపాలు ప్రభుత్వసంస్థలు మొదలయినవాటికి సరసమైనధరలకు సరఫరా చేయబడుతున్నాయి. కల్తీలేని పాలకోసం ప్రజలనుండి రోజురోజుకూ అభ్యర్థన ఎక్కువవుతుపోతున్నది. పాలఉత్పత్తిని పెంచటంకోసం భవనాలను నిర్మించడం, పరికరాలను సమకూర్చటం, సిబ్బంధిని నియమించడంవంటి అభివృద్ధిపనులు యీ క్షేత్రానికి అవసరం.

ఈ ఉద్దేశ్యంతో "డయరీ"భవనాన్ని నిర్మించటానికి ప్రతిపాదింపబడింది. పరికరాలను, నగరానికి పాలను చేరవేయడంకోసం "ఇన్సులేటెడ్ వ్యానును" ఖరీదుచేయడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959-60లో రు. 3.59 లక్షల మొత్తం కేటాయించబడింది.

### వెటిరినరి కాంపౌండర్లకు శిక్షణ

వెటిరినరి కాంపౌండర్ల కొరతను తీర్చటంకోసం 1959—60 లో 360 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింపబడింది. రెండు జట్లుగా 6 కేంద్రాలలో యీ అభ్యర్థులకు శిక్షణ యివ్వబడుతుంది. ప్రతికేంద్రంలోను 60 మంది అభ్యర్థులు శిక్షణ పొందుతారు. ఈ పథకంకోసం 1959—60లో రు. 0.50లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.09 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. 60 మంది అభ్యర్థుల శిక్షణకు యీ డబ్బు వినియోగించబడుతుంది.

# పాడిపరిశ్రమ-పాలసరఫరా

## విశాఖపట్టణంలోని ప్రభుత్వ పాడిక్షేత్రానికి అభివృద్ధిపనులు

ఓవర్ హెడ్ ట్యాంకును, డ్రెస్సింగు షెడ్డును నిర్మించడం, పాశ్చరైజేషన్ ప్లాంటును, (పాడి సాధక యంత్రం), ట్రాక్టరును కొనడంవంటి కొన్ని అభివృద్ధిపనులను 1957—58 లో విశాఖపట్టణంలోని ప్రభుత్వ పాడిక్షేత్రానికి

చేయడం జరిగింది. ఈ సంవత్సరం యీ పాడి క్షేత్రానికి యింకాకొన్ని అభివృద్ధిపనులను చేయడంకోసం రు. 3.59 లక్షల మొత్తం కేటాయించబడింది.

# అడవులు

## కార్యాచరణ పథకాలు

ఈ జిల్లాలోని అటవీ విభాగాలకు సంబంధించి కార్యాచరణ పథకాలను తయారు చేయటంకోసం సర్వేపనిని, సరిహద్దురేఖలను ఏర్పరచడానికి సంబంధించిన పనిని నిర్వహించడంకోసం 1959—60 ప్రణాళికలో రు. 0.485 లక్ష కేటాయించబడింది.

## సరుగుడు తోటల విస్తరణ.

రోజురోజుకు ఎక్కువవుతున్న వంటచెరకు అవసరం దృష్ట్యా ఆంధ్ర ప్రాంతంలోని కోస్తాప్రదేశాల్లో సరుగుడుతోటలు వేయబడినాయి. 1959—60.లో యీ జిల్లాలోని పాత తోటలను పోషించటానికి తలపెట్టబడింది. ఇందుకు రు. 0.07లక్ష వ్యయమవుతుంది.

## అడవుల పునరుద్ధరణ.

అటవీశాఖ వారిచే స్వాధీనం చేసికోబడినట్టి ఎస్టేటు, పంచాయితీ అడవుల ఉత్పాదక శక్తిని అభివృద్ధి చేసే ఉద్దేశంతో ఆ అడవులలో పునరుద్ధరణ క్షేత్రాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ జిల్లాలో 1,200 ఎకరాల ప్రదేశంలో పునరుద్ధరణ క్షేత్రాలను వేయటానికి, పాత క్షేత్రాలను నిర్వహించటానికిగాను ఈ సంవత్సరానికి రు. 0.37 లక్ష కేటాయించ బడింది.

## రిజర్వు అడవులలో చెట్టుచేమ నశించిన కొండలమీద అడవుల పెంపకం

భూసారం కొట్టుకొని పోకుండా నివారించే నిమిత్తం యీ పథకం క్రింద రిజర్వు అడవులలో చెట్టుచేమ నశించిన కొండ వాలులలో గట్లువేసే

పద్ధతిని ఆటవీ పెంపక క్షేత్రాలు ఏర్పాటు చేయబడినాయి. ఈ జిల్లాలో యింకా 15 ఎకరాల ప్రదేశంలో యీ ఆటవీ పెంపక కార్యక్రమాన్ని అమలు పరచేటందుకు, పాత క్షేత్రాలను నిర్వహించేటందుకుగాను 1959-60 ప్రణాళికలో రు. 0.015 లక్ష కేటాయించ బడింది.

## ఏజెన్సీ అడవుల్లో రోడ్లు

ఆంధ్రలోని ఏజెన్సీ ప్రాంతాల్లో రోడ్లను అభివృద్ధిపరచడానికి యీ పథకం ఉద్దేశించబడింది. 1959—60 సం. లో 77 1/2 మైళ్ళ పొడవున రోడ్లు వేయడానికి ప్రతిపాదించబడింది. ఇందుకు ప్రణాళికలో రు. 3.97 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.97లక్షల మొత్తం యీ జిల్లాలో 35 మైళ్ళపొడవున రోడ్లను వేయడానికి ప్రత్యేకించబడింది.

## కలప రవాణా నియమావళి.

కలపను దొంగ రవాణా చేయకుండా నివారించడానికి గాను కలపను ఒక చోటనుండి మరొక చోటకు చేరవేయడం మీద కట్టు దిట్టమైన పర్యవేక్షణ జరపడానికి ఈ పథకం ఉద్దేశింప బడింది. 1959—60 లో ఆంధ్రప్రాంతపు డివిజన్లు అన్నింటిలోను 80 మంది తానాదార్లు నియమించ బడతారు. ఇందుకు ప్రణాళికలో రూ 0.35 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఆ మొత్తంలో రూ. 0.0175 లక్ష మొత్తం నలుగురు తానాదార్ల నియామకానికి గాను ఈ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

# భూసార రక్షణ

## అరకులోయ పైలట్ పథకం

అరకులోయలో భూసారరక్షణకు సంబంధించిన పైలట్ పథకం ప్రదర్శన పరిశోధన పథకంగా 1955—56 లో ప్రారంభించ బడింది. ప్రస్తుతం సాగులో ఉన్నభూమి యింకా సారం పోగొట్టుకొనకుండా చేసేటందుకు, ఆదిమవాసులు "పోడు" వ్యవసాయం చేయకుండా నివారించేటందుకు, వివిధ దశల్లో బురద పేరుకు పోవడాన్ని తగ్గించటానికి, జాలపుట్టి రిజర్వాయర్లలో మట్టి పేరుకు

పోకుండా చేయటానికి యీ పథకం ఉద్దేశించ బడింది. 1957—59 లలో 1,939 ఎకరాల్లో వివిధ భూసార రక్షణ చర్యలు తీసికోబడినాయి 1959–60 లో యింకా 2,000 ఎకరాల్లో యీ చర్యలను తీసికోవడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు యీ సంవత్సరం ప్రణాళికలో రు.1.91 లక్షల మొత్తం కేటాయించ బడింది. (ఇందులో రు.1,51 లక్షల మొత్తం సాధారణ భూసారరక్షణ చర్యలకు, మిగతా మొత్తం సిబ్బంది కొనసాగింపుకు వినియోగించ బడతాయి.)

## పెందుర్తి జాతీయ విస్తరణ సేవాకేంద్రంలో భూసార రక్షణ కార్యక్రమం.

సామాన్య రైతులకు భూసార రక్షణ పట్ల ఆసక్తిని కలుగ చేయడానికి, భూసారరక్షణ వల్ల కలిగేమేళ్ళను గురించి వారికి తెలియ చేయడానికిగాను యీ పథకం 1957 నవంబరులో ప్రారంభించ బడింది. 1957—59 లలో 1,703 ఎకరాల్లో భూసార రక్షణ చర్యలు తీసికోబడినాయి. 1959—60 లో రు.0.40 లక్ష సిబ్బంది కొనసాగింపుకు, క్రింది పనుల నిర్వహణకు గాను కేటాయించ బడింది:—

1. 90 ఎకరాల్లో సాలోపు గట్లు వేయడం.
2. త్రవ్వకం పని జరుపబడిన ప్రదేశంలో ఆర్థిక ప్రాముఖ్యం ఉన్నవిత్తనాలను చల్లడం.
3. మొత్తం ప్రాంత మంతటికీ సంబధించిన హక్కులు, బాధ్యతలను వివరించే రిజిస్టరును తయారు చేయడం.
4. మొత్తం ప్రాంతమంతటికీ ప్లానులను, ఎస్టిమేట్లను తయారు చేయడం.
5. సాగుకు లాయకీ గానట్టి, బంజరు భూములలో త్రవ్వకం పని చేయడం.
6. ముఖ్యమైన స్థలాలలో చెక్ డాములను నిర్మించటం మూలంగా కాలువలలో నీటిప్రవాహాన్ని అదుపులో పెట్టడం.

### మాచ్‌కంఢ్ బేసిన్ కు సంబంధించి భూసార రక్షణ పథకం

1957 జులై నెలలో యీ పథకం ప్రారంభించ బడింది. జాలపుట్టి ఆనకట్ట వద్ద త్వరగా మట్టి పేరుకొని పోవడం నివారించే టందుకు, సాగులో ఉన్న భూమికి శాశ్వతమైన అభివృద్ధి పనులను చేయడానికి. ఆదివాసుల చేత "పోడు" వ్యవసాయం మాన్పించి వారిని శాశ్వత వ్యవసాయంలో ప్రవేశ పెట్టే టందుకు, వ్యవసాయోత్పత్తిని ఎక్కువ చేసేటందుకు ఉత్తమ వ్యవసాయ పద్ధతులను ప్రవేశ పెట్టడానికి, కొండ తెగలవారికి ఉద్యోగాలను కల్పించటమే కాక ఆర్థిక సహాయం చేయడానికి గాను యీ పథకం ఉద్దేశించ బడింది. 1958—59 లో 6,833 ఎకరాల్లో భూసార రక్షణ చర్యలు తీసికో బడినాయి. 1959—60 లో రు. 5.58 లక్షల మొత్తం 6,400 ఎకరాల్లో భూసార రక్షణ చర్యలు తీసికోవడానికి, యింతకుముందు నియమించ బడిన సిబ్బందిని కొనసాగించడానికిగాను కేటాయించ బడింది.

# మత్స్యసంవర్ధన

## అధికంగాచేపపిల్లల సేకరణ, వాటి పంపిణీ.

గోదావరి, కృష్ణనదుల్లోను, తూర్పు, పశ్చిమగోదావరి- కృష్ణా, గుంటూరు జిల్లాలలోని డెల్టా ప్రాంతాల్లో ఉన్న నీటిపారుదల కాలువలలోను చేప పిల్లలు పుష్కలంగా లభిస్తాయి. చేపల ఉత్పత్తిని ఎక్కువ చేయుటంకోసం రాజ్యంలోని జలాశయాల్లో నిలువ చేయడానికిగాను చేప పిల్లల్ని, అందులోను త్వరగా పెరిగే రకాల్ని, పై నదులనుండి కాలువలనుండి సేకరించటానికి యీ పథకం క్రింద ఉద్దేశించ బడింది. ఈ చేపలు సేకరించ బడే ప్రాంతాలనుండి నిలువ చేయబడే ప్రాంతాలకు వీటినిరవాణా చేయటంకోసం 1957—58 లో 12 వ్యానులు కొనబడినాయి. ప్రత్యేక సిబ్బందికూడ నియమించ బడింది. ప్రస్తుతమున్న సిబ్బంది సహాయంతోను, వ్యానుల సహాయంతోను 1959-60 లో 2 కోట్ల చేపపిల్లలను సేకరించటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 1.93 లక్షలమొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.15 లక్ష యీ జిల్లాలో 10 లక్షల చేప పిల్లలను సేకరించటానికి గాను ప్రత్యేకించ బడింది.

## చేపల మార్కెట్లు

రాజ్యంలో ఉన్న చేపల మార్కెట్లు చాలా వరకు అపరిశుభ్రంగాను, మురికిగాను ఉన్నాయి. చేపల మార్కెట్లను నిర్మించి వాటిని పరిశుభ్రమైన స్థితిలో ఉంచ వలసిన బాధ్యత సామాన్యంగా స్థానిక సంస్థలు, మునిసిపాలిటీలు వహించాలి. అయినప్పటికీ వాటి ఆదాయ మార్గాలు చాలా తక్కువగా ఉన్న కారణం వల్ల మార్కెట్ల నిర్మాణానికి సబ్సిడీల నివ్వటం ద్వారా స్థానిక సంస్థలకు సహాయం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఆంధ్ర ప్రాంతంలో 5 పెద్దవి 6 చిన్నవి చేపల మార్కెట్లను నిర్మించటం కోసం స్థానిక సంస్థలకు, మునిసిపాలిటీలకు సబ్సిడీల నివ్వటానికిగాను 1959—60 సంవత్సరానికి రు. 1.23 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో ఒక మార్కెట్టును యీ జిల్లాలో నిర్మించుటకు ప్రభుత్వ సహాయం లభిస్తుంది.

## ఉప్పు సబ్సిడీ పథకం

అవసరానికి మించి లభ్యమయ్యే చేపలను పరిశుభ్రమైన పరిస్థితులలో నిలువ చేసికొనేటందుకు జెస్తవారికి యీ పథకం క్రింద ఉప్పు తగ్గింపుధరలకు సరఫరా చేయబడుతున్నది. ఇందువల్ల వారు తమకష్టానికి తగిన ప్రతిఫలం పొందడానికి వీలు చేకూరుతుంది. ప్రస్తుతం ఆంధ్రలోని కోస్తాజిల్లాలలో చేపలను శుభ్రపరచే కేంద్రాలు 14 ఉన్నాయి. 1959—60 లో వీటిని కొనసాగించడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు రు. 0.53 లక్ష ఖర్చవుతుంది. ఇందులో రు. 0.15 లక్ష యీ జిల్లాలో 350 టన్నుల చేపలను శుభ్రపరచడానికిగాను ప్రత్యేకించబడింది.

## మత్స్య క్షేత్రాలు

పెంపకానికిగాను చేపలను, విదేశీరకం చేపలను నిల్వచేయటంకోసం యీ సంవత్సరంలో 3 మత్స్య క్షేత్రాలను నిర్మించడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.55 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో ఒక క్షేత్రం యీ జిల్లాలో రు. 0.55 లక్ష ఖర్చుతో నిర్మించ బడుతుంది.

## శీఘ్ర రవాణా సౌకర్యాలు

పట్టిన చేపలు ఎక్కువ భాగం చెడిపోకుండా నివారించే టందుకు 1957—59 లో 10 వ్యానులు, 2 క్యారియర్ పడవలు కొనబడ్డాయి. ప్రస్తుతం రవాణా సౌకర్యాలు లేని రోడ్డుమీద నడపబడే ఈ వ్యానులకు ప్రతి సంవత్సరం అయ్యే ఖర్చుకోసం 1959—60 లో రూ. 1.00 లక్ష మొత్తం ప్రత్యేకించ బడింది. ఆ 14 వ్యానులలోను రెండు యీ జిల్లాకు లభ్య మౌతాయి.

## క్రొత్త రకం నైలాను వలలు

ప్రస్తుతం బెస్తలు ప్రత్తితోను, జనుముతోను చేసిన వలలను వాడుతున్నారు. ఇవి అంతమన్నికైనవికావు. తరచుచేపలు వలలు తెంపుకుని పోవడం కూడా జరుగుతు ఉన్నది. తత్ఫలితంగా బెస్తలు వారుపడ్డ శ్రమకు తగిన ఫలితం పొందడం లేదు. నైలాను వలలు బాగా ఉపయోగపడుతున్నట్లు కనుగొనబడింది. అందువల్ల 200 నైలాను వలలు అసలు ఖరీదులో 33⅓వంతకు 1959—60 లో బెస్తల పంపకం చేయడానికి ఉద్దేశింప బడింది. వీటి ఖరీదు చేపలు పట్టని సీజను వదలి 5 సంవత్సరాల కాలపరిమితితో తేలిక వాయిదాలలో వారినుండి వసూలు చేయబడుతుంది. ఆ 200 వలలో 50 వలలు ఈ జిల్లాలో పంపిణీ చేయబడతాయి.

## బెస్తవారికి దుంగల సరఫరా.

పేదరికంవల్ల దుంగల ఖరీదు అధికం కావడంవల్ల బెస్తలు, వారు మొదటినుంచి వాడుతున్న దుంగలు పాతవై పోయినప్పటికి క్రొత్తవాటిని కొనుక్కోలేక పోతున్నారు. అందువల్ల అసలు ఖరీదులో 75 శాతానికి 1959—60 లో 320 దుంగలను ఈ పథకం క్రింద పంపిణీ చేయడానికి ఉద్దేశించ బడింది. ఈ ఖరీదు 5 సంవత్సరాలకాల పరిమితితో తేలిక వాయిదాల మీద వసూలు చేయబడుతుంది. అందులో 60 దుంగలు ఈ జిల్లాలో పంపిణీ చేయబడతాయి.

### పడవల నిర్మాణపు కేంద్రం

చిన్న పడవలను నిర్మించేటందుకు ప్రస్తుతం రాజ్యంలో ఏవిధమైన నిర్మాణ కేంద్రంగాని లేదు. పడవలను ఎక్కువచేయడం పడవలకు యంత్రాలను సమకూర్చడం వల్ల ఎక్కువగా పడవలు కావలసివస్తున్నాయి. ఈ అవసరాన్ని తీర్చడానికిగాను, తూర్పు గోదావరి జిల్లాలో రూ. 1.00 లక్ష వ్యయంతో 1958—59లో ఒక నిర్మాణ కేంద్రం నెలకొల్ప బడింది. ఈ సంవత్సరంలో రూ. 1.00 లక్ష మొత్తం ఈ కేంద్రాన్ని నిర్వహించడానికి, 60 పడవలను తయారుచేయడానికిగాను ప్రణాళికలో కేటాయించబడింది. అందులో 12 పడవలు ఈ జిల్లాకు సరఫరా చేయబడతాయి.

## సహకారం, గిడ్డంగులు, మార్కెట్లు.

### గ్రామీణ పరపతి సంఘాల విస్తరణ.

ఇది కొనసాగుతూ వస్తున్న పథకం. అఖిల భారత గ్రామీణ పరపతి పరిశీలన సంఘంవారు సూచించిన పద్ధతుల ననుసరించి రాజ్యంలోని గ్రామీణ పరపతి సంఘాలను పునర్వ్యవస్థీకరించటానికి, పటిష్ఠం చేయటానికి, విస్తరింప చేయటానికి యీ పథకం క్రింద ఉద్దేశించ బడింది. సహకార శాఖలో సిబ్బందిని పెంచటంద్వారాను, సెంట్రలు బ్యాంకులు, పెద్ద తరహా సంఘాలచే అదనంగా నియమించ బడిన పర్యవేక్షక, నిర్వాహక సిబ్బందికి అయ్యే ఖర్చు క్రింద సహాయం చేయటం ద్వారాను యీ పథకం రెండవ ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో అమలు జరుప బడింది.

జాతీయ అభివృద్ధి మండలివారు సహకార విధానాన్ని గురించి ఒక తీర్మానాన్ని చేశారు. గ్రామీణులతో సహకార సంఘాల నిర్మాణం జరగాలని అందువారు నొక్కి వక్కాణించారు. ఈ తీర్మానాన్ని పురస్కరించుకొని ఈ సంవత్సరం పెద్ద తరహా సంఘాలను గ్రామీణ బ్యాంకులకు ఏర్పాటు చేయటం నిలుపుదల చేయబడుతుంది. అయితే ఆంధ్ర ప్రాంతంలో క్రొత్తగా 350 చిన్న తరహా సంఘాలను ఏర్పాటు చేయటానికి, ప్రస్తుతమున్న 500 చిన్న

తరహాసంఘాలను పటిష్ఠం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందువల్ల యీ సంవత్సరం అంతమయ్యేలోగా నూటికి 82 గ్రామాలు, నూటికి 32 మంది గ్రామీణ ప్రజలు సహకార సంఘాల క్రిందకు తీసుక రాబడతారు. 1,020 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలు, రు. 100 లక్షల వరకు మధ్యకాలిక ఋణాలుకూడ ఇవ్వబడతాయి. పరిపాలన శాఖనుండి ఆడిటు శాఖను విడతీయటానికి సంబంధించిన పథకాన్నికూడ ఈ సంవత్సరంలో అమలు జరపటానికి ప్రతిపాదింపబడింది. రిజిస్ట్రారుకు ఆర్థిక సలహాదారు అని వ్యవహరింపబడే ఒక జాయింటు రిజిస్ట్రారుకూడ ప్రధాన కార్యాలయంలో నియమించబడతారు. గ్రామీణ పరపతి విస్తరణ పథకానికి సంబంధించిన పనినిమాత్రం యీయన ప్రత్యేకంగా నిర్వహిస్తారు. ఈ జిల్లాలో అమలు జరుపబడే కార్యక్రమం క్రింది విధంగా ఉంటుంది. 100 చిన్న తరహా సంఘాలు క్రొత్తగా ఏర్పాటు చేయబడతాయి. ప్రస్తుతమున్న 33 చిన్నతరహా సంఘాలు పటిష్ఠం చేయబడతాయి. పాత సంఘాల్లో 14,600 మంది సభ్యులు, క్రొత్త సంఘాలలో 5,000 మంది సభ్యులు చేర్చుకోబడతారు. రు. 200 లక్షల వరకు స్వల్పకాలిక ఋణాలు రు. 15 లక్షలవరకు మధ్యకాలిక ఋణాలు యివ్వబడతాయి.

పై కార్యక్రమాన్ని అమలు జరపటంకోసం యీ జిల్లాకు రు. 91,395లు కేటాయించబడినాయి. ఈ డబ్బు క్రిందివిధంగా వినియోగించబడుతుంది.

| | | రూపాయలు |
|---|---|---|
| 1. | చిన్నతరహా సంఘాలకు సబ్సిడీలు. | |
| | (ఎ) 1958—59 లో ప్రారంభించబడిన సంఘాలకు | 2,500 |
| | (బి) 1959—60 లో ప్రారంభించబడే సంఘాలకు | 4,000 |
| 2. | (ఎ) పెద్దతరహా సంఘాలకు సబ్సిడీలు | 21,800 |
| | (బి) గ్రామీణ సంఘాలకు సీనియరు ఇనస్పెక్టర్ల నియామకం క్రింద ఖర్చు | — |

| | |
|---|---|
| 3. సెంట్రలు బ్యాంకులకు సబ్సిడీలు. | |
| (ఎ) ఇంతకుముందు నియమించబడిన పాత సూపరు వైజర్లకుగాను | 6,000 |
| (బి) 1559—60 లో నియమించబడే క్రొత్త సూపరు వైజర్లకుగాను | — |
| 4. అదనపు సిబ్బందిక్రింద ఖర్చు | |
| (ఎ) ప్రణాళికయొక్క మొదటి రెండు సంవత్సరాలలో పరపతి విస్తరణ కార్యక్రమానికిగాను నియమించబడిన సీనియరు, జూనియరు ఇనస్పెక్టర్లకు | 3,555 |
| (బి) పైలట్ పథకానికిగాను సిబ్బంది నియామకం | 7,000 |
| (సి) కో-ఆపరేటివ్ సబ్-రిజిస్ట్రార్స్ ఫార్ క్రెడిట్ | 4,200 |
| (డి) కో-ఆపరేటివ్ సబ్ రిజిస్ట్రారులు (సి. డి.), టైపిస్టులు, జవానులు | 10,600 |
| (ఇ) అనకాపల్లి సర్కిలుతో (క్రొత్తది) 1957-58 లో నియమించబడిన సిబ్బందికి | 26,500 |
| (ఎఫ్) డిప్యూటి రిజిస్ట్రార్ల సర్కిళ్ళు ప్రతి ఒక్కదానిలోను 1959—60 లో జూనియరు ఇనస్పెక్టరు నియామకానికి | 2,440 |
| (జి) అనకాపల్లిలోని క్రొత్త సర్కిలుకు ఒక జూనియరు ఇనస్పెక్టరు, ఒక సీనియరు ఇనస్పెక్టరు నియామకం | 2,800 |
| మొత్తం | 91,395 |

## భూమి తనఖా బ్యాంకుల అభివృద్ధి

నీటి పారుదల వసతిని కల్పించడం, భూమిని సాగు క్రిందకు తీసుకురావటం మొదలయిన శాశ్వతమైన అభివృద్ధి పనులను భూములలో చేయటంకోసం యీ పథకంక్రింద 25 సంవత్సరాలలో తీర్చుకోదగ్గ దీర్ఘకాలిక ఋణాలు ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులద్వారా రైతులకు యివ్వబడతాయి. రు. 9.40 లక్షల వరకు దీర్ఘకాలిక ఋణాలు ఈ సంవత్సరంలో యీ జిల్లాలో యివ్వబడతాయి. ఈ సంవత్సరానికి యీ జిల్లాకు కేటాయించబడిన రు. 7,900 లు క్రింది విధంగా వినియోగించబడతాయి

| | | |
|---|---|---|
| 1. | ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో ప్రాథమిక భూమి తనఖా బ్యాంకులలో నియమించబడిన అదనపు సూపరు వైజరులక్రింద ఖర్చు | 2,?00 |
| 2. | ఈ సంవత్సరం నియమించబడే అదనపు సూపర్ వైజరులక్రింద ఖర్చు | 1,100 |
| 3. | భూమి తనఖా బ్యాంకుల పర్యవేక్షణ కోసం నియమించబడే సహకార సబ్-రిజిస్ట్రార్లు, వారి జవానుల క్రింద ఖర్చు | 4,000 |
| | మొత్తం | 7,900 |

## సహకార మార్కెటింగ్ అభివృద్ధి

ఇది కొనసాగుతూ వస్తున్న పథకం. వ్యవసాయదారులకు, ముఖ్యంగా చిన్నరకం మధ్యరకం ఉత్పత్తిదారులకు, స్టోరేజి, గిడ్డంగి, మార్కెటింగు సౌకర్యాలను కలిగించడం, తద్వారా వ్యవసాయోత్పత్తులకు సహకార మార్కెటింగు సౌకర్యాన్ని అత్యధికంగా కలుగచేయుడమే యీ పథకం లక్ష్యం. వ్యవసాయోత్పత్తులమీద స్వల్పకాలిక ఋణాలుకూడ రైతులకు

యివ్వబడతాయి. ఇంతేకాక మార్కెటింగు సంఘాలద్వారా రసాయనిక ఎరువులు, అవసరమయ్యే యితర సామాగ్రి రైతులకు సరఫరా చేయ బడతాయి. గ్రామాల స్థాయిలో పనిచేసే ప్రాథమిక వ్యవసాయ పరపతి సంఘాల కార్యక్రమాలకు, మండీ కేంద్రాలలో పనిచేసే మార్కెటింగు సంఘాల కార్యక్రమాలకుమధ్య సమన్వయం చేకూర్చడానికికూడ యీ పథకం ఉద్దేశించబడింది.

ఈ పథకంయొక్క పై లక్ష్యాలను సాధించడంకోసం రెండవ ప్రణాళికలో ప్రాథమిక మార్కెటింగు సంఘాలను పునర్వ్యవస్థీకరించి, పటిష్ఠం చేయటానికి ఉద్దేశించబడింది. మండీ కేంద్రాలలో ప్రధాన గిడ్డంగులను, గ్రామాల స్థాయిలోని మండీలలో ఉప గిడ్డంగులను నిర్మించటానికి, ప్రత్తి జిన్నులు, నూనె మిల్లులు, చెరకు క్రషర్లు మొదలయిన ప్రాసెసింగు ప్లాంటులను నెలకొల్పటానికిగాను సంఘాలకు సహాయం చేయటంకోసం రాజ్య ప్రభుత్వం యీ కార్యక్రమాలలో పాల్గొంటుంది. శిక్షణ పొందిన సిబ్బంది సహాయం, ఆర్థిక సహాయంకూడ యీ సంఘాలకు యివ్వబడుతుంది. ఈ సంవత్సరంలో క్రింది కార్యక్రమం యీ జిల్లాలో అమలు జరుపబడుతుంది.

| | | |
|---|---|---|
| 1. | వ్యవసాయోత్పత్తిపై ఋణాలను యివ్వటం (రూపాయలు,లక్షలలో) | 10·00 |
| 2. | మార్కెటింగు సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు (సంఖ్య) | 2 |
| 3. | పెద్దతరహా సంఘాలచే నిర్మించబడే గిడ్డంగులు (సంఖ్య) | 2 |
| 4. | నెలకొల్పబడే ప్రాసెసింగు యంత్రాలు (సంఖ్య) | 2 |

పై కార్యక్రమాన్ని అమలు జరపటం కోసం యీ జిల్లాకు రు. 2.850 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రిందివిధంగా వినియోగించబడుతుంది.

| | రూపాయలు లక్షలలో |
|---|---|
| 1. మార్కెటింగు సంఘాలకు వాటామూలధనం క్రింద విరాళం | 0.500 |
| 2. జిల్లా మార్కెటింగు సంఘాలకు వాటా మూలధనం క్రింద విరాళం | 0.400 |
| 3. ప్రాథమిక మార్కెటింగు సంఘాలయొక్క నిర్వాహక సిబ్బంది ఖర్చుక్రింద సబ్సిడీ. | |
| (ఎ) గత మూడు సంవత్సరాలుగా సిబ్బందిని నియమించిన సంఘాలకు | 0.020 |
| (బి) 1959—60 లో సిబ్బందిని నియమించే సంఘాలకు | — |
| 4. పెద్దతరహా సంఘాలకు గిడ్డంగులు | |
| (ఎ) గత సంవత్సరాలలో నిర్మాణం ప్రారంభించబడిన గిడ్డంగులను పూర్తిచేయుటకు. | 0.200 |
| (బి) 1959—60 లో నిర్మాణం ప్రారంభించబడే క్రొత్తగిడ్డంగులకు | 0.200 |
| 5. మార్కెటింగు సంఘాలచే గిడ్డంగులనిర్మాణం. | |
| (ఎ) పాతగిడ్డంగుల నిర్మాణాన్ని పూర్తిచేయుటకు | — |
| (బి) క్రొత్త గిడ్డంగుల నిర్మాణానికి | 0.500 |
| 6. ప్రోసెసింగు యంత్రాల స్థాపనకు | 0.530 |
| మొత్తం | 2.350 |

## పరిశోధన, పరిశీలన, గణాంక వివరాలు.

ఈ పథకం క్రింద సహకార శాఖలో ఒక ప్రత్యేక విభాగం ఏర్పాటు చేయబడుతుంది. సహకార శాఖద్వారా అమలు జరుప బడే వివిధ పథకాల మూలంగా ప్రజలకు కలిగిన లాభాలను, ఆ పథకాలను అమలు జరపడంలో తెలియవచ్చిన అనుభవాలను పరిశీలించడానికి, సూత్రవిధానాలను రూపొందించటానికి, సహకార వ్యవస్థలో లోటుపాట్లు ఏవైనాఉంటే వాటిని సరిదిద్దుకొనేటందుకు మార్గాలను సూచించడానికి యీ ప్రత్యేక విభాగం కృషి చేస్తుంది. 1957—58 లో యీ పథకం అమలు జరప బడింది. గణాంక వివరాల సేకరణ, సంకలనానికి సంబంధించిన పనిని నిర్వహించుటకుగాను జిల్లాలలో 20 మంది సీనియరు ఇనస్పెక్టర్లను నియమించడం, ప్రధాన కార్యాలయంలో ఒక సెక్షను ఏర్పాటు చేయటం జరిగింది. ఈ పథకం 1958—59 లో కొనసాగించబడింది.

జిల్లాలలో పని చేస్తున్న సిబ్బందికి సూచనలు యివ్వడానికి, వారిపై అజమాయిషీ వహించడానికిగాను 1959—60 లో రిజిస్ట్రారు కార్యాలయంలో డిప్యూటీ రిజిస్ట్రారు గ్రేడులో ఒక స్టాటిస్టీషియనును, ఇద్దరు సీనియరు ఇనస్పెక్టర్లు, ఇద్దరు జూనియరు ఇనస్పెక్టర్లు, యిద్దరు జవానులతోకూడిన సిబ్బందిని నియమించడానికి, క్రొత్త సర్కిళ్లకుగాను 12 మంది సీనియరు ఇనస్పెక్టర్లను, ప్రతి సర్కిలుకు ఆఫీసుకు ఒక్కొక్కరు చొప్పున 46మంది లోయరు డివిజను గుమాస్తాలను నియమించడానికి ప్రతిపాదింప బడింది, క్రొత్త విధానాలను రూపొందించడానికి, వాటిని అమలు పరచుటకు తగిన కార్య విధానాన్ని రూపొందించటానికిగాను సహకారశాఖలో పరిశీలన, పరిశోధన ప్రచార విభాగం ఒకటి ఏర్పాటు చేయబడుతుంది. మొదట యీ విభాగం కోసం ముగ్గురు సహకార సబ్ రిజిస్ట్రార్లను, ముగ్గురు జవానులను నియమించటానికి ప్రతిపాదింప బడింది. పై కార్యక్రమాన్ని అమలు జరపడం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 1.70 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.34 లక్ష ప్రధాన కార్యాలయంలో నియమించబడే సిబ్బంది ఖర్చు క్రింద ప్రచారం మొదలైన వాటిక్రింద అయ్యే ఖర్చులకుగాను ప్రత్యేకించబడింది. మిగత రు. 1.36 లక్షల మొత్తంలో రు. 6,044 లు యీ జిల్లాలో నియమించ బడే సిబ్బంది క్రింద అయ్యే ఖర్చుకుగాను ప్రత్యేకించ బడినాయి.

## సహకార సంఘాల సభ్యులు. పంచాయితీదారులు మొదలైన వారికి శిక్షణ

అఖిల భారత సహకార సంఘంద్వారా భారత ప్రభుత్వంచే ప్రారంభిం చబడిన పథకం పద్ధతుల్లోనే యీ పథకం కూడ రూపొందించ బడింది. సహకార సూత్రాలను గురించి, నిర్వహణా విధానంగురించి గ్రామీణ పరపతి సంఘాల సభ్యులకు రెండు మూడు రోజులపాటు, పంచాయితీ దారులకు ఒక వారం రోజులపాటు, సంఘాల నిర్వాహకులకు, జీతం చెల్లింపై పనిచేసే ఉద్యోగులకు 5 లేక 6 వారాల పాటు శిక్షణ యివ్వటానికి యీ పథకం కింద ఉద్దేశింప బడింది. ఈ జిల్లాలో 1,000 మంది సహకార సంఘాల సభ్యు లకు, 300 మంది పంచాయతీదార్లకు, 40 మంది కార్యనిర్వాహకులకు శిక్షణ యివ్వటం కోసం 1959—60 సంవత్సరానికి యీ జిల్లాకు రు. 5,856 లు కేటాయించ బడినాయి.

## సహకార వ్యవసాయం.

ఈ పథకం క్రింద భూములేని వ్యవసాయ కూలీలను, సహకార వ్యవసాయ సంఘాలను స్థాపించడం ద్వారా వ్యవసాయంలో స్థిరపడేటట్టుచేసి వారికి పునరావాసం కల్పించటానికి, వాటా మూలధనం క్రింద. ఎద్దులను కొనుక్కోవడానికి అయ్యే ఖర్చు క్రింద, భూమిని వ్యవసాయ యోగ్యంగా చేసి అభివృద్ధి పరచడానికి అయ్యే ఖర్చు క్రింద, వ్యవసాయ పనిముట్లను మొదలయిన వాటిని కొనుక్కోవడానికి అయ్యే ఖర్చు క్రింద ఋణాలు, గ్రాంట్ల రూపంలో ఆర్థిక సహాయం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఈ సంవత్సరం ప్రణాళికలో ఆంధ్ర ప్రాంతానికి రు. 1.34 లక్షలు, తెలంగాణా ప్రాంతానికి రు. 0.88 లక్ష. మొత్తం రు. 2.22 లక్షలు కేటాయించ బడినాయి. ఇందులో రు. 0.28 లక్ష సహకార వ్యవసాయానికి సంబంధించిన పనిని నిర్వ హించటం కోసం హెడ్ ఆఫీసులో నియమించ బడిన సిబ్బందికి అయ్యే ఖర్చు క్రింద వినియోగించ బడుతుంది. మిగత మొత్తంలో రు. 6,500 లు యీ ఈ సంవత్సరంలో యీ జిల్లాలో ఏర్పాటు చేయబడే క్రొత్త సంఘాలకు ఆర్థిక సహాయం చేయడానికి వినియోగించ బడతాయి. ఈ జిల్లాలో ఈ సంవ

త్సరం 100 మంది సభ్యులతో 1 క్రొత్త సంఘం ఏర్పాటు చేయబడుతుంది. 500 ఎకరాల భూమి సాగుచేయబడుతుంది.

## రాజ్య గిడ్డంగి సంస్థ
## (స్టేట్ వేర్ హౌసింగ్ కార్పొరేషన్)

దేశంలో గిడ్డంగి సౌకర్యాల్ని అభివృద్ధి చేయాల్సిన ఆవశ్యకతను గురించి అనేక కమిటీలు, కమిషన్లు అనేకసార్లు నొక్కి చెప్పాయి. పరపతి సంఘాలు పరపతేతర సంఘాల మధ్య యివి చక్కని సారథ్యం వహించేవిగా ఉంటాయి. ఇందువల్ల భారతప్రభుత్వం వారు కేంద్రి గిడ్డంగి కార్పొరేషను నొకదాన్ని ఏర్పాటు చేశారు. ఇందు కనుగుణంగా రాజ్యగిడ్డంగి కార్పొరేషన్లను తమతమ రాజ్యాలలో స్థాపించ వలసిందిగా రాజ్య ప్రభుత్వాలు కోరబడినాయి ఈ రాజ్య గిడ్డంగి కార్పొరేషనులు గిడ్డంగుల మండలి ప్రత్యక్ష పర్యవేక్షణ క్రింద పనిచేస్తాయి. గిడ్డంగులలో సరకులు నిలువ చేయబడినట్లుగా యివ్వబడే రసీదులు నెగోషియబుల్ ఇన్స్ట్రుమెంట్లు గా పరిగణించబడతాయి. గిడ్డంగులలో వ్యవసాయోత్పత్తులను నిలువ చేసిన వారికి పై రసీదుల నాధారం చేసికొని బ్యాంకింగు సంస్థలు ఋణాలను యిస్తాయి. 1958—59లో రాజ్య గిడ్డంగి కార్పొరేషను ఒకటి యీ రాజ్యంలో స్థాపించబడింది. ఈకార్పొరేషను వాటా మూలధనం క్రింద రాజ్యప్రభుత్వం రు. 2 50 లక్షల మొత్తం యిచ్చింది. ఈ కార్పొరేషనుకు వాటా మూలధనం క్రింద యింకా ఎక్కువ డబ్బును సమకూర్చటంకోసం ఆంధ్ర ప్రణాళికలో రు. 5 లక్షలు, తెలంగాణా ప్రణాళిలో రు. 5 లక్షలు ఈ సంవత్సరంలో కేటాయించబడినాయి. ఈ జిల్లాలోని రైతులకుకూడ యీ పథకం క్రింద లభ్యమయ్యే సౌకర్యాలు అందుబాటులో ఉంటాయి.

## కమతాల ఏకీకరణ

ఆంధ్రప్రాంతంలో కమతాల ఏకీకరణ కార్యక్రమాన్ని ప్రారంభించడం కోసం కొన్ని ఆంధ్రజిల్లాల్లోఉన్న పరిస్థితులను పరిశీలించి పరిపాలన, శాసన నిర్మాణానికి సంబంధించి తగిన ప్రతిపాదనలను అందచేయవలసిందిగా రాజ్య కమతాల ఏకీకరణ డైరెక్టరును కోరడం జరిగింది. హైదరాబాదు కమతాల

ఏకీకరణ చట్టాన్ని ఆంధ్ర ప్రాంతానికికూడ వర్తింపచేయడంకోసం విధాన సభలో ఒక బిల్లుకూడ ప్రవేశపెట్టబడింది. శాసనం జరిగినవెంటనే 1959—60లో చిత్తూరు, శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలలో కమతాల ఏకీకరణ కార్యక్రమం ప్రారంబించబడుతుంది. ఇందుకు 1959—60 ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం (జిల్లాకు లక్ష రూపాయలచొప్పున) కేటాయించబడింది.

# జాతీయ విస్తరణ సేవా కేంద్రాలు, సామాజికాభివృద్ధి కేంద్రాలు

1959 వ సంవత్సరం మార్చి నెల అంతంనాటికి యీ జిల్లాలో 7 మొదటిదశ బ్లాకులు. 4 సామాజికాభివృద్ధి బ్లాకులు రెండు బహుళార్థ సాధక బ్లాకులు రెండు ప్రీ-ఎక్స్టెన్‌షన్ బ్లాకులు ఉన్నాయి. వీటి వైశాల్యం 1930.50 చదరపు మైళ్లు. జనాభా 10,40,027; ఈ కేంద్రాలలోని గ్రామాల సంఖ్య 900 భారత ప్రభుత్వంవారి నిర్ణయానుసారం 1959 సంవత్సరం ఏప్రిల్ నెల నుండి ఏర్పాటుచేయబడే ప్రతి బ్లాకులోకూడ ప్రత్యేకంగా వ్యవసాయరంగంలో ఒక సంవత్సరంపాటు తీవ్ర కృషి (ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమము) జరిగి ఉండాలి. అదేప్రకారం యీ జిల్లాలోని అచ్యుతాపురం, వడ్డాది బ్లాకుల్లో వరుసగా 1—4—58, 2—10—58 తేదీల నుండి ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమం మొదలుపెట్టబడింది. 1—4—58 నాటినుండి ప్రీ-ఎక్స్టెన్షన్ కార్యక్రమాన్ని ప్రారంభించిన బ్లాకు 1—4—59 నుండి మొదటిదశ బ్లాకుగా ప్రారంభించబడింది. 2—10—58 నుండి యీ కార్యక్రమం ప్రారంభించిన బ్లాకు 2—10—59 నాడు మొదటిదశ బ్లాకుగా రూపొందుతుంది. ఇంతేకాక పెందుర్తి, సబ్బవరం, కోటవురుట్ల, నక్కపల్లి సామాజికాభివృద్ధి బ్లాకు 1—4—1959 తేదీనుండీ రెండవదశ బ్లాకుగా రూపొందాయి. 1959—60 లో యీ రాజ్యానికి 36 ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకులు కేటాయించబడినాయి. ఇందులో 18 బ్లాకులు 1—4—59 నాడు, మిగతావి 2—10—1959 నాడు ప్రారంభించబడినాయి. ఇందులో కొత్తవలస, గజపతినగరం బ్లాకులు యీ జిల్లాలో ఉన్నాయి. ఇవి వరుసగా 1—4—1959 మరియు 2—10—195

తేదీలలో ప్రారంభించబడినాయి. ఈ విధంగా 1—4—1959 నాటికి యీ జిల్లాలో 8 మొదటిదశ బ్లాకులు, 3 రెండవదశ బ్లాకులు, రెండు సామాజికాభివృద్ధి కేంద్రాలు, రెండు బహుళార్థసాధక ప్రాజెక్టులు, 2 ప్రీ-ఎక్స్టెన్షన్ బ్లాకులు ఉన్నాయి.

ఈ జిల్లాలో సామాజికాభివృద్ధి కార్యక్రమాన్ని అమలు పరచటంకోసం ఈ సంవత్సరం ప్రణాళికలో ఋణాల పద్దుక్రింద రు. 10,32,800 లు. గ్రాంట్లు పద్దుక్రింద రు. 15,85,600లు, మొత్తం రు. 26,21,400లు కేటాయించబడినాయి.

1—4—1959 నాటికి యీ జిల్లాలో ఉన్న బ్లాకులను చూపే పటం ప్రక్కపుటలో యివ్వబడింది.

# పంచాయితీలను పటిష్ఠం చేయడం

## సిబ్బంది పథకం

పంచాయతీలను పటిష్ఠం చేసే ఉద్దేశంతో. జిల్లాస్థాయిలో జిల్లా పంచాయితీ ఆఫీసరును, రెవెన్యూ డివిజను స్థాయిలో డివిజనల్ పంచాయితీ అఫీసరును, తాలుకా స్థాయిలో బ్లాకు ప్రాంతాలను మినహాయించి డిప్యూటీ పంచాయతీ ఆఫీసరును, బ్లాకు స్థాయిలో పంచాయతిలకు విస్తరణాధికార్లను నియమించడం, జిల్లా పంచాయతి ఆఫీసర్ల కార్యాలయాలలో అదనపు సిబ్బందిని నియమించడం ద్వారా 1958—59 సంవత్సరంలో పంచాయతీ పరిపాలనకు సంబంధించిన పర్యవేక్షక, నిర్వాహక సిబ్బంది వ్యవస్థ పునర్వ్యవస్థీకరించబడింది. 1959—60 ప్రణాళికలో రు. 8.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.120 లక్ష ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషను కార్యాలయంలో నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించేటందుకు. రు. 0.191 లక్ష పడమర, తూర్పు ఇనస్పెక్టింగ్ ఆఫీసర్ల కార్యాలయాల్లో నియమించ బడిన అదనపు సిబ్బందిని కొనసాగించేటందుకు గాను ప్రత్యేకించ బడినాయి. అదనంగా ఖర్చుపెట్టాల్సిన అవసరం ఉండే జిల్లాలకు తిరిగి పంపకం చేసే నిమిత్తం ఇనస్పెక్టర్ జనరల్ ఆఫ్ లోకల్ అడ్మినిస్ట్రేషన్ ఆదీనంలో 0.524 లక్ష ఉంచబడింది. మిగిలిన రు. 7.165 లక్షలలో రు. 0.3120 లక్ష 1958—59 సంవత్సరంలో యీ జిల్లాలో నియమించబడిన అదనపుసిబ్బందిని కొనసాగించే నిమిత్తం ప్రత్యేకించబడింది.

## శిక్షణ పథకం

ఈ పథకంక్రింద సామర్లకోట, రాజేంద్ర నగరులలో ఉన్న రెండు విస్తరణ శిక్షణ కేంద్రాలలో డిప్యూటీ పంచాయతీ ఆఫీసర్లకు, పంచాయతీలకు సంబంధించిన ఎక్స్టెన్షన్ ఆఫీసర్లకు, డివిజనల్ పంచాయతీ ఆఫీసర్లకు పరిపాలనా వ్యవహారాలకు సంబంధించి శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింపబడింది. ఈ శిక్షణ రెండు నెలలపాటు యివ్వబడుతుంది. తడవకు 40 మంది ఆఫీసర్లకు శిక్షణ యివ్వబడుతుంది. మొత్తంమీద అన్ని వర్గాలకు చెందిన 390 మంది ఆఫీసర్లకు 1959—60 లో శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింపబడింది.

ఇందుకుగాను ప్రణాళికలో రు. 2.90 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాకు చెందిన ఆఫీసర్లకుకూడ యీ పథకంక్రింద శిక్షణ యివ్వబడుతుంది.

## పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనులు

పెద్దతరహా, మధ్యతరహా నీటిపారుదల పనుల నిర్వహణకోసం 1959—60 సంవత్సరానికి యీజిల్లాకు రు. 2.73 లక్షల మొత్తం కేటాయించ బడింది. వీటి వివరాలు క్రిందయివ్వ బడినాయి:—

| వరుస సంఖ్య | ప్రాజెక్టు పేరు | 1959—60 లో కేటాయింపు. (రు. లక్షలలో) | కేటాయింపుకు కారణం | నీటిపారుదల జరిగే ప్రదేశం (ఎకరాలలో) |
|---|---|---|---|---|
| 1. | వరాహా రిజర్వాయరు | 0.50 | పరిశీలన పూర్తిచేయుటకు | — |
| 2. | గాడిగుమ్మి రిజర్వాయరు | 2.23 | కొనసాగింపుకు | — |

## విద్యుచ్ఛక్తి

### మాచ్‌ఖండ్ జల-విద్యుచ్ఛక్తి పథకం (బకాయి, క్రొత్తపనులు)

1957—58 సంవత్సరానికి ముందు 17,000 కిలోవాట్ల శక్తిగల 3 విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలు (జనరేటింగ్ యూనిట్లు) పనిచేయడం ప్రారంభమయింది. ఒక్కొక్కటి 21,250 కిలోవాట్ల శక్తిగల మిగత రెండు ఉత్పాదక యంత్రాలను నెలకొల్పడంకూడ 1957_58 లోనే ప్రారంభించ బడింది. 21,250 కిలోవాట్ల శక్తి ఉండే ఆరవ ఉత్పాదక యంత్రంతోపాటు పై రెండు యంత్రాలుకూడ 1958_59 లో పనిచేయడం ప్రారంభమవుతుందని మొదట ఆశించ బడింది. కాని మాచ్‌ఖండ్ వద్ద జరిగిన సమ్మె మూలంగా 21,250 కిలో

వాట్ల శక్తిగల నాలుగవ ఉత్పాదక యంత్రం మాత్రం 1959 జనవరి లో పని చేయడం ప్రారంభమయింది. అయిదవ ఉత్పాదక యంత్రం 1959—60 లో పనిచేయడం ప్రారంభమవుతుందని ఆశించ బడుతున్నది. ఇతర కొదువ పనులతో పాటు ఆరవ ఉత్పాదక యంత్రాన్ని నెలకొల్పడానికి సంబంధించిన పనికూడ నాలుగవ అయిదవ ఉత్పాదక యంత్రాలను నెలకొల్పడానికి సంబంధించిన పనితోపాటు ఒకేసారి మొదలుపెట్ట బడింది. 1959—60 సంవత్సరానికి చేయబడిన రు. 79.07 లక్షల మొత్తం కేటాయింపులో యీ జిల్లా వాటా రు. 10.83 లక్షలు. ఈ కేంద్రం యిప్పుడు పూర్వపు ఆంధ్ర రాజ్యంలోని జిల్లాలయిన శ్రీకాకుళం, విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పశ్చిమగోదావరి, కృష్ణా, గుంటూరు, నెల్లూరు జిల్లాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా స్తుచేన్నది.

## ఎగువ సీలేరు జల విద్యుచ్ఛక్తి పథకం

ప్రథమ దశక్రింద ఒక్కొక్కటి 60,000 కిలోవాట్ల శక్తిఉండే రెండు విద్యుచ్ఛక్తి ఉత్పాదక యంత్రాలను నెలకొల్పడం ద్వారా సీలేరునది ఎగువ భాగంలో విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయుడానికి యీ పథకంక్రింద ఉద్దేశించ బడింది. ఈ పథకానికి సంబంధించిన సవివరమైన పరిశీలనలు జరప బడినాయి. క్యాంపులను నెలకొల్పడానికి, రవాణా సౌకర్యాలను ఏర్పాటు చేయుడానికి సంబంధించిన ప్రాథమిక చర్యలు అమలు జరుగుతున్నాయి. ఈ సంవత్సరం యీ పథకానికి సంబంధించిన పనిని ప్రారంభించడానికి ప్రతిపాదింప బడింది. 1959—60 సంవత్సరానికి కేటాయించ బడిన రు. 73.00 లక్షల మొత్తం క్యాంపులను నిర్మించడం, ఆనకట్టకు పునాదులను త్రవ్వడం, మట్టిగట్లను నిర్మించడం మొదలయిన సివిలుపనులకు గాను ముఖ్యంగా వినియోగించ బడుతుంది. ఇందులో యీ జిల్లా వాటాగా రు. 10.43 లక్షల మొత్తం ప్రత్యేకించ బడింది.

## గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తి సరఫరా

ఈ పథకం క్రింద గ్రామీణ ప్రాంతాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేయ టమేగాక నాగార్జునసాగరు ప్రాజెక్టు పనులకు, గరివిడి ఫెర్రోమాంగనీసు

ఫ్యాక్టరీ మొదలయిన పెద్ద పారిశ్రామిక కేంద్రాలకు విద్యుత్ సరఫరాలను విస్తరింపచేయడం, రు. 10లక్షలకు మించి ఖర్చయ్యే విస్తరణ పథకాలు అమలు పరచటం జరుగుతుంది. ఆంధ్ర ప్రాంతంలో 100 గ్రామాలకు విద్యుచ్ఛక్తిని సరఫరా చేసే నిమిత్తం 1959—60 సంవత్సరానికి రు. 100 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 3.00 లక్షల మొత్తం యీ జిల్లాకు కేటాయించబడింది. 30 గ్రామాలు విద్యుతీకరింపబడతాయి.

# గ్రామీణ పరిశ్రమలు, చిన్నతరహా పరిశ్రమలు

## మృణ్మయ పాత్రల తయారు చేయడానికి సంబంధించిన ఉత్పత్తి-శిక్షణ కేంద్రాలు అనకాపల్లిలోను విజయనగరంలోను స్థాపించడం

ఈ పథకంక్రింద అనకాపల్లి, విజయనగరంలలో రెండు ఉత్పత్తి-శిక్షణ కేంద్రాలు మృణ్మయ పాత్రలు తయారుచేయడానికి, వీటిని తయారుచేయడానికి సంబంధించిన ప్రతి కేంద్రంలోను 10 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వడానికిగాను 1958—59 లో స్థాపించబడినాయి. అభ్యర్థులకు ఒక్కొక్కరికి నెలకు రు. 25/-లు వంతున స్టయిఫండు యివ్వబడుతుంది. శాశ్వతభవనాలు, బట్టీ (కిల్న్) నిర్మాణం పూర్తయింది. 1958—59 లో 8 మంది శిక్షణ పొందారు. 1959—60 లో రు. 0·48 లక్ష యీ కేంద్రాలను కొనసాగించడానికి 20 మందికి యీ కేంద్రాలలో శిక్షణ యివ్వడానికిగాను కేటాయించబడింది. ఈ కేంద్రాలవల్ల రు. 40,000లు రాబడి ఉంటుందని ఊహించబడుతున్నది.

## విశాఖ పట్టణంలో వడ్రంగానికి సంబంధించిన ఉత్పత్తి శిక్షణ కేంద్రం స్థాపన

చిన్నతరహా కొయ్యసామానులను తయారుచేయడానికి, వీటిని తయారుచేయడంలో మేలురకం పరికరాలను ఉపయోగించడంలోను, మంచిరకం కొయ్యసామానును ఆధునిక విధానాలలో తయారుచేయటంగురించి శిక్షణ యిచ్చేటందుకుగాను విశాఖపట్టణంలో హిందుస్థాన్ షౌకానిర్మాణ కేంద్రాని

అనుబంధించబడి ఉత్పత్తి-శిక్షణ కేంద్రం ఒకటి 1956—57లో స్థాపించబడింది ఈ కేంద్రం అద్దెభవనాల్లో పనిచేస్తున్నది. 60మంది పనివారు యిందులో పని-చేస్తున్నారు. ఏటా 6 మిందికి శిక్షణ యివ్వబడుతుంది. వారికి ఒక్కొక్కరికి నెలకు రు. 30/-లు స్టయిఫండు యివ్వడం జరుగుతుంది. ఇంతవరకు మూడు జట్లుగా 18 మంది అభ్యర్థులు శిక్షణ పొందారు. విశాఖపట్టణంలో గత సంవత్సరం యీ కేంద్రంకోసం పారిశ్రామిక ఎస్టేటులో భవనాల నిర్మాణం ప్రారంభించబడింది. ఈ సంవత్సరంలో యీ భవనాలనిర్మాణం పూర్తవు-తుందని ఆశించబడుతున్నది. ఈ భవనాలనిర్మాణం పూర్తిచేయడానికి, యీ కేంద్రంకొనసాగించడానికి, 6 మందికి శిక్షణ యివ్వడానికి, 40 మంది పనివారికి ఉద్యోగంకల్పించడానికిగాను యీసంవత్సరం ప్రణాళికలో రు. 0.90 లక్ష కేటా యించబడింది. 1959—60లో యీ కేంద్రం ఆదాయం రు. 1,00,000 ఉండ గలదని ఆశించబడుతున్నది.

## పెందుర్తిలో పెంకులతయారీకి సంబంధించిన ఉత్పత్తి-శిక్షణ కేంద్రం

పెందుర్తిలో చిన్నతరహా పెంకుల తయారీకేంద్రాన్ని ప్రారంభించడానికి యిందులో తడవకు 6 మంది పనివారికి శిక్షణ యివ్వటానికిగాను తగినసౌకర్యా-లను కలుగజేయడానికి ప్రతిపాదింపబడింది. అభ్యర్థులు ఒక్కొక్కరికి నెలకు రు. 30/-లు స్టయిఫండుగా యివ్వబడుతుంది. ఇందుమూలంగా యీ కేంద్రంలో శిక్షణ పొందినవారిని నియమించుకొని పారిశ్రామికులు క్రొత్తకేంద్రాలను స్థాపించడానికి వీలుచేకూరుతుంది. శాశ్వత భవనాలు, బట్టి నిర్మాణం పూర్తయింది. 1959 మార్చినుండి యీ కేంద్రం ఉత్పత్తిని ఆరంభించింది. ఎట్టయిటుకలు తయారు చేయబడుతున్నాయి. ఈ కేంద్రం పనిచేయుటకు, 6 గురు అభ్యర్థులకు శిక్షణ యివ్వడానికిగాను యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.40 లక్ష కేటాయించబడింది. ఈ కేంద్రంవల్ల యీ సంవత్సరంలో రు. 35,000 ఆదాయం ఉండగలదని ఆశించబడుతున్నది.

## విశాఖ పట్టణంలో టూల్‌రూమ్ సర్వీసింగు కేంద్రం స్థాపన

విశాఖపట్టణంలోఉన్న చిన్నతరహా పారిశ్రామికులకు, అందులోను, ముఖ్యంగాపారిశ్రామిక ఎస్టేటులో ఉపపరిశ్రమలను నెలకొల్పుకొన్నవారికి ఉపయోగపడేటందుకుగాను విశాఖపట్టణంలోని పారిశ్రామిక ఎస్టేటులో

టూల్‌రూమ్ షాప్ నొకదాన్ని ఏర్పాటు చేయటానికి ప్రతిపాదించబడింది. ఈ పథకంకోసం ఈ సంవత్సరం ప్రణాళికలో రు. 3.83 లక్షల మొత్తం కేటాయించబడింది. భవనాలనిర్మాణానికి, యంత్రాలు, పరికరాల కొనుగోలుకు ఈ డబ్బు వినియోగించబడుతుంది.

## విశాఖపట్టణంలో ముడిపదార్థాల సరఫరా కేంద్రం స్థాపన

విశాఖపట్టణంలో ఉన్న చిన్నతరహా పారిశ్రామికులకు, అందులోను ముఖ్యంగా పారిశ్రామిక ఎస్టేటులో తమ పరిశ్రమలను నెలకొల్పుకున్న పారిశ్రామికులకు, ఉపయోగపడటంకోసం విశాఖపట్టణంలోని పారిశ్రామిక ఎస్టేటులో ముడిపదార్థల సరఫరా కేంద్రాన్నొకదాన్ని స్థాపించడానికి ప్రతిపాదించబడింది. అసలుఖరీదుకు యీ కేంద్రం చిన్నతరహా పారిశ్రామికులకు ముడిపదార్థాలను సరఫరా చేస్తుంది. భవనాలనిర్మాణానికి, వ్యానులు కొనుగోలుకు, కేంద్రం నిర్వహణకుగాను యీ సంవత్సరం ప్రణాళికలో రు. 2.19 లక్షల మొత్తం కేటాయించబడింది.

## పరిశ్రమలకు రాజ్యప్రభుత్వ సహాయం చట్టంక్రింద ఋణాలు

ఈ పథకంక్రింద పరిశ్రమలకు రాజ్య ప్రభుత్వ సహాయం చట్టంక్రింద ఋణాలుగా రు. 13.11 లక్షల మొత్తం ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాలకాలంలో యివ్వబడింది. ఈ సంవత్సరంలో యింకా రు. 7 లక్షల మొత్తం పారిశ్రామికులకు ఋణాలుగా ఇవ్వబడుతుంది ఈ జిల్లాలోని పారిశ్రామికులు కూడ ఈ పథకంవల్ల ప్రయోజనం పొందుతారు.

## పరిశ్రమలశాఖ డైరెక్టరేటును, జిల్లాలలోని సిబ్బందిని పటిష్ఠం చేయటం

రెండవ ప్రణాళికాకాలంలో ఎక్కువయిపోయిన పనిని నిర్వహించేటందుకుగాను రెండవ ప్రణాళికలో కేటాయించబడిన రు. 7.95 లక్షల వ్యయంతో రాజ్యస్థాయిలోను, జిల్లాస్థాయిలోను పరిశ్రమలశాఖను పటిష్టం చేయటానికి ప్రతిపాదించబడింది. మొదటి 3 సంవత్సరాలకాలంలోను అదనపు సిబ్బంది (సాంకేతిక మరియు మినిస్టీరియల్) రు. 3.45 లక్షల

వ్యయంతో నియమించబడింది. ఇంతకుముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించటానికి, ఇంకా కొంత అదనపు సిబ్బందిని నియమించటానికిగాను ఆంధ్ర ప్రణాళికలో రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది.

## బ్లాకు ప్రాంతాలలో నియమించబడిన పరిశ్రమల విస్తరణాధికార్ల జీతాలు

బ్లాకుప్రాంతాలలో నియమించబడిన పరిశ్రమల విస్తరణాధికార్ల జీతాల క్రింద రెండవ ప్రణాళికలో 10.17 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందుకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది.

## పరిశ్రమల, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టర్లకు జీపులసరఫరా

ప్రతిపాదింపబడిన పథకాలు త్వరితంగాను సమగ్రవంతంగాను అమలు పరచబడాలంటే అందుకు సంబంధించిన పరిశ్రమల శాఖాధికార్లు తరచు పర్యవేక్షణ జరుపుతూ సాంకేతిక సహాయం అందచేస్తుండాలి. ఈ అధికార్లు త్వరత్వరగా పర్యటనలను జరిపేటందుకు వీలుగా వీరికి జీపులను సరఫరా చేయటం అవసరం. 1958—59 అంతంనాటికి ఆంధ్రలోని పరిశ్రమల వాణిజ్యశాఖ డైరెక్టర్లకందరికీ జీపులు యివ్వబడినాయి. ఈ జీపుల నిర్వహణకోసం ఈ సంవత్సరానికి రు. 0.30 లక్ష కేటాయించబడింది. ఇందులో ఒక జీపు యీ జిల్లాలో ఉంది.

## పారిశ్రామిక ఎస్టేట్లు

## విశాఖ పట్టణంలో పారిశ్రామిక ఎస్టేటు

ఈ ఎస్టేటు కోసం 50 ఎకరాల భూమిని స్వాధీనం చేసికొని 33 ఫ్యాక్టరీ భవనాలను నిర్మించడానికి ప్రతిపాదింప బడింది. ఇందులో 20 ఫ్యాక్టరీ భవనాలు అన్ని సౌకర్యాలతోను యింతవరకు నిర్మించ బడినాయి. మిగత భవనాలు యీ సంవత్సరం నిర్మించ బడతాయి. ఈ ఎస్టేటు కోసం రెండవ ప్రణాళికలో కేటాయించ బడిన రు. 32.03 లక్షలలో రు. 16.03 లక్షల మొత్తం మొదటి మూడు సంవత్సరాల్లో ఖర్చుపెట్ట బడింది. అన్ని విషయాల్లోను యీ ఎస్టేటును పరి పూర్ణంగా తీర్చిదిద్దడం కోసం మిగత రు. 16.00 లక్షలు యీ సంవత్సరం ప్రణాళికలో కేటాయించ బడినాయి.

## హస్తకళలు.

### వెదురు, పేము బుట్టల అల్లకానికి సంబంధించిన ఉత్పత్తి శిక్షణ కేంద్రాలు (మూడుకేంద్రాలు)

వెదురు వస్తువులను, బుట్టలను మేలురకం పద్ధతులలో తయారుచేయటంలో ప్రతి కేంద్రంలోను 10 మంది అభ్యర్థులకు శిక్షణ యిచ్చుటకుగాను నెల్లూరు లోను కడప జిల్లాలోని కోడూరులోను, విశాఖపట్టణం జిల్లాలోని తుమ్మపాలలోను 1957—58 లో 3 కేంద్రాలు స్థాపించ బడినాయి. 1957—59 లలో 57 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వబడింది. ఈ కేంద్రాలు సహకార సంఘాలుగా మార్చబడినాయి. ఈ సంవత్సరం శిక్షణ కార్యక్రమం నిలిపివేయబడింది. వాటా మూలధనం, నిర్వహణ మూలధనం క్రింద యీ సంఘాలకు ఆర్థిక సహాయం చేయుటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.18 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.06లక్ష యీ జిల్లాలోని కేంద్రంకోసం వినియోగించ బడుతుంది.

### విశాఖ పట్టణం జిల్లాలోని ఏటికొప్పాకలో కొయ్య బొమ్మల తయారికి సంబంధించిన ఉత్పత్తి-శిక్షణ కేంద్రం

కొయ్యబొమ్మల పరిశ్రమ అభివృద్ధికోసం ఏటికొప్పాకలో ఒకఉత్పత్తి-శిక్షణ కేంద్ర 1957—58 లో ప్రారంభించ బడింది. మేలురకం పద్ధతుల్లో కొయ్య బొమ్మలను తయారు చేయడం గురించి యీ కేంద్రంలో 24 మంది అభ్యర్థులకు 1958—59 లో శిక్షణ యివ్వబడింది. ఇందుకు రు. 0.25 లక్షఖర్చు పెట్ట బడింది. సహకార పద్ధతుల్లో యీకేంద్రం కొనసాగించ బడుతుంది. రు. 0.19 లక్ష వ్యయంతో యింకా 12 మంది అభ్యర్థులకు యీ సంవత్సరం శిక్షణ యివ్వ బడుతుంది.

### అరకులో వెదురు, బుట్టల తయారి పరిశ్రమ అభివృద్ధి

ఏటా 12 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వడం కోసం వెదురు, బుట్టల తయారి కేంద్ర మొకటి అరకులో స్థాపించ బడింది. 1958—59 లో 10 మంది

అభ్యర్థులు శిక్షణ పొందారు. ఈ కేంద్రం సహకార సంఘంగా మార్చబడింది. ఈ సంవత్సరం శిక్షణ కార్యక్రమం తలపెట్ట బడలేదు. వాటా మూలధనం, నిర్వహణ మూలధనం క్రింద యీ సంఘానికి ఆర్థిక సహాయం చేయటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు యీసంవత్సరం ప్రణాళికలో రు. 0.07 లక్ష కేటాయించ బడింది.

## విశాఖ పట్టణంలో దంతం, కొమ్ము వస్తువుల తయారీకి సంబంధించిన ఉత్పత్తి–శిక్షణ కేంద్రం

కళానైపుణ్యంఉండే కొమ్ము, దంతం వస్తువులను తయారు చేయడానికి, వీటిని తయారు చేయడంలో ఏటా 6 మందికి శిక్షణ యివ్వడానికిగాను 1958—59 లో ఉత్పత్తి శిక్షణ కేంద్రమొకటి విశాఖపట్టణంలో స్థాపించ బడింది. 1958—59 లో 6 మంది శిక్షణ పొందారు. రు. 0.06 లక్ష వ్యయంతో యీ కేంద్రం యీ సంవత్సరం కొనసాగించ బడుతుంది. 6 మంది అభ్యర్థులు క్షణ పొందుతారు.

## విశాఖ పట్టణంలో రెండవ తరగతి సేకరణ–అమ్మకం డిపో స్థాపించడం

ఈ పథకంక్రింద విశాఖపట్టణంలో ఒక అమ్మకం డిపో కుటీర, గ్రామీణ పరిశ్రమలలో తయారయిన వస్తువులను అమ్మకం చేయటం కోసం 1958—59 లో స్థాపించ బడింది. ఈ సంవత్సరం యిది కొనసాగించ బడుతుంది. ఇందుకు రు. 0.37 లక్ష కేటాయించ బడింది.

## క్రొత్త పథకాలు.

హస్తకళలకు సంబంధించిన క్రింది పథకాలు యీ సంవత్సరంలో అమలు పరచ బడతాయి. ఆంధ్ర ప్రాంతంలోని అన్ని జిల్లాలకు కూడ యీ పథకాల క్రింద లాభం చేకూరుతుంది.

| పథకం పేరు | 1959—60 లో కేటాయింపు (రూపాయలు, లక్షలలో.) |
|---|---|
| 1. హస్తకళలతో ఉపయోగించటానికిగాను దేవాలయాలలోని డిజైనులను కాపీచేయటం. .... | 0.05 |
| 2. అక్కడక్కడా ఉండి ఒక సహకార సంఘం క్రిందకు తీసుకురావటానికి వీలుగా ఉండనట్టి పనివారలకు ఋణాలు గ్రాంట్లు మంజూరు చేయటం .... | 0.05 |

## అరకులో వెదురుపనివారికి ఉమ్మడి సౌకర్యాలకేంద్రం స్థాపన

అరకలో వెదురు పరిశ్రమను కొనసాగిస్తున్న పనివారలందరికీ ఉమ్మడిగా ఉత్పత్తిసౌకర్యాలు ఉండే కేంద్రం స్థాపించడంకోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.05 లక్ష కేటాయించబడింది. ఈ వెదురుపరిశ్రమలో పని చేస్తున్నవారందరూ ఒకే స్థలంలో తమ పరిశ్రమను కొనసాగించుకొనేటట్లు ఏర్పాటుచేయబడుతుంది. ఇక్కడ వీరికి కావలసిన సౌకర్యాలు సమకూర్చబడతాయి.

## పట్టు పరిశ్రమ

## *చింతలపల్లిలో విదేశీరకాల పట్టుపురుగులను పోషించేటందుకు మూలవిత్తనాల క్షేత్రం స్థాపన

5 ఎకరాల ప్రదేశంలో మల్బరీతోటలను వేయడానికి, మూల విత్తనాల కోసం విదేశీరకం పట్టుకాయలను ఉత్పత్తిచేయడానికి యీ పథకం ఉద్దేశించబడింది. ఇందువల్ల మల్బరీతోటలను ఎలా పెంచాలి, పట్టుపురుగులను ఎలా పోషించాలి అన్న విషయాలనుగురించి ప్రదర్శనపూర్వకంగా వివరించడానికి వీలు చేకూరుతుంది. గిరిజనులకు జీవనోపాధికూడ కలుగచేయడమవుతుంది.

---

*ఈ సంవత్సరం ప్రణాళికలో ఈ పథకంకోసం కేటాయింపేమి చేయబడలేదు. ఈ పథకానికి కావలసినడబ్బు ప్రణాళికా కార్యక్రమాన్ని పునః సవరించడంద్వారా సమకూర్చబడుతుంది.

"యూనివోల్టయిన్" జాతుల పట్టుపురుగులను పెంచడానికి, యీ కేంద్రంలో పట్టుపురుగు రకాలను పోషించడానికి, పలమనేరువంటి యితర కేంద్రాలలో పట్టుపురుగుల ఉత్పత్తిని అధికంచేయడానికి కావలసిన పట్టుపురుగులను ఉత్పత్తి చేయడంకోసం మూలవిత్తనపు పట్టుకాయలను ఉత్పత్తిచేయడానికి యీ క్షేత్రం ఉపయోగపడుతుంది. 1958—59లో యీ పథకం అమలు పరచ బడింది. 70,080 విదేశీ పట్టుకాయలు ఉత్పత్తి చేయబడినాయి. వ్యాధి రహితమైన 1,965 విదేశీ పట్టుగుడ్లనుండి పట్టుపురుగులు పెంచబడినాయి. 24 పౌనుల పట్టునూలు 7 పౌన్ల పట్టు యీ క్షేత్రంలో ఉత్పత్తి చేయబడినాయి. ఇంతేకాక 300 మల్బరీ అంట్లుకూడ ఉత్పత్తి చేయబడినాయి. "రీలింగు హౌస్". "రీలింగుషెడ్డు" నిర్మాణం పి. డబ్ల్యు. డి. వారిచే ప్రారంభించ బడింది. 1959—60 లో వీటి నిర్మాణం పూర్తవుతుందని ఆశించబడుతున్నది. 1958—59 లో రు. 0.48 లక్ష యీ పథకంకోసం ఖర్చు పెట్టబడింది. ఈ సంవత్సరం యీ పథకం కొనసాగించడంకోసం రు. 0.15 లక్ష ఖర్చుపెట్టడానికి ప్రతిపాదింపబడింది.

## *అరకులోయలో పట్టు ప్రదర్శన క్షేత్రం స్థాపన

పట్టుపరిశ్రమ అభివృద్ధి చేయడంకోసం అరకులోయలో చాల అవకాశా లున్నాయి. ఇందువల్ల ఇక్కడ ఒక పట్టుప్రదర్శనక్షేత్రాన్ని ఏర్పాటుచేయ డానికి ప్రతిపాదింపబడింది. క్రమపద్ధతుల్లో మల్బరీచెట్లను పెంచేవిధానాలను ప్రదర్శించడానికి ఈ క్షేత్రం ఉద్దేశించబడింది. మేలురకం యంత్రాలతో "రీలింగు" పద్ధతులనుకూడ ఈ క్షేత్రంలో ప్రదర్శనపూర్వకంగా వివరించడానికి తలపెట్టబడింది. 1958—59 లో పబ్లిక్ వర్క్సు శాఖచే "రీలింగుహౌస్" రీలింగుషెడ్డు" నిర్మాణం ప్రారంభబడింది. 1959—60లో ఈ భవనాల నిర్మాణం పూర్తవుతుందని ఆశించబడుతున్నది. "రీలింగు" యంత్రం ఖరీదు చేయబడింది. 26 ఎకరాలభూమి మల్బరీతోటలక్రిందకి తీసుకురాబడింది 1958—59 లో యీ పథకంక్రింద రు. 0.48 లక్ష ఖర్చుపెట్టబడింది. ఈ పథకం కొనసాగించడంకోసం రు. 0.16 లక్ష యీ సంవత్సరం ఖర్చుపెట్టబడుతుంది.

---

*ఈ పథకంకోసం ఈసంవత్సరం ప్రణాళికలో కేటాయింపేమీ చేయ బడలేదు. ఈ పథకానికి కావలసిన డబ్బు ప్రణాళికా కార్యక్రమాన్ని పునః సవరించడంద్వారా సమకూర్చబడుతుంది.

## క్రొత్త పథకాలు

### పట్టుపరిశ్రమ ప్రాంతాల్లో ప్రచారం

పట్టుపరిశ్రమపట్ల ప్రజలు శ్రద్ధాసక్తులు చూపేట్టు చేయటానికిగాను పట్టుపరిశ్రమ ప్రాంతాల్లో ప్రచారం చేయటం కోసం యీ పథకాన్ని అమలు పరచేటందుకు ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.01 లక్ష కేటాయించబడింది.

కాని ఈ పథకాలకు తుదిరూపం యింకా యివ్వబడనందువల్ల యీ సంవత్సరం ప్రణాళికలో వీటికి కేటాయింపేమీ చేయబడలేదు. అయినా యీటికి కావలసిన నిధులు ప్రణాళికా కార్యక్రమంలో సర్దుబాటు చేయటం ద్వారా సమకూర్చబడుతుంది.

ఈ జిల్లాలో అమలుపరచడంకోసం క్రింది క్రొత్తపథకాలుకూడ ఈ సంవత్సరపు ప్రణాళికలో చేర్చబడినాయి.

| | | కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | మూల విత్తనాలకోసం విదేశీ పట్టు కాయను పెంచేటందుకు చింతపల్లిలోని ప్రభుత్వ పట్టుక్షేత్రంలో నీటి పారుదల సౌకర్యాలు కలిగించడం, "ఇన్‌క్యుబేటరు"ను సమకూర్చడం .... | 0.19 |
| 2 | అరకులోయలో ఉన్న ప్రభుత్వ పట్టుక్షేత్రానికి నీటిపారుదల సౌకర్యాలు కలిగించడం .... | 0.14 |

## గ్రామీణ పరిశ్రమలు

### బెల్లం, ఖండసారి పరిశ్రమలు.

ఈ పథకం క్రింద రైతులకు మేలు రకంపనిముట్లను కొనుక్కోవటానికి గాను వడ్డీ లేకుండా ఋణాలు యివ్వబడతాయి. ఈ ఋణాలు 5 సంవత్సరాల

కాలంలో వసూలు చేయబడతాయి. ఇంతేకాక మేలురకం బెల్లం, ఖండసా లను తయారు చేయటం గురించి ప్రదర్శన పూర్వకంగా వివరించ బడుతుంది. అనకాపల్లి, చోడవరం, రామచంద్రపురం, చిత్తూరు, హిందూపురం తాలూకా లలో యీ పథకం మొదటి పంచవర్ష ప్రణాళికాకాలంలో (1955) అమలు పరచబడింది. ఇందుకుగాను ప్రత్యేక ఫీల్డు సిబ్బంది నియమించబడింది. మేలు రకం బెల్లం, ఖండసారి తయారు చేయటంలో పేరు శిక్షణ పొందారు. 1956-57, 1957—58 లలో యీపథకం కొనసాగించ బడింది. అయితే 1958—59 లో యిది అమలు పరచ బడలేదు. ఈ సంవత్సరంలో ఈ పథకాన్ని శ్రీకాకుళం జిల్లాలోని పాలకొండ తాలూకాకు, పశ్చిమగోదావరి జిల్లా తణుకుతాలూకాకు, కృష్ణా జిల్లా దివి తాలూకాకు, గుంటూరు జిల్లా రేపల్లె తాలూకాకు, చిత్తూరు జిల్లా చంద్రగిరి తాలూకాకు విస్తరింప చేయడానికి, ఇంతేకాక ప్రస్తుతను యీ పథకం అమలులో ఉన్న ప్రాంతాలలో దీనిని కొనసాగించడానికి ప్రతిపాదింప బడింది. ఈ పథకం క్రింది కార్యకమాలను క్రొత్త ప్రాంతాలకు విస్తరింప చేయటంద్వారా యిప్పుడున్న 30,000 ఎకరాలేకాక అదనంగా 32,650 ఎకరాలమేర భూమి యీ పథకం క్రిందకు తీసుకురాబడుతుంది. ప్రస్తుతం యీ పథకం పరిశ్రమలశాఖవారి నియంత్రణలో అమలుపరబడు తున్నది. ఇపుడు దీన్ని ఆంధ్రప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమల బోర్డుక్రిందకు మార్చడానికి ప్రతిపాదింపబడింది. ఈ బోర్డు 1958 నవంబరులో ఏర్పాటు చేయబడింది. ఈ సంవత్సరంలో యీ పథకం కోసం రు. 6.00 లక్షలు కేటాయించ బడినాయి.

## కుటీర పరిశ్రమలకు ఋణాలు, సబ్సిడీల నివ్వటానికి సంబంధించిన 1948 సంవత్సరపు నిబంధనల క్రింద ఋణాలు.

వడ్రంగం, నేతపని, కమ్మరం మొదలయిన వివిధ కుటీర, గ్రామీణ పరిశ్రమలలో పనిచేస్తున్న పనివారికి సహాయం చేసే ఉద్దేశంతో రెండవ ప్రణాళిక యొక్క మొదటి రెండు సంవత్సరాలకాలంలో రు. 1.64 లక్షల మొత్తం ఋణాలుగా పంపకం చేయబడింది. 1958—59 లో యీ పథకం అమలు పరచ బడలేదు. ఈ సంవత్సరంలో రు. 2.00 లక్షల వరకు ఋణాలు మంజూరు చేయడానికి ప్రతిపాదింప బడింది. ఈ జిల్లాలోని పనివారికికూడ యీ పథకం వల్ల లాభం చేకూరుతుంది.

## పారిశ్రామిక సహకార సంఘాలు.

గ్రామీణ పరిశ్రమలకు సుస్థిరత్వం చేకూర్చడం, వాటి ఉత్పత్తి విధానాల్ని మెరగు పరచడం ద్వారా అవి అధికోత్పత్తిని సాధించేటట్లు చేయడమే యీ పథకం యొక్క ఉద్దేశం. ఇందుకుగాను సహకార సంఘాల ద్వారా దంపుడు బియ్యం పరిశ్రమను అభివృద్ధి పరచేటందుకు 10 కేంద్రాలను ప్రారంభించటం, కలంకారి అద్దకం పరిశ్రమకు నిర్వహణ మూలధనం, యితర ఖర్చుల క్రింద గ్రాంట్లు యివ్వటం, మేలురకం పరికరాలు కొనుక్కోవటానికి గాను గుంటూరు కమ్మరం సహకార సంఘం వారికి ఆర్థిక సహాయం చేయటం, పరికరాలు మొదలయినవి కొనుక్కోవటానికిగాను కుటీర పరిశ్రమల సహకార సంఘములకు సబ్సిడీలు యివ్వటంవంటి పథకాలు రూపొందించ బడినాయి. ఇందుకుగాను యీ పథకంక్రింద ఇంతవరకు రు. 2.72 లక్షల మొత్తం ఖర్చుపెట్ట బడింది. ఈ పథకం కొనసాగింపుకోసం ఈ సంవత్సరానికి రు. 1.58 లక్షల మొత్తం కేటాయించబడింది. క్రొత్తగా ఏర్పాటు చేయబడిన ఆంధ్ర ప్రదేశ్ ఖాదీ, గ్రామీణ పరిశ్రమలబోర్డు అధ్వర్యంక్రిందకు యీ పథకాన్ని మార్చటానికి కూడ ప్రతిపాదింపబడింది.

# చేనేతపరిశ్రమ

### సహకారసంఘాలకువాటామూలధనం, నిర్వహణమూలధనంక్రింద ఋణాలు

చేనేత సహకార సంఘాలలో వాటాలు తీసికొని అందులో సభ్యులుగా అయ్యేటందుకు వీలు కల్పించే నిమిత్తం చేనేత పనివారికి ఋణాలను యివ్వటానికి యీ పథకంక్రింద ఉద్దేశించబడింది. ఈ సంవత్సరపు ఆంధ్ర ప్రణాళికలో యీ పథకమునకుగాను రు. 2.25 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.15 లక్ష వాటా మూలధనం క్రిందఋణాలు యివ్వటంకోసం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 300 క్రొత్త మగ్గాలు సహకార సంఘాల క్రిందకు తీసుకు రాబడతాయని, 30 లక్షల గజాల గుడ్డ ఉత్పత్తి చేయబడుతుందని ఆశించబడుతున్నది.

## ఆంధ్ర చేనేత సహకార సంఘాలయొక్క మార్కెటింగు వ్యవస్థ విస్తరణ

ఇంకా ఎక్కువగా విక్రయశాలలను ప్రారంభించటంద్వారాను, చేనేత గుడ్డలను గురించి తీవ్ర ప్రచారము చేయటంద్వారాను ఆంధ్ర చేనేత సహకార సంఘంవారి మార్కెటింగు వ్యవస్థను పటిష్ఠం చేయటానికి యీ పథకం క్రింద ఉద్దేశించబడింది. ఈ పథకమునకుగాను ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.31 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు 0.30 లక్ష యీ జిల్లాలో అదనంగా 2 విక్రయశాలలు, ఒక కేంద్ర డిపోను ప్రారంభించటానికిగాను వినియోగించబడుతుంది. ఈ సంవత్సరంలో విక్రయశాలలద్వారా 10 లక్షలగజాల గుడ్డ అమ్మబడుతుందని ఆశించబడుతున్నది.

## ఉత్పత్తి విధానాల అభివృద్ధి, వ్యవస్థ వ్యయాలు

మంచిరకం చేనేత గుడ్డలను ప్రజారంజకంగా ఉండే నమూనాలలో ఉత్పత్తి చేయుటకుగాను చేనేత పరిశ్రమయొక్క సాంకేతిక నైపుణ్యాన్ని అభివృద్ధి పరచటానికి ప్రతిపాదించబడింది. ప్రణాళికయొక్క మొదటి మూడు సంవత్సరాలకాలంలో ఈ పథకం అమలుపరచబడింది. స్టాండర్డు రీడ్లు, వార్పింగు యంత్రాలు మొదలయిన మేలురకం పరికరాలు చేనేత పనివారికి సరఫరా చేయబడినాయి. యీ సంవత్సరంలో ఆంధ్రకుగాను ప్రణాళికలో రు. 4.80 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.41 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది. చేనేత పనివారికి 60 స్టాండర్డు రీడ్లను, 6 వార్పింగు యంత్రాలను, 50 స్లేలను, ఒక ప్రెస్ మిషనును సరఫరా చేయటానికి, గుడ్డల నాణ్యతను సరిచూడడానికి నియమించబడిన ఇద్దరు టెక్నికల్ అసిస్టెంట్లను కొనసాగించటానికి యీ డబ్బు వినియోగించబడుతుంది.

## ముదరా

చేనేత గుడ్డ అమ్మకాన్ని ప్రోత్సహించేటందుకు. తద్వారా చేనేతగుడ్డ ఉత్పత్తిని ఎక్కువచేసేటందుకుగాను ఆంధ్ర చేనేత సహకార సంఘంయొక్క విక్రయశాలల ద్వారాను, ప్రాథమిక చేనేత సహకార సంఘాలద్వారాను జరిగే చేనేత గుడ్డ అమ్మకంపై ముదరా ఇవ్వబడుతున్నది, సామాన్యంగా ఈ ముదరా యీపాయకు 6 నయాపైసలు చొప్పున యివ్వబడుతుంది. సరుకు మిగిలిపోయి ఉన్న సందర్భాలలో సంఘాలు తమదగ్గర నిలువ ఉండిపోయిన

సరకును అమ్మేటందుకుగాను అప్పుడప్పుడు ప్రత్యేక ముదరాకూడ యివ్వ బడుతుంది. ఈ పథకంకోసం యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 35.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.00 లక్ష మొత్తం ఈ జిల్లాలో ముదరా ఇచ్చుటకుగాను వినియోగించబడుతుంది.

# రోడ్లు

## ప్రభుత్వ రోడ్లు (బకాయి పనులు)

ఆంధ్ర ప్రాంతంలో బకాయి రోడ్డు పనులను కొనసాగించుటకుగాను 1959—60 సంవత్సరానికి రు. 2.93 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.27 లక్షల మొత్తం ఈ జిల్లాకు క్రింది పనుల నిమిత్తం కేటాయించబడింది.

| వరుస సంఖ్య | పని వివరం | 1959—60లో కేటాయించ బడిన మొత్తం(రూపాయలు, లక్షలలో) |
|---|---|---|
| 1. | విజయనగరం—పాలకొండ రోడ్డులో నెల్లిమర్లకు దగ్గరగా మై. 5/7—8 వద్ద వంతెన నిర్మాణం .... | 1.270 |

## ప్రభుత్వ రోడ్లు (క్రొత్త పనులు)

ఆంధ్ర ప్రాంతానికి 1959—60 సంవత్సరానికి యీ పథకంకోసం రు. 41.69 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 2.661 లక్షల మొత్తం ఈ జిల్లాకు క్రింది పనుల నిమిత్తం ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పని వివరం | 1959—60లో కేటాయించ బడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | నరసిపట్నం—కృష్ణదేవిపేట రోడ్డు మై. 2/4 వద్ద వంతెన నిర్మాణం .... | 0.250 |

2. అనకాపల్లి—మాడుగులరోడ్డు మై. 9/1 వద్ద వంతెన పునర్నిర్మాణం .... 2.0(0

3. అనకాపల్లి—పుడిమడకరోడ్డు మై. % - 4 0 వద్ద సిమెంటు కాంక్రీటు వేయడం .. 0.001

4. అనకాపల్లి—మాడుగులరోడ్డు మై. 13/5 వద్ద వంతెన వెడల్పు చేయడం .... 0 2(0

5. అనకాపల్లి-మాడుగులరోడ్డు మై 0/0 నుండి 0/6 వరకు మునిసిపల్ హద్దులలో కాంక్రీటు వేయడం .... 0 200

## ప్రభుత్వం స్వాధీనంచేసుకున్న రోడ్లు.

ఇంతకు ముందు ప్రభుత్వంవారు స్వాధీన పరచుకొన్న జిల్లా రోడ్ల రోడ్ల స్థాయిని పెంచేటందుకు 1959—60 ప్రణాళికలో రు. 20.00 లక్షల మొత్తం కేటాయించబడింది. అందులో రు. 2.35 లక్షల మొత్తం ఈ జిల్లాలోని యీ క్రింది రోడ్లస్థాయిని పెంచడంకోసం కేటాయించబడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1959—60 లో కేటాయింపు (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | కొత్తవలస - దేవరపల్లిరోడ్డుమీద వంతెనల నిర్మాణం .... | 0.25 |
| 2. | నక్కనపురం - ఆనందపురం మీద బండ్ల బాటను వెడల్పుచేయడం, వంతెనలను, కల్వర్టులను బలపరచడం .... | 0.20 |
| 3. | గాజువాక - పంచదర్ల - ఎలమంచిలి రోడ్డు మీద వంతెనల నిర్మాణం .... | 1.00 |
| 4. | వెంకన్నపాలెం-ఆనందపురం రోడ్డుమీద వంతెనల నిర్మాణం .... | 0.40 |

5. గాజువాక - పంచదర్ల రోడ్డుమీద బండ్ల బాటను వెడల్పు చేయడం, వంతెనలను, కల్వర్టులను పటిష్ఠం చేయడం .... 0.50

## రోడ్ల ప్రక్కనచెట్లు.

రోడ్ల కిరువైపులా చెట్లను నాటటం కోసం యీ సంవత్సరపు ప్రణాళిక క్రింద యీ జిల్లాకు రు. 0.04 లక్ష మొత్తం కేటాయించ బడింది.

## ఇతర రోడ్లు (బకాయి పనులు)

ఈ పథకం క్రింద 1959-60 ప్రణాళికలో రు. 15.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. మొదటి ప్రణాళికా కాలంలో ప్రారంభించ బడి ముగింప బడకుండా ఉన్నటువంటి పి. డబ్ల్యు. ఆర్. డి. రోడ్డు పనులను పూర్తి చేసే నిమిత్తం ఆంధ్ర ప్రాంతంలోని జిల్లా బోర్డులకు పూర్తి గ్రాంట్లు యివ్వటం కోసం పై డబ్బు వినియోగించ బడుతుంది. ఇందులో రు. 0.10 లక్ష మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## ఇతర రోడ్లు (క్రొత్తపనులు.)

పి. డబ్ల్యు. ఆర్. డి. రోడ్డు పనులను చేకొనే నిమిత్తం యీ పథకం క్రింద ఆంధ్ర ప్రాంతంలోని జిల్లాబోర్డులకు సగం గ్రాంట్లు యివ్వబడతాయి. జిల్లా బోర్డులు, యీ రోడ్లవల్ల ప్రయోజనం పొందేవారు మిగతసగం ఖర్చును భరించాలి. క్రొత్త పనుల నిర్వహణ నిమిత్తం ఆంధ్రలోని జిల్లా బోర్డులకు గ్రాంట్లు యివ్వటం కోసం 1959-60 లో రు. 6.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.15 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## గ్రామ ప్రణాళికలలో రోడ్లు.

ఈ పథకం క్రింద కల్వర్టులు, వంతెనలు, గ్రామాలకు క్రొత్త రోడ్లు. గ్రామాలకు గ్రామాలకు మధ్య రోడ్లు నిర్మించటం జరుగుతుంది. జిల్లా కలెక్టర్లు యీ పథకం క్రింద చేయవలసిన పనులను నిర్ణయించి నిర్వహిస్తారు. ఖర్చులో సగం ప్రభుత్వంవారు భరిస్తారు. మిగత సగం ఖర్చుయీ రోడ్లవల్ల ప్రయోజనం

పొందే ప్రజలు భరించాలి. ఆంధ్రలో యీ పథకం క్రింద 1959—60 లో రు. 15.00 లక్షల మొత్తం ఖర్చు పెట్టటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 1.215 లక్షల మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## పర్యటనాత్వాభివృద్ధి

ఆంధ్ర ప్రాంతంలో పర్యటనత్వాభివృద్ధికి 1959—60 ప్రణాళికలో రూ 1.09 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ కార్యక్రమంక్రింధ ప్రధానంగా వసతి సౌకర్యాలను కలుగచేయడం, వినోద సౌకర్యాలను ఏర్పాటుచేయడం జరుగుతుంది. పై మొత్తంలో రూ. 0.10 లక్ష మొత్తం ఈ జిల్లాకు క్రింది పనుల నిమిత్తం ప్రత్యేకించబడింది.

| వరుస సంఖ్య | పనివివరము | 1959—60లో కేటాయింపు (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| 1. | సింహాచలంలో "రెస్టుహౌసు" నిర్మాణం .... | 0.02 |
| 2. | ఇతర పథకాలు (ట్రావెలర్స్ బంగళాలను సమకూర్చటం) .... | 0.08 |

# విద్య

## ప్రాథమిక విద్య

ఈ జిల్లాలో ప్రాథమిక విద్యాభివృద్ధికోసం రు. 8.648 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రింది విధంగా వినియోగించబడుతుంది.

| వరుససంఖ్య | పథకం పేరు | కేటాయింపు మొత్తం (రు. లక్షలలో) |
|---|---|---|
| | కొనసాగింపు పథకాలు | |
| 1. | 1957 - 58లో తెరవబడిన ప్రీ-ప్రైమరీ, బేసిక్ పాఠశాలలు, సెక్షన్లు (ఒక సెక్షను) .... | 0.010 |

2. 1956_57లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు సిబ్బంది

(ఎ) ప్రభుత్వంవారివి (సాంఘిక సంక్షేమ శాఖ) 9 పాఠశాలలు 0.090

(బి) స్థానిక సంస్థలవి (6 పాఠశాలలు) ... 0.060

3. 1957—58 లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, అదనంగా నియమించబడిన ఉపాధ్యాయులు.

(ఎ) ప్రభుత్వంవారివి (సాంఘిక సంక్షేమ శాఖ) (4 పాఠశాలలు) 0 040

(బి) స్థానిక సంస్థలవి (26 పాఠశాలలు) 0.270

(సి) ఎయిడెడ్‌వి (3 పాఠశాలలు) 0.030

4. 1958—59 లో ప్రారంభించబడిన ప్రాథమిక పాఠశాలలు, నియమించబడిన అదనపు ఉపాధ్యాయులు

స్థానిక సంస్థలవి (6 పాఠశాలలు) .... 0.040

5. 1957—58 లో ప్రారంభించబడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు.

(ఎ) స్థానిక సంస్థలవి (10 పాఠశాలలు) .... 0.150

(బి) ఎయిడెడ్‌వి (10 పాఠశాలలు) 0.150

6. 1958—59 లో ప్రారంభించబడిన జూనియర్ బేసిక్ పాఠశాలలు

(ఎ) స్థానిక సంస్థలవి (3 పాఠశాలలు)
(బి) ఎయిడెడ్‌వి (3 పాఠశాలలు) } 0.030

| | | |
|---|---|---|
| 7. | 1957—58లో జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు | |
| | (ఎ) ప్రభుత్వంవారివి (36 పాఠశాలలు) (సి) ఎయిడెడ్‌వి (28 పాఠశాలలు) | 0.060 |
| 8. | 1958—59 లో జూనియర్ బేసిక్ పాఠశాలలుగా మార్చబడిన ప్రాథమిక పాఠశాలలు. | |
| | (ఏ) స్థానిక సంస్థలవి. (12 పాఠశాలలు) (బి) ఎయిడెడ్‌వి (4 పాఠశాలలు) | 0.120 |
| 9 | ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలలలోని ఉపాధ్యాయుల జీతాల హెచ్చింపు. ... | 3.640 |
| 10. | 1956—57 లో జిల్లా బోర్డులు స్వాధీనం చేసుకొన్న ఎయిడెడ్ ప్రాథమిక పాఠశాలలు | 1.640 |
| 11. | 1958—59 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలల, అదనపు సెక్షన్లు. | |
| | లోకలు బోర్డువి (ఒక పాఠశాల, 6 సెక్షనులు) | 0.03 |
| 12. | 1957—58 లో ప్రారంభించిన మాధ్యమిక పాఠశాలలు, అదనపు సెక్షన్లు. | |
| | స్థానిక సంస్థలవి (6 సెక్షనులు) .... | 0.06 |
| 13. | 1956—57 లో సెకెండరీగ్రేడ ట్రైనింగు సెక్షన్లుగా మార్చబడిన హైయరు ఎలిమెంటరీ గ్రేడు ట్రైనింగు సెక్షనలు .... | 0.05 |

14. 1958—59 లో కొన్ని ప్రభుత్వ హైస్కూళ్ళ పాఠశాలల్లో నియమించబడిన ప్రాయింగు. హిందీ టీచర్లు (ఒక టీచరు) ....

15. 1957-58 లో ఇనస్పెక్టరేటులలో నియమించబడిన గుమాస్తాలు, టైపిస్టులు (ఇద్దరు) ... 0.01

16. 1958—59 లో నియమింపబడిన సీ యన్. డిప్యూటీ ఇన్స్పెక్టర్లు జవానులతోసహా (7 గురు) ... 0.12

17. III ఫారం వరకు ఉచిత విద్యా పథకాన్ని అమలు పరచటానికి ఇన్స్పెక్టరెట్లలో నియమించబడిన అప్పరు డివిజను గుమాస్తాలు (ఒక గుమాస్తా) .... 0.01

## క్రొత్త పథకాలు

18. విద్యావంతులలో నిరుద్యోగాన్ని నివారించడానికి పథకం .... 1.09

19. ప్రాథమిక పాఠశాలల్లో అదనపు ఉపాధ్యాయుల నియామకం (27గురు ఉపాధ్యాయులు) 0.12

20. ప్రాథమిక పాఠశాలలను జూనియరు బేసిక్ పాఠశాలలుగా మార్చడం

(ఎ) స్థానిక సంస్థలవి (20 పాఠశాలలు) .... 00.6

(బి) ఎయిడెడ్‌వి (6 పాఠశాలలు) .... 0.02

21. 1958—59 లో మాధ్యమిక పాఠశాలలుగా మార్చబడిన హైయ్యరు ఎలిమెంటరీ పాఠశాలలకు గ్రాంటులు (ఎయిడెడ్) (1 పాఠశాల) 0.11

| | | |
|---|---|---|
| 22. | 1958—59 లో ప్రారంభించబడిన మాధ్యమిక పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంట్లు | |
| | (ఎ) ఎయిడెడ్ వి (4 పాఠశాలలు) .... | 0.05 |
| | (బి) స్థానిక సంస్థలవి (14 పాఠశాలలు) .... | 0.37 |
| 23. | మాధ్యమిక పాఠశాలలలో; అదనపు సెక్షనులు ప్రారంభించటం (ఎయిడెడ్) 5 పాఠశాలలు) కాంపెన్ సేటరీ గ్రాంటు .... | 0.05 |
| 24. | బాలికలకుగాను ప్రభుత్వ మాధ్యమిక పాఠశాల ప్రారంభించటం (ఒక పాఠశాల) .... | 0.13 |
| 25. | ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలలలో అదనపు సెక్షనులను ప్రారంభించటం (ఒక సెక్షను).... | 0.02 |
| 26. | ఏజెన్సీ ప్రాంతాలలో మాధ్యమిక పాఠశాలలు తెరవడం లేక హైయరు ఎలిమెంటరీ పాఠశాలలను మాధ్యమిక పాఠశాలలుగా మార్చడం (ప్రభుత్వం వారివి) (ఒక పాఠశాల) .... | 0.09 |
| 27. | ప్రభుత్వ బేసిక్ శిక్షణ పాఠశాలలలో అంబర్ చర్ఖా పథకం (3 పాఠశాలలు.) .... | 0.01 |
| 28. | జిల్లా విద్యాశాఖాధికార్లకు జీపుల సరఫరా (1 జీపు) .... | 0.16 |
| | మొత్తం | 8.648 |

## సెకండరీ విద్య

సెకండరీ విద్యాభివృద్ధికోసం యీ జిల్లాకు రు. 1.654 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ డబ్బు క్రిందివిధంగా వినియోగించబడుతుంది.

| వరుస సంఖ్య. | పథకం పేరు. | కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగింపు పథకాలు** | |
| 1. | 1956—57 లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు, అదనపు సెక్షనులు | |
| | (ఎ) స్థానిక సంస్థలవి (3 సెక్షనులు) .... | 0.020 |
| | (బి) ఎయిడెడ్ వి (ఒక సెక్షను) ... | 0.010 |
| 2 | 1957—58లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలు. అదనపు సెక్షనులు | |
| | (ఎ) స్థానిక సంస్థలవి (1 పాఠశాల. 3 సెక్షన్లు) .... | 0.040 |
| 3. | 1957—58లో హైయర్ సెకండరీ పాఠశాలల స్థాయికి మార్చబడిన ఉన్నత పాఠశాలలు. | |
| | (ఎ) స్థానిక సంస్థలవి (ఒక పాఠశాల) | 0.020 |
| | (బి) ఎయిడెడ్ వి (ఒక పాఠశాల) .... | 0.010 |
| 4. | ఉన్నత పాఠశాలలకు భవనాలకోసం గ్రాంట్లు | |
| | (ఎ) స్థానిక సంస్థలకు .... | 0.050 |
| | (బి) ఎయిడెడ్ వాటికి .... | 0.020 |
| 5. | ఒక ఎయిడెడ్ హైయర్ సెకండరీ పాఠశాలకు భవనం .... | 0.030 |
| 6. | సెకండరీ పాఠశాలల ఉపాధ్యాయుల జీతాలు పెంచటానికి .... | 0.810 |
| 7, | 1958—59లో స్థాయి పెంచబడిన విజయనగరం మహారాజా శిక్షణ కళాశాలకు .. . | 0 160 |

## క్రొత్త పథకాలు

| | | | |
|---|---|---|---|
| 8. | 1958—59లో ప్రారంభించబడిన ఉన్నత పాఠశాలలకు, అదనపు సెక్షనులకు గ్రాంట్లు | | |
| | (ఎ) స్థానిక సంస్థలవి | .... | 0.100 |
| | (బి) ఎయిడెడ్‌వి | ... | 0.030 |
| 9. | ఉన్నత పాఠశాలలను హైయర్ సెకండరీ పాఠశాలలుగా మార్చడం, అదనపు సెక్షన్లను తెరవడం | .... | 0.010 |
| 10. | ఉన్నత పాఠశాలలకు భవనాల క్రింద గ్రాంట్లు | | |
| | (ఎ) స్థానిక సంస్థలవి. | ... | 0.050 |
| | (బి) ఎయిడెడ్స్‌వి | .... | 0.100 |
| 11. | ఉన్నత పాఠశాలలకు కుర్చీలు, బల్లలు మొదలగు కొయ్య పరికరాలకు గాను గ్రాంట్లు | | |
| | (ఎ) స్థానిక సంస్థలకు | .... | 0.100 |
| | (బి) ఎయిడెడ్ వాటికి | .... | 0.050 |
| 12. | XI, XII తరగతుల్లో చదువుకొనే విద్యార్థులకు స్కాలరు షిప్పులు. | .... | 0.004 |
| 13. | పార్టు సర్టిఫికేటు పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులకు | .... | 0.030 |
| 14. | సిటిజన్ షిప్ శిక్షణ కేంద్రాలు. | .... | 0.010 |
| | | మొత్తం | 1 654 |

## యూనివర్సిటీ విద్య

ఆంధ్ర ప్రాంతంలో యూనివర్సిటీ విద్యాభివృద్ధికిగాను ప్రణాళిక యొక్క మొదటి మూడు సంవత్సరాల కాలంలో రు. 34.64 లక్షల మొత్తంక ఖర్చు పెట్టబడింది. ఈ సంవత్సరమునకుగాను ఆంధ్ర ప్రాంతానికి ప్రణాళికలో రు. 24.56 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 4.02 లక్షలమొత్తం క్రింది పథకాలకుగాను ,, జిల్లాకు కేటాయించ బడింది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయిలు లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగుతున్న పథకాలు** | |
| 1. | స్నాతకోత్సవ సభాభవన నిర్మాణం కోసం వాల్తేరులోని ఆంధ్ర విశ్వ విద్యాలయానికి గ్రాంట్లు ... | 2.10 |
| 2. | విజయనగరంలోని మహారాజా ప్రాచ్య విద్యా శిక్షణ కళాశాలకు అభివృద్ధి పనులు. ... | 0.08 |
| | **క్రొత్త పథకాలు** | |
| 2. | మూడేళ్ల డిగ్రీ కోర్సును ప్రభుత్వ సహాయం పొందే మూడు ఎయిడెడ్ కళాశాలల్లో ప్రవేశ పెట్టటం | |
| | ఎయిడెడ్ వి (ఒక పాఠశాల) .... | 0.82 |
| 4. | విశ్వ విద్యాలయాల అభివృద్ధికి గ్రాంట్లు .... | 1.00 |
| 5. | వాల్తేరులోని సెంట్ జోసఫ్ స్త్రీల కళాశాలకు గ్రాంట్లు .... | 0.12 |
| | మొత్తం | 4.02 |

## ఇతర పథకాలు

క్రింద చూపిన విధంగా ఇతర పథకాలకోసం యీ జిల్లాలో రు. 0.90 లక్ష మొత్తం ఖర్చు పెట్టబడుతుంది.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| | **కొనసాగించ బడుతున్న పథకాలు** | |
| 1. | ఎన్. సి. సి., ఎ. సి. సి. ల విస్తృతికి ... | 0.58 |
| 2. | స్కాటింగు, గర్ల్‌గైడింగు అభివృద్ధికి .... | 0.03 |
| | **క్రొత్త పథకాలు** | |
| 3. | పంచాయితీలకు, ప్రయివేటువారికి, సహకార సంఘాలకు, గ్రామ సంఘాలకు, స్థానిక సంస్థలకు చెందిన గ్రంథాలయాలకు గ్రాంట్లు.... | 0.07 |
| 4. | ఎన్. సి. సి. యూనిట్లుకు ఏరోమూడలింగ్ మరియు షిప్‌మూడలింగ్ పరికరాలను సరఫరా చేయటం .... | 0.01 |
| 5. | హిందీ పాఠశాలలకు గ్రాంట్లు (ఒక పాఠశాల) | 0.02 |
| 6. | హిందీ ప్రేమీమండలుల గ్రంథాలయాలకు గ్రాంట్లు | 0.01 |
| 7. | యువజన సంక్షేమ కార్యకలాపాలు .... | 0.01 |
| 8 | ఎన్. సి. సి. ఏ. సి. సి. యూనిట్ల చౌకీ దార్ల జీతాల సవరింపుకు. .... | 0.01 |
| 9 | ఆంధ్ర విశ్వవిద్యాలయంచే సంస్కృత విజ్ఞాన సర్వస్వము తయారీకి. .... | 0.15 |
| 10. | ప్రాచ్యవిద్యలు నేర్పటం కోసం స్కాలరు షిప్పులు .... | 0.02 |
| | మొత్తం | 0.90 |

### విశాఖపట్టణం పాలిటెక్నిక్ విస్తరణ పథకం

ప్రస్తుతం విశాఖపట్టణం పాలిటెక్నిక్ అద్దెభవనాలలో పనిచేస్తున్నది. శాశ్వతభవనాలను నిర్మించటానికి, అదనపు పరికరాలను, సిబ్బందిని సమకూర్చడానికిగాను రెండవప్రణాళికలో రు. 22.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ సంస్థను నెలకొల్పటంకోసం కప్పరాడ (విశాఖపట్టణం జిల్లా)లో 30 ఎకరాల స్థలం స్వాధీనం చేసికోబడింది. భవనాలు, లేబరేటరీలు, హాస్టళ్ళ నిర్మాణం 1958—59 లో ప్రారంభించ బడింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో సమకూర్చబడే పరికరాల ఖరీదుకు, సిబ్బందిజీతాలకు, భవనాల నిర్మాణానికిగాను రు. 5.27 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇంతేకాక అదనపు పరికరాలను భవనాలను సమకూర్చటంద్వారా యిపాలిటెక్నిక్ విస్తరణకోసం కేంద్రప్రతిపాదిత పథకాలక్రింద యింకా రు. 3.29 లక్షల మొత్తం—కేంద్రప్రభుత్వంచే రు. 2.69 లక్షలు, రాజ్యప్రభుత్వంచే రు. 0, 60 లక్ష—కేటాయించబడింది.

### విశాఖపట్టణంలోని హిందుస్థాన్ షిప్ యార్డ్ (ప్రైవేటు) లిమిటెడ్ లో సాండ్ విచ్ కోర్సులు

ఈ సంవత్సరంలో అమలుపరచడానికి ఉద్దేశించ బడినట్టిది యీ క్రొత్త పథకం 30 మంది విద్యార్థులు చేర్చుకోబడుతారు. వీరికి విద్యాబోధనతోపాటు పరిశ్రమలో ప్రత్యక్ష శిక్షణ ఇవ్వడానికి ఈ పథకం క్రింద ఉద్దేశించ బడింది ఈ సంవత్సరం ప్రణాళికలో భవనాలనిర్మాణానికి, పరికరాల కొనుగోలుకుగాను రు. 0.61 లక్ష రాజ్యప్రభుత్వ వాటాఖర్చుక్రింద కేటాయించ బడింది. ఇంతేకాక కేంద్ర ప్రభుత్వం రు. 0.80 లక్ష సమకూర్చుస్తుంది.

## వైద్యం

### విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్య కళాశాలకు, కింగు జార్జి ఆసుపత్రికి అభివృద్ధి పనులు

రెండవ ప్రణాళిక యొక్క మొదటిమూడు సంవత్సరాల కాలంలో విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్య కళాశాలకు, కింగుజార్జి ఆసుపత్రికి వివిధ అభివృద్ధి పనులను చేయుటకుగాను రు. 10.80 లక్షల మొత్తం ఖర్చుపెట్టబడింది.

ఈ కళాశాలలో పటా యింకా 15 మంది విద్యార్థులను అదనంగా చేర్చుకోవడానికి వీలుకల్పించ బడింది. ఆసుపత్రిలో యింకా 123 పడకలను అదనంగా ఏర్పాటు చేయడం జరిగింది ఇంతేకాక మానసిక చికిత్సాలయంకూడ ప్రారంభించ బడింది, నాలుగవతరగతి సిబ్బంది గృహాలనిర్మాణం, మార్చ్యురీ నిర్మాణం పూర్తి చేయబడింది. అనాట మీ బ్లాకు నిర్మాణం, వాటరు సాఫెనింగు ప్లాంటుమ నెలకొల్పడం, శిక్షణ పొందుతున్న నర్సులకు, విద్యార్థులకు అదనపు వసతి గృహాల నిర్మాణం పూర్తి చేయ బడుతున్నాయి. క్రిందిపనులను పూర్తి చేయడం కోసం 1959—60 సంవత్సరానికి రు. 5 లక్షల మొత్తం కేటాయించబడింది.

(1) శిక్షణ పొందుతున్న నర్సులకు అదనపు వసతిగృహం

(2) విద్యార్థులకు (మగవారికి) అదనపు వసతిగృహం

(3) ఇంటర్నీలకు వసతిగృహం.

(4) విక్టోరియా స్త్రీల, పిల్లల ఆసుపత్రిలో అదనపు వార్డుల నిర్మాణ

(5) రెసిడెన్షియల్ మెడికల్ ఆఫీసర్లకు వసతిగృహాల నిర్మాణం

(6) ఔట్ పేషెంట్ డిపార్టుమెంటుకు విస్తరణ పనులు

(7) మెడికల్ స్టోర్సుకు అదనపు భవన నిర్మాణం

## ఆంధ్ర వైద్య కళాశాలలో "పెథాలాజి డిపార్టుమెంటు" స్థాయిని పెంచడం

ఒక డైరక్టరును, యితర సిబ్బందిని నియమించడం ద్వారా ఆంధ్రవైద్య కళాశాలలోని "పెథాలాజి డిపార్టుమెంటు" 1957-58 లో స్థాయిపెంచబడి అఖిల భారత సంస్థగా రూపొందించ బడింది. 1958—59 లో యీ స్థాయిలో డిపార్టుమెంటును కొనసాగించడం జరిగింది. ఈ డిపార్టుమెంటును యిదేవిధంగా కొనసాగించడానికి, పోస్టుగ్రాడ్యుయేట్లకు శిక్షణ యివ్వడానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.66 లక్ష కేటాయించబడింది.

## అసిస్టెంటు సర్జనులకు శిక్షణ.

విశాఖ పట్టణంలోని ఆంధ్ర వైద్యకళాశాలలో 15 అసిస్టెంటు సర్జనులకు యీ పథకంక్రింద క్లినికల్ పెథాలజి, సర్జరీ మొదలయినవాటిని గురించి శిక్షణ యివ్వటానికి ప్రతిపాదించబడింది. ఇందుకు యీ సంవత్సరం రు. 0. 10 లక్ష కేటాయించబడింది. 1957—59 సంవత్సరాల మధ్యకాలంలో 30 మంది అసిస్టెంటు సర్జనులు యీ పథకంక్రింద శిక్షణ పొందారు.

## టెక్నీషియన్లకు శిక్షణ

ఈ సంవత్సరం రు. 0. 21 లక్ష వ్యయంతో 12 మంది టెక్నీషియన్లు విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్యకళాశాలలో శిక్షణ పొందుతారు. రెండవ ప్రణాళికయొక్క రెండు, మూడు సంవత్సరాలలో 24 గురు టెక్నీషియన్లు అప్పుడే శిక్షణ పొందారు.

## కాంపౌండర్లకు శిక్షణ

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు, యితర వైద్య సంస్థలకు కావలసివచ్చే కాంపౌండర్ల అవసరాన్ని తీర్చటం కోసం రెండవ ప్రణాళికా కాలంలో అదనంగా 495 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింప బడింది. జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రులలోను, యితర టీచింగు ఆసుపత్రులలోను ఉన్న 11 శిక్షణ కేంద్రాలలో ఎటా 99 మందికి యీ శిక్షణ యివ్వబడుతుంది. అదేప్రకారం 1956—57, 1958—59 సంవత్సరాల కాలంలో 297 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వబడింది. ఇంకా 99 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటం కోసం యీ సంవత్సరంలో రు. 0.22 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.04 లక్ష విశాఖ పట్టణంలోని కింగ్ జార్జి ఆసుపత్రిలోను, స్త్రీలకు, పిల్లలకు ప్రత్యేకంగా ఉన్న ప్రభుత్వ ఆసుపత్రిలోను 18 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటం కోసం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## నర్సులకు శిక్షణ

ఈ పథకం క్రింద రెండవ ప్రణాళికా కాలంలో ప్రతి సంవత్సరం 95 మంది నర్సులుగా శిక్షణ పొందే నిమిత్తం అదనంగా చేర్చుకో బడినారు. ఈ

సంవత్సరం 95 మందితో కూడిన నాలుగవ జట్టు అభ్యర్థులు వివిధ శిక్షణ సంస్థలలో శిక్షణ నిమిత్తం చేర్చుకోబడతారు. ఇందుకోసం 1959—60 ప్రణాళికలో రు. 2.23 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.60 లక్ష వ్యయంతో 25 మంది అభ్యర్థులకు విశాఖ పట్టణంలోని కింగ్ జార్జి ఆసుపత్రిలో శిక్షణ యివ్వబడుతుంది.

## తాలూకా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రులకు అభివృద్ధి పనులు.

పడకల సంఖ్యను పెంచడం, అదనంగా భవనాలను నిర్మించడంద్వారా ఆంధ్రప్రాంతంలోని తాలూకా ఆసుపత్రులఅభివృద్ధి చేయటంకోసం రెండవ ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాల కాలంలో రు. 4.71 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. తాలూకా ఆసుపత్రుల అభివృద్ధికిగాను ఈ సంవత్సరంలో రు. 1.60 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. పడకల సంఖ్యను పెంచటం మూలంగా తాలూకా ఆసుపత్రులలో యింతకుముందు నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి, యింకాకొన్ని తాలూకా ఆసుపత్రులను ఈ సంవత్సరంలో అభివృద్ధిపరచటానికిగాను పై డబ్బు వినియోగించబడుతుంది.

## లోకల్ ఫండు ఆసుపత్రులను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడం.

ఈ పథకం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.95 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.36 లక్ష యీ జిల్లాకు కేటాయించ బడింది. 1957—58 లో స్వాధీనం చేసికో బడినట్టి శృంగవరపుకోటలోని ఆసుపత్రిని నిర్వహించడానికి, సాలూరు చీపురుపల్లిలలోని ఆసుపత్రులను స్వాధీనం చేసికోవడానికిగాను పై డబ్బు వినియోగించబడుతుంది.

## వాల్తేరులోని పిచ్చాసుపత్రికి అభివృద్ధిపనులు

వాల్తేరులోని పిచ్చాసుపత్రిలో వసతి తగినంతగా లేదు. ఈ ఆసుపత్రిని విస్తరింపచేసే ఉద్దేశంతో 28 ఎకరాల ప్రయివేటు భూమి స్వాధీనం చేసుకో

బడింది. 1958—59లో ప్రహరీగోడ నిర్మాణం ప్రారంభించబడింది. ఈ పనిని పూర్తిచేయడంకోసం 1959—60 లో రు. 1.50 లక్షల మొత్తం కేటాయించబడింది.

## క్షయ చికిత్సా కేంద్రాలు

రెండవ ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాల కాలంలోను ఆంధ్ర ప్రాంతంలో 10 క్షయ చికిత్సా కేంద్రాలు నెలకొల్పబడినాయి. ఈ సంవత్సరంలో యింకా 4 కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకుముందు ప్రారంభించిన వాటిని కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది ఇందులో రు. 0.20 లక్ష మొత్తం 1958—59 లో కింగుజార్జి ఆసుపత్రిలో ఏర్పాటు చేయబడిన క్షయ చికిత్సా కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ప్రత్యేకించబడింది.

## కుటుంబ నియంత్రణ కేంద్రాలు.

దేశంలో త్వరితగతిని జనాభా పెరగటం మూలంగా దేశం యొక్క పరిమితమైన ఆదాయ మార్గాల పై అధికమైన ఒత్తిడి కలుగచేయబడుతున్నది. ఈ కారణాలవల్ల కుటుంబ నియంత్రణ, జనాభా పెరుగుదలను అరికట్టడం అవసర మయింది. ఇందువల్ల 1957—59 సంవత్సరాలలో ఆంధ్ర ప్రాంతంలో 13, తెలంగాణా ప్రాంతంలో 7— మొత్తం 20 కుటుంబ నియంత్రణ కేంద్రాలు స్థాపించ బడినాయి. ఈ సంవత్సరంలో యింకా 15 కేంద్రాలను-- 10 ఆంధ్రలోను, 5 తెలంగాణాలోను— ప్రారంభించటానికి, ఇంతకుముందు ప్రారంభించ వాటిని కొనసాగించ టానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు 1959—60 ప్రణాళికలో రు. 0.66లక్ష కేటాయించబడింది, ఇందులో రు.0.08 లక్ష విజయనగరంలోని ప్రభుత్వ ఆసుపత్రిలో ఒక కుటుంబ నియంత్రణ కేంద్రాన్ని ఏర్పాటుచేయడానికి, కింగుజార్జి ఆసుపత్రిలోను, ఆంధ్ర వైద్య కళాశాలలోను యింతకుముందు స్థాపించిన కేంద్రాలను కొనసాగించేటందుకు గాను ఈ జిల్లాలో వినియోగించబడుతుంది.

## సహాయక నర్సు—మంత్రసానులకు శిక్షణ

సహాయకనర్సు - మంత్రసానుల శిక్షణకోసం యింతకు ముందు ప్రారంభించిన 5 కేంద్రాలను నిర్వహించటానికి, క్రొత్తగా మరో రెండు కేంద్రాలను ఈ సంవత్సరంలో ప్రారంభించటానికిగాను ప్రణాళికలో రు. 0.78 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.12 లక్ష విశాఖపట్టణంలోని కింగుజార్జి ఆసుపత్రిలో ఏర్పాటుచేయబడిన శిక్షణ కేంద్రాన్ని కొనసాగించటం కోసం ప్రత్యేకించబడింది.

## సహాయక ఆరోగ్యసిబ్బందికి శిక్షణ

ఈ పథకంక్రింద 1957—58 నుండి ఏటా 50 మంది సహాయక ఆరోగ్య కార్యకర్తలు శిక్షణ నిమిత్తం విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్య కళాశాలలో చేర్చుకోబడుతున్నారు. 1959—60లో యింకా 50 మంది శిక్షణ నిమిత్తం చేర్చుకోబడతారు. ఇందుకు ప్రణాళికలో రు. 0.47 లక్ష కేటాయించబడింది.

## లేబరేటరీ అసిస్టెంట్లకు శిక్షణ

మామూలుగా లేబరేటరీలో చేసే పరిశీలనపని వైద్యాధికారులకులేకుండా చేసేటందుకుగాను లేబరేటరీ అసిస్టెంట్లకు శిక్షణయివ్వడానికి సంబంధించిన పథకం ఒకటి 1957–58 లో భారత ప్రభుత్వం వారిచే ప్రారంభించ బడింది. విశాఖ పట్టణంలోని ఆంధ్ర వైద్య కళాశాలలో 6 గురు అభ్యర్థులు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడినారు. 1958—59 లో యింకా 6 మంది చేర్చుకోబడినారు. 1959—60 లో మరో 6 గురికి శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు రు. 0.10 లక్ష కేటాయించబడింది.

## పబ్లిక్ హెల్త్ నర్సులకు శిక్షణ

ఈ పథకంక్రింద వైద్య సంస్థలలో పనిచేస్తున్న నర్సులకు ప్రజారోగ్య కార్యక్రమాలకు సంబంధించి, సామాన్యరోగ చికిత్సావిషయాలకు సంబంధించి శిక్షణ యివ్వబడుతుంది. ఇందువల్లవారు గ్రామీణ ఆరోగ్య కేంద్రాలలో పనిచేయ డానికి వీలు చేకూరుతుంది. ఈ శిక్షణ నాలుగేళ్ళపాటు యివ్వబడుతుంది.

1957—59 సంవత్సరాలలో ఏటా 12 మంది చొప్పున 24 మంది నర్సులు విశాఖ పట్టణంలోని-కింగుజార్జి ఆసుపత్రిలో శిక్షణకుగాను చేర్చుకోబడినారు ఈ సంవత్సరం యింకా 12 మంది నర్సులు చేర్చుకోబడతారు. ఇందుకు రు.0.60 లక్ష కేటాయించబడింది.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

ఈ పథకంక్రింద, గ్రామీణ ప్రజల అవసరాలను తీర్చటంకోసం బ్లాకు ప్రాంతాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో యీ పథకంక్రింద రు. 15.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.00 లక్ష మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ జిల్లాలో 2 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకుముందు ఏర్పాటు చేయబడిన కేంద్రాలను కొనసాగించటానికి పై డబ్బు వినియోగించబడుతుంది.

## ఇంటర్నీ శిక్షణ నిమిత్తం హెడ్‌క్వార్టర్సు ఆసుపత్రులస్థాయిని పెంచటం

క్రొత్త నిబంధనల ప్రకారం, ఎం.బి., బి ఎస్., విద్యార్థులు ఒక సంవత్సరం పాటు ప్రభుత్వంవారిచే గుర్తింపబడిన సంస్థల్లో "ఇంటర్నీ" లుగా శిక్షణపొందాలి. ఈ ఇంటర్నీలకు అదనపువసతి సౌకర్యాన్ని కలిగించడంకోసం ఏలూరులో వసతి. గృహాలు నిర్మించడం ప్రారంభించబడింది. ఈ సంవత్సరం వీటి నిర్మాణం పూర్తవుతుంది 1959—60 లో విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్యకళాశాలలోను, కాకినాడలోని జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలోను "ఇంటర్నీలకు" గాను అదనపు వసతిగృహాలను నిర్మించటానికికూడా ప్రతిపాదింపబడింది. ఈ పథకానికిగాను కేటాయించబడిన రు. 0.50 లక్షలో రు. 0.30 లక్ష విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్యక శాలలలో అదనపు వసతిగృహాలను నిర్మించటంకోసం ప్రత్యేకించబడింది

## రాజ్యంలో వైద్య పరిశోధన

పరిశోధనకోసం ప్రభుత్వంవారు ఏర్పాటు చేసిన పరిశోధన సంఘంవారి ఆమోదాన్ని పొందిన ఏ పరిశోధనా పథకం విషయంలోనైనా పరిశోధన చేసే

వారికి ఫెలోషిప్పులు నివ్వడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ఈ పథకం విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్య కళాశాలలోను, హైదరాబాదులోని ఉస్మానియావైద్య కళాశాలలోను, గుంటూరులోని వైద్యకళాశాలలోను ప్రవేశ పెట్టబడింది. పరిశోధన జరపడం కోసం ఈ కళాశాలలలో రిసెర్చి స్కాలర్లు నియమించ బడ్డారు. ఈ సంవత్సరంలో ఈ పథకాన్ని పై కళాశాలల్లో కొనసాగించడానికి ప్రణాళికలో రు. 0.18 లక్ష మొత్తం కేటాయించబడింది,

## క్షయరోగులకు ప్రత్యేక పడకలు

క్షయ రోగులకుగాను ఈ సంవత్సరంలో 290 ప్రత్యేక పడకలను ఆంధ్రలో ఏర్పాటు చేయడానికి, యింతకుముందు ఏర్పాటు చేసినవాటిని నిర్వహించటానికిగాను రు. 5.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.75 లక్ష విశాఖపట్టణంలోని జిల్లాఆసుపత్రిలో క్షయరోగులకుగాను 20 ప్రత్యేక పడకలను ఏర్పాటుచేసే నిమిత్తం ప్రత్యేకించబడింది.

## విశాఖపట్టణం, గుంటూరులలో అంటువ్యాధుల ఆసుపత్రులు

విశాఖపట్టణం, గుంటూరులలో అంటువ్యాధుల ఆసుపత్రుల భవనాలను నిర్మించడం పూర్తిచేయడానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 1.50 లక్ష మొత్తం కేటాయించబడింది.

## భారతీయ వైద్య విధానం:
## ఆయుర్వేద వైద్యంగురించి పరిశోధన

ఈ పథకంక్రింద విశాఖపట్టణంలోని కెరగుజార్జి ఆసుపత్రిలో ఆంధ్ర వైద్య కళాశాలయొక్క ఫార్మకాలజీ డిపార్టుమెంటువారి సహకారంతో ఆయుర్వేదాన్నిగురించి పరిశోధన చేయుటకు ప్రతిపాదింపబడింది. మందులు మొదలయినవి కొనటానికి, పరిశోధన కొనసాగించటానికిగాను రు. 0.10 లక్ష కేటాయించబడింది. గుంటూరులోని వినుకొండలో ఆయుర్వేద వైద్యశాలను స్థాపించడానికికూడ యీ పథకంక్రింద ప్రతిపాదింపబడింది.

## విశాఖపట్టణం పాలిటెక్నిక్ విస్తరణ పథకం

ప్రస్తుతం విశాఖపట్టణం పాలిటెక్నిక్ అద్దెభవనాలలో పనిచేస్తున్నది. శాశ్వతభవనాలను నిర్మించటానికి, అదనపు పరికరాలను, సిబ్బందిని సమకూర్చడానికిగాను రెండవప్రణాళికలో రు. 22.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఈ సంస్థను నెలకొల్పటంకోసం కప్పరాడ (విశాఖపట్టణం జిల్లా)లో 30 ఎకరాల స్థలం స్వాధీనం చేసికోబడింది. భవనాలు, లేబరేటరీలు, హాస్టళ్ళ నిర్మాణం 1958—59 లో ప్రారంభించ బడింది. ఈ సంవత్సరపు ప్రణాళికలో సమకూర్చబడే పరికరాల ఖరీదుకు, సిబ్బందిజీతాలకు, భవనాల నిర్మాణానికిగాను రు. 5.27 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇంతేకాక అదనపు పరికరాలను భవనాలను సమకూర్చటంద్వారా యిపాలిటెక్నిక్ విస్తరణకోసం కేంద్రప్రతిపాదిత పథకాలక్రింద యింకా రు. 3.29 లక్షల మొత్తం—కేంద్రప్రభుత్వంచే రు. 2.69 లక్షలు, రాజ్యప్రభుత్వంచే రు. 0. 60 లక్ష—కేటాయించబడింది.

## విశాఖపట్టణంలోని హిందుస్థాన్ షిప్ యార్డ్ (ప్రైవేటు) లిమిటెడ్ లో సాండ్ విచ్ కోర్సులు

ఈ సంవత్సరంలో అమలుపరచడానికి ఉద్దేశించ బడినట్టిది యీ క్రొత్త పథకం 30 మంది విద్యార్థులు చేర్చుకోబడుతారు. వీరికి విద్యాబోధనతోపాటు పరిశ్రమలో ప్రత్యక్ష శిక్షణ ఇవ్వడానికి ఈ పథకం క్రింద ఉద్దేశించ బడింది ఈ సంవత్సరం ప్రణాళికలో భవనాలనిర్మాణానికి, పరికరాల కొనుగోలుకుగాను రు. 0.61 లక్ష రాజ్యప్రభుత్వ వాటాఖర్చుక్రింద కేటాయించ బడింది. ఇంతేకాక కేంద్ర ప్రభుత్వం రు. 0.80 లక్ష సమకూరుస్తుంది.

# వైద్యం

## విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్య కళాశాలకు, కింగు జార్జి ఆసుపత్రికి అభివృద్ధి పనులు

రెండవ ప్రణాళిక యొక్క మొదటిమూడు సంవత్సరాల కాలంలో విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్య కళాశాలకు, కింగుజార్జి ఆసుపత్రికి వివిధ అభివృద్ధి పనులను చేయుటకుగాను రు. 10.80 లక్షల మొత్తం ఖర్చుపెట్టబడింది.

ఈ కళాశాలలో ఏటా యింకా 15 మంది విద్యార్థులను అదనంగా చేర్చుకోవడానికి వీలుకల్పించ బడింది. ఆసుపత్రిలో యింకా 123 పడకలను అదనంగా ఏర్పాటు చేయడం జరిగింది ఇంతేకాక మానసిక చికిత్సాలయంకూడ ప్రారంభించ బడింది. నాలుగవతరగతి సిబ్బంది గృహాలనిర్మాణం, మార్చ్యురి నిర్మాణం పూర్తి చేయబడింది. అనాట మీబ్లాకు నిర్మాణం, వాటరు సాఫెనింగు ప్లాంటును నెలకొల్పడం, శిక్షణ పొందుతున్న నర్సులకు, విద్యార్థులకు అదనపు వసతి గృహాల నిర్మాణం పూర్తి చేయ బడున్నాయి. క్రిందిపనులను పూర్తి చేయడమ్ కోసం 1959—60 సంవత్సరానికి రు. 5 లక్షల మొత్తం కేటాయించబడింది.

(1) శిక్షణ పొందుతున్న నర్సులకు అదనపు వసతిగృహం

(2) విద్యార్థులకు (మగవారికి) అదనపు వసతిగృహం

(3) ఇంటర్నీలకు వసతిగృహం.

(4) విక్టోరియా స్త్రీల, పిల్లల ఆసుపత్రిలో అదనపు వార్డుల నిర్మాణ

(5) రెసిడెన్షియల్ మెడికల్ ఆఫీసర్లకు వసతిగృహాల నిర్మాణం

(6) ఔట్ పేషెంట్ డిపార్టుమెంటుకు విస్తరణ పనులు

(7) మెడికల్ స్టోర్సుకు అదనపు భవన నిర్మాణం

## ఆంధ్ర వైద్య కళాశాలలో "పెథాలాజి డిపార్టుమెంటు" స్థాయిని పెంచడం

ఒక డైరక్టరును, యితర సిబ్బందిని నియమించడం ద్వారా ఆంధ్రవైద్య కళాశాలలోని "పెథాలాజి డిపార్టుమెంటు" 1957-58 లో స్థాయి పెంచబడి అఖిల భారత సంస్థగా రూపొందించ బడింది. 1958—59 లో యీ స్థాయిలో డిపార్టుమెంటును కొనసాగించడం జరిగింది. ఈ డిపార్టుమెంటును యిదేవిధంగా కొనసాగించడానికి. పోస్టుగ్రాడ్యుయేట్లకు శిక్షణ యివ్వడానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.66 లక్ష కేటాయించబడింది.

## అసిస్టెంటు సర్జనులకు శిక్షణ.

విశాఖ పట్టణంలోని ఆంధ్ర వైద్యకళాశాలలో 15 అసిస్టెంటు సర్జనులకు యీ పథకంక్రింద క్లినికల్ పెథాలజి, సర్జరీ మొదలయినవాటిని గురించి శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు యీ సంవత్సరం రు. 0. 10 లక్ష కేటాయించబడింది. 1957—59 సంవత్సరాల మధ్యకాలంలో 30 మంది అసిస్టెంటు సర్జనులు యీ పథకంక్రింద శిక్షణ పొందారు.

## టెక్నీషియన్లకు శిక్షణ

ఈ సంవత్సరం రు. 0. 21 లక్ష వ్యయంతో 12 మంది టెక్నీషియన్లు విశాఖ పట్టణంలోని ఆంధ్ర వైద్యకళాశాలలో శిక్షణ పొందుతారు. రెండవ ప్రణాళిక యొక్క రెండు, మూడు సంవత్సరాలలో 24 గురు టెక్నీషియన్లు అప్పుడే శిక్షణ పొందారు.

## కాంపౌండర్లకు శిక్షణ

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలకు, యితర వైద్య సంస్థలకు కావలసివచ్చే కాంపౌండర్ల అవసరాన్ని తీర్చటం కోసం రెండవ ప్రణాళికా కాలంలో అదనంగా 495 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింప బడింది. జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రులలోను, యితర టీచింగు ఆసుపత్రులలోను ఉన్న 11 శిక్షణ కేంద్రాలలో ఏటా 99 మందికి యీ శిక్షణ యివ్వబడుతుంది. అదేప్రకారం 1956—57, 1958—59 సంవత్సరాల కాలంలో 297 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వబడింది. ఇంకా 99 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటం కోసం యీ సంవత్సరంలో రు. 0.22 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.04 లక్ష విశాఖ పట్టణంలోని కింగ్ జార్జి ఆసుపత్రిలోను, స్త్రీలకు, పిల్లలకు ప్రత్యేకంగా ఉన్న ప్రభుత్వ ఆసుపత్రిలోను 18 మంది కాంపౌండర్లకు శిక్షణ యివ్వటం కోసం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

## నర్సులకు శిక్షణ

ఈ పథకం క్రింద రెండవ ప్రణాళికా కాలంలో ప్రతి సంవత్సరం 85 మంది నర్సులుగా శిక్షణ పొందే నిమిత్తం అదనంగా చేర్చుకో బడినారు. ఈ

సంవత్సరం 95 మందితో కూడిన నాలుగవ జట్టు అభ్యర్థులు వివిధ శిక్షణ సంస్థలలో శిక్షణ నిమిత్తం చేర్చుకోబడతారు. ఇందుకోసం 1959—60 ప్రణాళికలో రు. 2.23 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.60 లక్ష వ్యయంతో 25 మంది అభ్యర్థులకు విశాఖ పట్టణంలోని కింగ్ జార్జి ఆసుపత్రిలో శిక్షణ యివ్వబడుతుంది.

## తాలూకా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రులకు అభివృద్ధి పనులు.

పడకల సంఖ్యను పెంచడం. అదనంగా భవనాలను నిర్మించడంద్వారా ఆంధ్రప్రాంతంలోని తాలూకా ఆసుపత్రులఅభివృద్ధి చేయటంకోసం రెండవ ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాల కాలంలో రు. 4.71 లక్షల మొత్తం ఖర్చు పెట్టబడింది. తాలూకా ఆసుపత్రుల అభివృద్ధికిగాను ఈ సంవత్సరంలో రు. 1.60 లక్షల మొత్తం ప్రణాళికలో కేటాయించబడింది. ఇందులో రు. 0.20 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. పడకల సంఖ్యను పెంచటం మూలంగా తాలూకా ఆసుపత్రులలో యింతకుముందు నియమించ బడిన సిబ్బందిని కొనసాగించడానికి, యింకాకొన్ని తాలూకా ఆసుపత్రులను ఈ సంవత్సరంలో అభివృద్ధిపరచటానికిగాను పై డబ్బు వినియోగించబడుతుంది.

## లోకల్ ఫండు ఆసుపత్రులను ప్రభుత్వం స్వాధీనం చేసుకోవడం.

ఈ పథకం కోసం ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 3.95 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 0.36 లక్ష యీ జిల్లాకు కేటాయించ బడింది. 1957—58 లో స్వాధీనం చేసికో బడినట్టి శృంగవరపుకోటలోని ఆసుపత్రిని నిర్వహించడానికి, సాలూరు చీపురుపల్లిలలోని ఆసుపత్రులను స్వాధీనం చేసికోవడానికిగాను పై డబ్బు వినియోగించబడుతుంది.

## వాల్తేరులోని పిచ్చాసుపత్రికి అభివృద్ధిపనులు

వాల్తేరులోని పిచ్చాసుపత్రిలో వసతి తగినంతగాలేదు. ఈ ఆసుపత్రిని విస్తరింపచేసే ఉద్దేశంతో 28 ఎకరాల ప్రయివేటు భూమి స్వాధీనం చేసుకో

జడింది. 1958—59లో ప్రహరీగోడ నిర్మాణం ప్రారంభించబడింది. ఈ పనిని పూర్తిచేయడంకోసం 1959—60 లో రు. 1.50 లక్షల మొత్తం కేటాయించ బడింది.

## క్షయ చికిత్సా కేంద్రాలు

రెండవ ప్రణాళిక యొక్క మొదటి 3 సంవత్సరాల కాలంలోను ఆంధ్ర ప్రాంతంలో 10 క్షయ చికిత్సా కేంద్రాలు నెలకొల్పబడినాయి. ఈ సంవత్సరంలో యింకా 4 కేంద్రాలను ఏర్పాటు చేయటానికి, ఇంతకుముందు ప్రారంభించిన వాటిని కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 3.00 లక్షల మొత్తం కేటాయించబడింది ఇందులో రు. 0.20 లక్ష మొత్తం 1958—59 లో కింగుజార్జి ఆసుపత్రిలో ఏర్పాటు చేయబడిన క్షయ చికిత్సా కేంద్రాన్ని కొనసాగించుటకుగాను ప్రత్యేకించబడింది.

## కుటుంబ నియంత్రణ కేంద్రాలు.

దేశంలో త్వరితగతిని జనాభా పెరగటం మూలంగా దేశం యొక్క పరిమితమైన ఆదాయ మార్గాల పై అధికమైన ఒత్తిడి కలుగచేయబడుతున్నది. ఈ కారణాలవల్ల కుటుంబ నియంత్రణ, జనాభా పెరగడాన్ని అరికట్టడం అవసర మయింది. ఇందువల్ల 1957—59 సంవత్సరాలలో ఆంధ్ర ప్రాంతంలో 13, తెలంగాణా ప్రాంతంలో 7— మొత్తం 20 కుటుంబ నియంత్రణ కేంద్రాలు స్థాపించ బడినాయి. ఈ సంవత్సరంలో యింకా 15 కేంద్రాలను-- 10 ఆంధ్రలోను, 5 తెలంగాణాలోను— ప్రారంభించటానికి, ఇంతకుముందు ప్రారంభించ వాటిని కొనసాగించ టానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు 1959—60 ప్రణాళికలో రు. 0.66 లక్ష కేటాయించబడింది, ఇందులో రు.0.08 లక్ష విజయనగరంలోని ప్రభుత్వ ఆసుపత్రిలో ఒక కుటుంబ నియంత్రణ కేంద్రాన్ని ఏర్పాటుచేయడానికి, కింగుజార్జి ఆసుపత్రిలోను, ఆంధ్ర వైద్య కళాశాలలోను యింతకుముందు స్థాపించిన కేంద్రాలను కొనసాగించేటందుకు గాను ఈ జిల్లాలో వినియోగించబడుతుంది.

## సహాయక నర్సు—మంత్రసానులకు శిక్షణ

సహాయకనర్సు - మంత్రసానుల శిక్షణకోసం యింతకు ముందు ప్రారంభించిన 5 కేంద్రాలను నిర్వహించటానికి, క్రొత్తగా మరో రెండు కేంద్రాలను ఈ సంవత్సరంలో ప్రారంభించటానికిగాను ప్రణాళికలో రు. 0.78 లక్ష కేటాయించబడింది, ఇందులో రు. 0.12 లక్ష విశాఖపట్టణంలోని కింగుజార్జి ఆసుపత్రిలో ఏర్పాటుచేయబడిన శిక్షణ కేంద్రాన్ని కొనసాగించటం కోసం ప్రత్యేకించబడింది.

## సహాయక ఆరోగ్యసిబ్బందికి శిక్షణ

ఈ పథకంక్రింద 1957—58 నుండి ఏటా 50 మంది సహాయక ఆరోగ్య కార్యకర్తలు శిక్షణ నిమిత్తం విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్య కళాశాలలో చేర్చుకోబడుతున్నారు. 1959—60లో యింకా 50 మంది శిక్షణ నిమిత్తం చేర్చుకోబడతారు. ఇందుకు ప్రణాళికలో రు. 0.47 లక్ష కేటాయించబడింది.

## లేబరేటరీ అసిస్టెంట్లకు శిక్షణ

మామూలుగా లేబరేటరీలో చేసే పరిశీలనపని వైద్యాధికారులకులేకుండా చేసేటందుకుగాను లేబరేటరీ అసిస్టెంట్లకు శిక్షణయివ్వడానికి సంబంధించిన పథకం ఒకటి 1957_58 లో భారత ప్రభుత్వం వారిచే ప్రారంభించ బడింది. విశాఖ పట్టణంలోని ఆంధ్ర వైద్య కళాశాలలో 6 గురు అభ్యర్థులు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడినారు. 1958—59 లో యింకా 6 మంది చేర్చుకోబడినారు. 1959—60 లో మరో 6 గురికి శిక్షణ యివ్వటానికి ప్రతిపాదింప బడింది. ఇందుకు రు. 0.10 లక్ష కేటాయించబడింది.

## పబ్లిక్ హెల్త్ నర్సులకు శిక్షణ

ఈ పథకంక్రింద వైద్య సంస్థలలో పనిచేస్తున్న నర్సులకు ప్రజారోగ్య కార్యక్రమాలకు సంబంధించి, సామాన్యరోగ చికిత్సావిషయాలకు సంబంధించి శిక్షణ యివ్వబడుతుంది. ఇందువల్లవారు గ్రామీణ ఆరోగ్య కేంద్రాలలో పనిచేయ డానికి వీలు చేకూరుతుంది. ఈ శిక్షణ నాలుగేళ్ళపాటు యివ్వబడుతుంది.

1957—59 సంవత్సరాలలో ఏటా 12 మంది చొప్పున 24 మంది నర్సులు విశాఖ పట్టణంలోని-కింగుజార్జి ఆసుపత్రిలో శిక్షణకుగాను చేర్చుకోబడినారు ఈ సంవత్సరం యింకా 12 మంది నర్సులు చేర్చుకోబడతారు. ఇందుకు రు.0.60 లక్ష కేటాయించబడింది.

## ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు

ఈ పథకంక్రింద, గ్రామీణ ప్రజల అవసరాలను తీర్చటంకోసం బ్లాకు ప్రాంతాలలో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు ఏర్పాటు చేయబడతాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో యీ పథకంక్రింద రు. 15.00 లక్షలు మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 1.00 లక్ష మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించబడింది. ఈ జిల్లాలో 2 ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలను ఏర్పాటు చేయుటానికి, ఇంతకుముందు ఏర్పాటు చేయబడిన కేంద్రాలను కొనసాగించటానికి పై డబ్బు వినియోగించబడుతుంది.

## ఇంటర్న్ శిక్షణ నిమిత్తం హెడ్‌క్వార్టర్సు ఆసుపత్రులస్థాయిని పెంచటం

క్రొత్త నిబంధనల ప్రకారం, ఎం.బి., బి ఎస్.. విద్యార్థులు ఒక సంవత్సరం పాటు ప్రభుత్వంవారిచే గుర్తింపబడిన సంస్థల్లో "ఇంటర్న్" లుగా శిక్షణపొందాలి. ఈ ఇంటర్న్‌లకు అదనపువసతి సౌకర్యాన్ని కలిగించడంకోసం ఏలూరులో వసతి. గృహాలు నిర్మించడం ప్రారంభించబడింది. ఈ సంవత్సరం వీటి నిర్మాణం పూర్తవుతుంది 1959—60 లో విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్యకళాశాలలోను, కాకినాడలోని జిల్లా హెడ్ క్వార్టర్సు ఆసుపత్రిలోను "ఇంటర్న్‌లకు" గాను అదనపు వసతిగృహాలను నిర్మించటానికికూడా ప్రతిపాదింపబడింది. ఈ పథకానికిగాను కేటాయించబడిన రు. 0.50 లక్షలో రు. 0.30 లక్ష విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్యక శాలలో అదనపు వసతిగృహాలను నిర్మించటంకోసం ప్రత్యేకించబడింది

## రాజ్యంలో వైద్య పరిశోధన

పరిశోధనకోసం ప్రభుత్వంవారు ఏర్పాటు చేసిన పరిశోధన సంఘంవారి ఆమోదాన్ని పొందిన ఏ పరిశోధనా పథకం విషయంలోనైనా పరిశోధన చేసే

వారికి ఫెలోషిప్పుల నివ్వడానికి ఈ పథకం ఉద్దేశిస్తున్నది. ఈ పథకం విశాఖపట్టణంలోని ఆంధ్ర వైద్య కళాశాలలోను, హైదరాబాదులోని ఉస్మానియావైద్య కళాశాలలోను, గుంటూరులోని వైద్యకళాశాలలోను ప్రవేశ పెట్టబడింది. పరిశోధన జరపడం కోసం ఈ కళాశాలలలో రిసెర్చి స్కాలర్లు నియమించ బడ్డారు. ఈ సంవత్సరంలో ఈ పథకాన్ని పై కళాశాలల్లో కొనసాగించడానికి ప్రణాళికలో రు. 0.18 లక్ష మొత్తం కేటాయించబడింది,

## క్షయరోగులకు ప్రత్యేక పడకలు

క్షయ రోగులకుగాను ఈ సంవత్సరంలో 290 ప్రత్యేక పడకలను ఆంధ్రలో ఏర్పాటు చేయడానికి, యింతకుముందు ఏర్పాటు చేసినవాటిని నిర్వహించటానికిగాను రు. 5.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.75 లక్ష విశాఖపట్టణంలోని జిల్లాఆసుపత్రిలో క్షయరోగులకుగాను 20 ప్రత్యేక పడకలను ఏర్పాటుచేసే నిమిత్తం ప్రత్యేకించబడింది.

## విశాఖపట్టణం, గుంటూరులలో అంటువ్యాధుల ఆసుపత్రులు

విశాఖపట్టణం, గుంటూరులలో అంటువ్యాధుల ఆసుపత్రుల భవనాలను నిర్మించడం పూర్తిచేయుడానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 1.50 లక్ష మొత్తం కేటాయించబడింది.

## భారతీయ వైద్య విధానం: ఆయుర్వేద వైద్యంగురించి పరిశోధన

ఈ పథకంక్రింద విశాఖపట్టణంలోని కింగుజార్జి ఆసుపత్రిలో ఆంధ్ర వైద్య కళాశాలయొక్క ఫార్మకాలజీ డిపార్టుమెంటువారి సహకారంతో ఆయుర్వేదాన్నిగురించి పరిశోధన చేయుటకు ప్రతిపాదింపబడింది. మందులు మొదలయినవి కొనటానికి, పరిశోధన కొనసాగించటానికిగాను రు. 0.10 లక్ష కేటాయించబడింది. గుంటూరులోని వినుకొండలో ఆయుర్వేద వైద్య శాలను స్థాపించడానికికూడ యీ పథకంక్రింద ప్రతిపాదింపబడింది.

### సుఖవ్యాధి చికిత్సా కేంద్రాలు

ఇంతకుముందు స్థాపించిన 5 కేంద్రాలను కొనసాగించడానికి, ఈ సంవత్సరం మరో 3 కేంద్రాలకొరకై ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 1.70 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో, రూ. 0.20 లక్షల మొత్తం, కింగ్ జార్జి ఆసుపత్రిలో 1957—58 లో స్థాపించబడిన సుఖవ్యాధి చికిత్సా కేంద్రాన్ని కొనసాగించడానికిగాను ఈ జిల్లాకు కేటాయించబడింది.

### విశాఖపట్నం, గుంటూరులలో శానిటరీ ఇన్స్పెక్టర్ల శిక్షణ

విశాఖపట్నం, గుంటూరు వైద్యశాలలు ప్రతిదానిలోను శానిటరీ ఇన్స్పెక్టరు శిక్షణ పొందే విద్యార్థులు 100 మంది ఏటా చేర్చుకోబడుతున్నారు. 1959—60 లో కూడ ఈ శాఖలలో ప్రతిదానియందు 100 మంది విద్యార్థులు చేర్చుకోబడతారు. శిక్షణ పొందేవారికోసం 2 హాస్టళ్లు, ఒకటి విశాఖపట్నం జిల్లాలోని సింహాచలంలోను, మరొకటి గుంటూరుజిల్లా తాడికొండలోని గ్రామీణ ఆరోగ్య కేంద్రంలోను, నిర్వహించబడతాయి. శానిటరీ ఇన్స్పెక్టర్లుగా శిక్షణ పొందేవిద్యార్థులకు తాడికొండ సింహాచలంలలోఉన్న గ్రామీణ ఆరోగ్య కేంద్రాలు ప్రత్యక్ష శిక్షణను సమకూరుస్తాయి. ఈ పథకానికి 1959—60 ప్రణాళికలో రు. 2 లక్షల మొత్తం కేటాయించబడింది.

## ప్రజారోగ్యం

### హెల్త్ విజిటర్లకు శిక్షణ

విశాఖపట్టణంలో హెల్త్ విజిటర్ల శిక్షణ పాఠశాల 1954 లో స్థాపించబడింది. 1956—57, 1957—58, 1958—59 సంవత్సరాలలో యిది కొనసాగించబడింది. మొదటి సంవత్సరం 49 మంది, రెండవ సంవత్సరం 16 మంది మూడవ సంవత్సరం 30 మంది ఎస్. ఎస్. ఎల్. సి చదివిన అభ్యర్థులు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడినారు. 1959—60 ప్రణాళికలో రు. 1.70 లక్షల మొత్తం పాఠశాలను కొనసాగించడానికి, 30 మంది అభ్యర్థులకు శిక్షణ యివ్వడానికిగాను కేటాయించబడింది. ఇంతే కాక 30 మంది సహాయక నర్సు-మంత్రసానులు హెల్త్ విజిటర్లుగా శిక్షణ పొందడంకోసం చేర్చుకోబడతారు.

## దాయీలకు శిక్షణ

నాటుమంత్రసానులు పురుళ్లు పోయడంలో ఉత్తమ పద్ధతుల నవలంబించి తమవృత్తిని నిర్వహించడానికిగాను శిక్షణ పథకం ఒకటి 1956—57 లో ప్రారంభించబడింది. రెండవ ప్రణాళిక మొదటి మూడు సంవత్సరాలలో 1329 మంది ఈ పథకంక్రింద శిక్షణకోసం చేర్చుకోబడ్డారు. ఈ సంవత్సరంలో ఆ పథకం కొనసాగింప బడడమే కాకుండా మరొక 720 మంది అభ్యర్థులు చేర్చుకో బడతారు. అందుకోసం రు. 0.81 లక్ష మొత్తం రాజ్య ప్రణాళికలో కేటా యించబడింది. 60 మంది దాయీలకు శిక్షణ నిచ్చేటందుకు ఆ మొత్తంలో 10,250 రూపాయలు ఈ జిల్లాలో వినియోగింప బడతాయి.

## మలేరియా బ్యూరో విస్తరణ

1956—57 లో మొదటి ప్రణాళికా కాలంలో స్థాపించబడిన 2 మలేరియా నివారణ యూనిట్లు కొనసాగింపబడినాయి. 1957—58 లో మరో 2 యూనిట్లు ఏర్పాటుచేయడం జరిగింది. ఈ 4 యూనిట్లు 1958—59 లో కొనసాగింప బడ్డాయి. ఈ వ్యాధిరాకుండా 40 లక్షల మందికి రక్షణ చేకూర్చ టానికి ఈ యూనిట్లు ఉపకరించాయి. నేషనల్ మలేరియా నివారణ కార్య క్రమం మలేరియా నిర్మూలనా కార్యక్రమంగా 1—4—1958 నుండి మార్చ బడింది. అవనంగా స్ప్రేయింగు పరికరాలు, డి.డి.టి. ని సరఫరా చేయడం ద్వారా మలేరియా సోకని ప్రాంతాలతోసహా రాష్ట్రం అంతటా మందు చల్లడం తీవ్రం చేయబడుతుంది. 17 సబ్ యూనిట్లుతో ప్రస్తుతం ఉన్న 4 యూనిట్లను కొనసాగించడానికి, 16 హైపో-ఎండమిక్ యూనిట్లను తెరవడానికి, ప్రజారోగ్య శాఖ రీజినల్ అసిస్టెంటు డైరక్టర్ల కార్యాలయాలను మూడింటిని నెలకొల్ప డానికి 1959—60 ప్రణాళికలో రాజ్య ప్రభుత్వం వాటాక్రింద రూ. 22.29 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రూ 1.97 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఒక హైపో ఎండెమిక్ యూనిట్టును నెల కొల్పడానికి, ప్రజారోగ్యశాఖ రీజినల్ అసిస్టెంటుడైరక్టరు కార్యాలయాన్నొక దానిని ఏర్పాటుచేయడానికి, ప్రస్తుతం ఉన్న రెండు సబ్ యూనిట్లను కొన సాగించడానికి ఈ మొత్తం వినియోగించ బడుతుంది.

## బోదవ్యాధి నివారణ కార్యక్రమం

మొదటి ప్రణాళికా కాలంలో యీ పథకంక్రింద రెండుసర్వే యూనిట్లు, ఒక నివారణ యూనిట్టు ఏర్పాటు చేయబడినాయి. రెండు సర్వే యూనిట్లు కూడ 31—9—56 వరకుమాత్రం కొనసాగించబడగా నివారణ యూనిట్టు ప్రణాళిక యొక్క మూడు సంవత్సరాల కాలంలోను కొనసాగించబడింది. ఇంకా రెండు నివారణ యూనిట్లును ఏర్పాటుచేయటానికి *పాత యూనిట్టును 1959—60లో కొనసాగించటానికి ప్రతిపాదింపబడింది. ఇందుకయ్యే వ్యయంలో రాజ్యప్రభుత్వవాటా క్రింద ప్రణాళికలో రు. 7.11 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 3.13 లక్షలమొత్తం విశాఖపట్టణం జిల్లాలో ఒక క్రొత్త యూనిట్టును స్థాపించడానికిగాను ప్రత్యేకించబడింది.

## బి .సి. జి. టీకాలు

క్షయ నివారణకోసం, ఒక కేంద్ర పరిపాలక యూనిటు, ఆరు ఫీల్డు టీములతో బి.సి.జి టీకాల ఉద్యమం మొదటిప్రణాళికా కాలంలో ప్రారంభించబడింది. అవి మొదటమూడు సంవత్సరాలలో కొనసాగింప బడ్డాయి. 1959—60 లో ప్రస్తుతం ఉన్న పరిపాలక యూనిట్టును, ఆరు ఫీల్డు టీములను కొనసాగించడమే కాకుండా, అదనంగా మూడు ఫీల్డు టీములను స్థాపించడానికి తల పెట్టబడింది. అందుకోసం ప్రణాళికలో రూ. 3.70 లక్షల మొత్తం, ఖర్చులో రాజ్య ప్రభుత్వపువాటా క్రింద కేటాయించబడింది. ఈ జిల్లాలో ప్రస్తుతం ఉన్న 6 ఫీల్డు టీములు 6 మాసాలపాటు పనిచేస్తాయి. అందుకోసం రు. 1.06 లక్షల మొత్తం కేటాయించ బడింది.

## ఆరోగ్య ప్రచారం

ప్రజలకు ఆరోగ్యవిషయాలను తెలియ జెప్పేటందుకు 1957—58 లో ప్రజారోగ్యశాఖ డైరక్టరు కార్యాలయంలో ఒక కేంద్ర ఆరోగ్య ప్రచార సంస్థ

---

*క్రొత్త ఢిల్లీలోని మలేరియా సంస్థ డైరక్టరు యీ సంవత్సరం క్రొత్త యూనిట్లనుస్థాపించరాదని సలహా యివ్వడంవల్ల యీ రెండు యూనిట్లను ఏర్పాటు చేయటం విరమింప బడింది.

స్థాపించబడింది రెండు వ్యాన్లు కొనబడ్డాయి. ఇంతకుముందు కొన్న 11 జీపులను, అంటువ్యాధుల నివారణగురించి ప్రచారంచేయడానికి ఉపకరించే రెండు వ్యానులను నిర్వహించడం జరిగింది. 1958—59 లో ఈ పథకాన్ని కొనసాగించడానికి న్యూఢిల్లీలోని వర్కింగు గ్రూపు సమ్మతించలేదు. అయినప్పటికీ 1959—60 లో జిల్లాలలో ప్రస్తుతంఉన్న 11 జీపులను 4 వ్యానులను నిర్వహించడానికి, హైదరాబాదులోని కేంద్ర ఆరోగ్య ప్రచారసంస్థను కొనసాగించడానికి, 8 క్రొత్త వ్యానులను కొనడానికి, మూడు ప్రచార సంస్థలను నెలకొల్పడానికి రూ. 4.15 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 0.54 లక్ష మొత్తం, ఒక జీపును, రెండు వ్యానులను నిర్వహించడానికి, ఒక ఆరోగ్య ప్రచారసంస్థను నెలకొల్పడానికి ఈ జిల్లాకు కేటాయించబడింది.

### విద్యార్థి ఆరోగ్య కేంద్రాలు

పాఠశాలలకు పోయే పిల్లల ఆరోగ్య సంరక్షణంకోసం, ప్రస్తుతం ఉన్న రెండు పాఠశాలల ఆరోగ్యకేంద్రాలను కొనసాగించడానికి, మరొక రెండు కేంద్రాలను నెలకొల్పడానికిగాను, ఈ సంవత్సరపు ప్రణాళికలో రూ. 2.37 లక్షలమొత్తం కేటాయించబడింది. ఇందులో రూ. 0.605 లక్షమొత్తం ప్రస్తుతం ఉన్న విద్యార్థి ఆరోగ్యకేంద్రాన్ని కొనసాగించడానికి ఈ జిల్లాలో వినియోగించబడును.

## గ్రామీణ, పట్టణ నీటి సరఫరా

### పట్టణ నీటిసరఫరా, మురుగు పారుదల పథకాలు

స్థానికసంస్థలకు సంబంధించిన పట్టణ నీటిసరఫరా, మురుగుపారుదల పథకాలకోసం భారత ప్రభుత్వంవారు రు. 102.446 లక్షల మొత్తాన్ని (రు. 82.446* లక్షల మొత్తం కేంద్రప్రణాళికక్రింద, రు. 20.00 లక్షలమొత్తం రాష్ట్రప్రణాళికక్రింద) ఋణ సహాయంగా యిస్తారని ఆశించబడుతున్నది.

---

*ఇందులో రు. 5.446 లక్షల మొత్తం, యీ పథకానికిగాను 1957—58 సంవత్సరంలో కేటాయించబడిన మొత్తంలో ఖర్చుపెట్టబడకుండా మిగిలి పోయినట్టిది.

ఇందులో రు. 41.270 లక్షల మొత్తం కార్పొరేషను పథకాలకుగాను ప్రత్యేకించబడింది. మిగత మొత్తంలో రు. 3 560 లక్షల మొత్తం క్రిందిపథకాలకుగాను ఈ జిల్లాలో వినియోగించబడుతుంది.

| పథకం పేరు | | కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. అనకాపల్లి నీటిసరఫరా పథకం | .... | 1.000 |
| 2. విజయనగరం నీటిసరఫరా అభివృద్ధి పనులు | | 0.050 |
| 3. గంభీరాం గెడ్డ రిజర్వాయరు పథకం | .... | 1,000 |
| 4. క్రొత్తగోస్తాని పథకం | .... | 1.500 |
| | మొత్తం | 3.560 |

## గ్రామీణ ప్రాంతాలకు నీటి సరఫరా, పారిశుధ్య సౌకర్యాలకోసం జాతీయ పథకం

గ్రామీణ ప్రజలకు మంచినీటి, పారిశుధ్య సౌకర్యాలను కలుగజేయడమే ఈ పథకం ఉద్దేశం. ఆంధ్ర ప్రాంతానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 13.34 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రూ. 5.49 లక్షల మొత్తం కార్యక్రమాన్ని తీవ్రంగా అనుసరించడంకోసం మొదటిప్రణాళికలో ప్రారంభించిన ఈ క్రింది నాలుగు యూనిట్లను కొనసాగించడానికి కేటాయించ బడింది. వీటిక్రింద 459 గ్రామాలున్నాయి.

1. విశాఖపట్నం జిల్లాలోని విశాఖపట్నం యూనిట్టు.
2. గుంటూరు జిల్లాలోని మాచెర్ల యూనిట్టు.
3. అనంతపురం జిల్లాలోని కదిరి యూనిట్టు.
4. కర్నూలు జిల్లాలోని పత్తికొండ యూనిట్టు.

# గృహనిర్మాణం

## మురికి పేటల నిర్మూలన, పాకీవారికి గృహవసతి

అనారోగ్యకరమైన మురికి పేటలు ఏర్పడకుండా అరికట్టేటందుకు గాను మురికి పేటలలో నివసించే వారి కోసం మురికిపేటల నిర్మూలన పథకాన్ని భారత ప్రభుత్వం వారు రూపొందించారు. విశాఖపట్టణంలో ఈ పథకాన్ని అమలుపరడానికి ఈ జిల్లాకు రూ. 0.66 లక్ష మొత్తం కేటాయించ బడింది. మొత్తం అంచనా ఖర్చులో భారత ప్రభుత్వం వారు నూటికి 75 వంతులు ఇస్తారు. అందులో నూటికి 50 వంతులు ఋణం క్రింద, 25 వంతులు సబ్సిడీ క్రింద ఇస్తారు. రాజ్య ప్రభుత్వం మాచింగు గ్రాంటు క్రింద నూటికి 25 వంతులు భరిస్తుంది.

ఈ మొత్తానికదనంగా యీ జిల్లలో పాకీవారికోసం 40 ఇళ్ళను నిర్మించడం కోసం ప్రణాళికలో రు. 1.54 లక్షల మొత్తం (కేంద్ర ప్రభుత్వ సహాయం కలుపుకొని) కేటాయించ బడింది.

## ప్రభుత్వ సహాయంతో పారిశ్రామిక గృహవసతి

భారతప్రభుత్వం వారు ఋణాలు, సబ్సిడీల రూపంలో ఇచ్చే ఆర్థిక సహాయంతో పారిశ్రామిక కార్మికుల ఇండ్ల నిర్మాణానికి ఈ పథకం ఉద్దేశించ బడింది. ఈ పథకం క్రింద రెండు రకాల ఇండ్లు నిర్మింప బడుతున్నాయి, ఒక గది ఇల్లు రూ 3,300లు రెండు గదుల ఇల్లు రూ. 3,850ల వ్యయంతో నిర్మింప బడుతున్నాయి. ఇందులో భూమి ఖరీదు, అభివృద్ధి ఖర్చులు చేరి వుంటాయి. నీటి సరఫరా, పారిశుధ్యం, విద్యుచ్ఛక్తి ఫిట్టింగులువంటి వాటికయ్యే ఖర్చులు ఇందులో చేరవు. ఈ పథకం క్రింద జరిగే పనిని కొనసాగించడానికి 1959—60 ప్రణాళికలో రు. 21.88 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఈ మొత్తం నంద్యాలలో 50 ఇండ్లను, బుగ్గన్నపల్లిలో 110 ఇండ్లను, విశాఖపట్నంలో 150 ఇండ్లను, గుంటూరులో 150 ఇండ్లను, గుంతకల్లులో 100 ఇండ్లను, రాజమండ్రిలో 100 ఇండ్లను, ఏలూరులో 100 ఇండ్లను నిర్మించే పనిని ప్రారంభించడానికి వినియోగింప బడుతుంది.

## పట్టణాలలో గృహ వసతి

### సహకార సంఘాలు

పట్టణ గృహ నిర్మాణ సహకార సంఘాల సభ్యులకు ఇండ్లను నిర్మించుకోవడానికి దీర్ఘకాలిక ఋణాల నివ్వడంద్వారా పట్టణ ప్రాంతాలలోని ఇండ్ల కొరతను తీర్చడానికి ఉద్దేశింప బడింది. ఈ సంవత్సరంలో ఆంధ్ర ప్రాంతంలో క్రొత్తగా 340 ఇండ్లను నిర్మించుకోవడానికి ఋణాల క్రింద ఇచ్చేటందుకు రు. 20.00 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 3.50 లక్షల మొత్తం యీ జిల్లాలో 55 ఇళ్ళ నిర్మాణానికిగాను ప్రత్యేకించ బడింది

### స్థానిక సంస్థలు

ఈ పథకం క్రింద ఇండ్లనిర్మాణం కోసం రు. 4,100 ల చొప్పున అంటే ఒకొక్క ఇంటికి అయ్యే ఖర్చులో 80 శాతం స్థానిక సంస్థలకు ఋణాలు మంజూరు చేయబడుతున్నవి. 1959–60లో విశాఖపట్టణంలో 30 ఇండ్ల నిర్మాణానికి ఋణంక్రింద ఇచ్చేటందుకు ఈ జిల్లాకు రు. 1.458 లక్షల మొత్తం కేటాయించ బడింది.

# కార్మికులు - కార్మిక సంక్షేమం

## ఉద్యోగ సమాచార సేకరణ

ఈ పథకం యొక్క లక్ష్యాలేవంటే:

1 ఏ రకం ఉద్యోగులు కొరతగా ఉన్నారన్న విషయాన్ని ఎంప్లాయిమెంటు అధికారులు ఖచ్చితంగా నిర్ణయించడం కోసం ఇంకా ఎక్కువ వివరాలను వారికి అందచేయడం.

2. విద్యాభ్యాసం పూర్తిచేసిన వారికి, ఉద్యోగాన్వేషణలో ఉన్నవారికి ఉద్యోగాల విషయంలోను, ఉద్యోగ అవకాశాల విషయంలోను సలహానిచ్చేటందుకు సమాచారాన్ని అందచేయడం.

3. ఉద్యోగ సాధక కేంద్ర ప్రాంతంలోగాని, నిర్ణీత ఎంప్లాయిమెంటు మార్కెట్లుగా పరిగణింప బడే ఇతర ప్రాంతాలలో గాని ఉద్యోగ నియామావకాశాలలో వచ్చే మార్పులు గమనించడానికి పద్ధతులను రూపొందించడం.

4. ప్రతి పరిశ్రమ, వృత్తులలో ఉండే ఉద్యోగ, నిరుద్యోగాల పోకడలను ముందుగా సూచించడం.

ఈ పథకం, 1957-58లో 5 ప్రధాన ఉద్యోగ సాధక కేంద్రాల్లో అమలు పరచబడింది. ఆ కేంద్రాలేవంటే హైదరాబాదు, వరంగల్లు, విశాఖపట్నం, విజయవాడ, కర్నూలు. వీటి కేంద్ర యూనిట్టు హైదరాబాదులో ఉన్న నేషనల్ ఎంప్లాయిమెంటు సర్వీసు డైరెక్టరేటులో ఏర్పాటు చేయబడింది. 1958-59లో ఈ పథకం, కాకినాడ, గుంటూరు, నిజామాబాదులలోని జిల్లా ఉద్యోగ సాధక కేంద్రాలకు విస్తరింప చేయబడింది. 1959-60లో విశాఖపట్నం, విజయవాడ, కాకినాడ, గుంటూరు, వరంగల్లులోని ప్రైవేటు రంగాన్ని పరిశీలించడానికి తలపెట్టబడింది. ఇందుకోసం, పైన తెలుప బడిన ఎక్స్ఛేంజిలలో అదనపు సిబ్బందిని నియమించడం, డైరెక్టరేటులోని సెంట్రల్ యూనిట్టును ఒక సీనియరు అధికారి ఆజ్ఞాయిషీ క్రింద ఉంచడంద్వారా సెంట్రల్ యూనిట్టు పటిష్ఠం చేయటం జరుగుతుంది. మిగిలిన అన్ని కేంద్రాలలోకూడ సిబ్బందిని పెంచడానికి ఉద్దేశింప బడింది. ఈ కేంద్రాలన్నిటిలోను ఒక్కొక్క గుమస్తాను అదనంగా నియమిస్తారు. ఈ పథకానికి అయ్యే ఖర్చులో కేంద్ర ప్రభుత్వం వారు భరించే రు. 0.47 లక్షలతోకూడా రాష్ట్ర ప్రభుత్వ వాటా క్రింద 1959—60 ప్రణాళికలో రు. 0.31 లక్ష మొత్తం కేటాయించ బడింది. మొత్తం రు. 0.78 లక్షలోను రు. 0.09 లక్ష మొత్తం ఈ జిల్లాలోని కార్యక్రమం క్రింద వినియోగించ గలుగుతుంది.

## కార్మిక సంక్షేమం కేంద్రాలు

ఈ సంవత్సరపు ప్రణాళికలో రు 2.50 లక్షల మొత్తం ఈ పథకం కోసం కేటాయించ బడింది. అందులో రు. 1.555 లక్షల మొత్తం, విశాఖపట్నంలో ఒక (ఎ) టైపు కార్మిక సంక్షేమ కేంద్రాన్ని నెలకొల్పటానికి, యీ కేంద్రానికి శాశ్వత భవనాలను నిర్మించడానికిగాను ప్రత్యేకించ బడింది.

## ఉద్యోగుల భీమా పథకం.

కార్మికులకు మాత్రమే వైద్య సదుపాయాలను కలుగచేసే ఉద్దేశంతో ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో ఈ పథకం 1955 లో అమలు జరప బడింది. 1957—58 లో భారత ప్రభుత్వం వారి కోరిక మీద, భీమా చేసిన కార్మికుల కుటుంబాలకు కూడ ఈ పథకం వల్ల కలిగే ప్రయోజనాలను విస్తరింప జేయ డానికి ఉద్దేశింప బడింది. కాని ఈ పథకాన్ని ఆ సంవత్సరం అమలు పరచ డానికి వీలులేక పోయింది. ఈ పథకం క్రింద వైద్య సౌకర్యాలను 23-1-1959 లగాయతు రాజ్యంలోని భీమా చేసిన కార్మికుల కుటుంబాలకు కూడ విస్తరింప చేయబడ్డాయి. పార్ట్ టైం వైద్యశాలలు చాల వరకు ఫుల్ టైం వైద్య శాలలుగా మార్చబడ్డాయి. ఈ పథకం కోసం కేటాయించ బడిన రు. 1.80 లక్షలలోను రు. 0.40 లక్ష మొత్తం, ఫుల్ టైం వైద్యశాలల ఏర్పాటుకు లేక ప్రస్తుతం పార్టుటైం వైద్యశాలలుగా ఉంటున్న వాటిని ఫుల్ టైం వైద్య శాలలుగా మార్చడానికి ఈ జిల్లాకు కేటాయించ బడింది. ఇందువల్ల భీమా చేసిన కార్మికులకు కుటుంబాలకు వైద్యసౌకర్యాల్ని విస్తరింప చేయడానికి వీలు కలుగుతుంది.

## వృత్తిపనివారికి శిక్షణ సౌకర్యాల విస్తరణ
## విశాఖపట్టణంలో పారిశ్రామిక శిక్షణ కేంద్రం

144 మంది విద్యార్థులకు చేర్చుకోవడానికి వీలుగా యీ సంస్థ 1957—58 లో ప్రారంభించబడింది. 1958—59 లో "డబుల్ షిఫ్టు" విధానం యీ సంస్థలో ప్రవేశపెట్టబడింది. ఇంకా 144 మంది విద్యార్థులు యిందువల్ల చేర్చు కోవడానికి వీలయ్యింది. 1959—60 ప్రణాళికలో రాజ్య ప్రభుత్వ వాటాక్రింద రు. 2.14 లక్షల మొత్తం కేటాయించబడింది. కేంద్ర ప్రభుత్వవాటా రు. 3 21 లక్షలు. భవనాలు నిర్మించటానికి, పరికరాలను సమకూర్చడానికి, సిబ్బందికి జీతాలు మొదలయిన వాటిక్రింద యీ డబ్బు వినియోగించటానికి ప్రతిపాదింప బడింది.

## అప్రెంటీసులకు శిక్షణ యివ్వడానికి సంబంధించిన పథకం

ఈ పథకంక్రింద విశాఖపట్టణంలోని హిందుస్థాన్ నౌకా నిర్మాణ కేంద్రంలో శిక్షణ కార్యక్రమం ఒకటి 1957—58 లో ప్రారంభించబడింది.

120 మంది అభ్యర్థులు శిక్షణ నిమిత్తం చేర్చుకోబడినారు, 1959—60 లో యీ పథకాన్ని కొనసాగించడంకోసం కేంద్రప్రభుత్వం యిచ్చే రు. 0.58 లక్ష కదనంగా యింకా రు. 0.39 లక్ష కేటాయించబడింది. సిబ్బందికిజీతాలు, శిక్షణ పొందేవారికి స్టయిఫండులు, హిందుస్థాన్ నౌకా నిర్మాణకేంద్రానికి చెల్లించవలసిన ఛార్జిలక్రింద పై డబ్బు వినియోగించబడుతుంది.

# వెనుకబడినతరగతులు, షెడ్యూల్డుకులాలసంక్షేమం.

## షెడ్యూల్డు కులాలు-షెడ్యూల్డు కులాల విద్యార్థులకు స్కాలరుషిప్పులు.

ఈ పథకంక్రింద హరిజన విద్యార్థులకు ఇతర అర్హులైన కులాల విద్యార్థులకు అన్ని తరగతులలోను స్కాలరు షిప్పులు మంజూరు చేయబడుతున్నాయి. తల్లి దండ్రుల ఆదాయం ఉన్నత పాఠశాల విద్యార్థుల విషయంలో రు. 1,500లకు, కళాశాల విద్యార్థుల విషయంలో రు. 1,800లకు మించకుండా ఉంటే రుసుం చెల్లించనవసరంలేకుండా మాఫీ చేయబడుతుంది. 1959—60 లో ఇదివరకు మంజూరుచేసిన స్కాలరుషిప్పులను కొనసాగించడమే కాకుండా సుమారు 1,600 అదనపు స్కాలరు షిప్పులను మంజూరు చేయడానికి రు. 4.90 లక్షల మొత్తం కేటాయించబడింది. స్కాలరు షిప్పులు ఈ జిల్లాలోని అర్హులైన విద్యార్థులకుకూడా ఇవ్వబడతాయి.

### షెడ్యూల్డు కులాలవారికి సబ్సిడైజుడు హాస్టళ్లు

ఆంధ్ర ప్రాంతంలో ప్రభుత్వ సహాయంతో నడుపబడే హాస్టళ్లు 438 ఉన్నాయి. విద్యా సంవత్సరానికి విద్యార్థికి రు. 150 చొప్పున బోర్డింగు గ్రాంట్లు వెనుకబడిన తరగతుల, హరిజనుల విద్యార్థులకు ఏటా ఇవ్వబడుతున్నాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో 670 అదనపు బోర్డింగు గ్రాంట్లు మంజూరు చేయ్యడానికి రు. 1.00 లక్ష మొత్తం కేటాయించ బడింది. బోర్డింగు గ్రాంట్లు ఈ జిల్లాలోని హాస్టళ్లకు కూడ ఇవ్వబడతాయి.

### షెడ్యూల్డు కులాలవారికి ప్రభుత్వ హాస్టళ్లు.

ఈ జిల్లాలో విజయనగరం, చోడవరం, ఎలమంచిలి, నరసిపట్నం, విశాఖపట్టణంలలో ఉన్న హాస్టళ్ళు 1959—60 సంవత్సరంలో రు. 0.38 లక్ష వ్యయంతో నిర్వహింప బడతాయి.

## పాఠశాలల, హాస్టళ్ళ భవనాల నిర్మాణం, మరమ్మతులు.

ఆంధ్ర ప్రాంతంలోని సాంఘిక సంక్షేమ పాఠశాలలు, సాంఘిక సంక్షేమ శాఖ అజ్మాయిషీ క్రిందగల సబ్సిడీ పొందే హాస్టళ్లు అద్దె భవనాలలో నెలకొల్పబడ్డాయి. అందువల్ల హరిజనుల సౌకర్యార్థం నడపబడే సాంఘిక సంక్షేమ పాఠశాలలకు, సబ్సిడీపొందే హాస్టళ్లకు పక్కా భవనాలను నిర్మించడానికి తలపెట్టబడింది. 1959-60లో 25 పాఠశాలభవనాల నిర్మాణం కోసం రు. 1.00 లక్ష మొత్తం కేటాయించ బడింది. అందులో ఒక భవనం రు. 0.06 లక్ష వ్యయంతో ఈజిల్లాలోనిర్మించ బడుతుంది.

## పారిశుద్ధ్య సౌకర్యాల ఏర్పాటు

హరిజనవాడలు సామాన్యంగా అపరిశుభ్రంగా ఉంటాయి. ఈ వాడలను ఆరోగ్యకరంగా చేయటానికి బాటలు, మురుగుదొడ్లు, స్నానపుగదులు, మంచినీటి బావులు మొదలయినవాటిని ఏర్పాటుచేయటం అవసరం. ఇందుకుగాను ఆంధ్ర ప్రాంతంలో 217 మంచినీటి బావులను త్రవ్వటానికి 1959-60లో రు. 4.34 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో 20 బావులు యీ జిల్లాలో రు 0.40 లక్ష వ్యయంతో త్రవ్వబడతాయి.

## ఇళ్ల స్థలాల సేకరణ

ఈ పథకం క్రింద ఇళ్ల స్థలాలను సేకరించి వాటినిఉచితంగా హరిజనులకు యివ్వటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 8.00 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.65 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించబడింది.

## ప్రచారం

అస్పృశ్యతను నిర్మూలించటంకోసం దానివల్ల కలిగే అనర్థాలను గురించి ప్రచారం చేయడానికి, వీటికి సంబంధించి వ్రాయబడిన ఉత్తమమయిన నాటకాలకు, యక్షగానాలకు బహుమతుల నివ్వటానికి, పత్రికలకు సబ్సిడీలు, ఇవ్వటానికి, పోస్టర్లు, కరపత్రాలను ముద్రించటానికి, హరిజన దినోత్సవాలు వర్ణాంతర భోజనాలు ఏర్పాటు చేయటానికిగాను 1959—60 ప్రణాళికలో

రు. 0.40 లక్ష మొత్తం కేటాయించబడింది. ఈ జిల్లాలో యీ పథకాన్ని అమలు పరచటంకోసం రు. 0.035 లక్ష ప్రత్యేకించబడింది.

## స్వచ్ఛంద సంస్థలకు సహాయం

హరిజన సేవక సంఘము, భారత సేవక సమాజము, గిల్డ్ ఆఫ్ సర్వీసు రెడ్ క్రాస్ సొసైటి, రోటరీ క్లబ్బులు మొదలయిన అనేక స్వచ్ఛంద సంస్థలు హరిజనోద్ధరణకు పాటు పడుతున్నాయి. ఈ సంస్థలకు తగు ప్రోత్సాహం యిచ్చేటందుకు ఆర్థిక సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.60 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలుకూడ యీ సహాయాన్ని పొందవచ్చు.

## గృహనిర్మాణ పథకం

హరిజనులు ఎంత బీదవారంటే వారికి యిళ్ల స్థలాలను ఉచితంగా యిచ్చినప్పటికి యిళ్లు స్వంతంగా కట్టుకోలేని స్థితిలో ఉన్నారు. ఇందువల్ల హరిజనులు యిళ్లు కట్టుకొనేటందుకు వారికి సబ్సిడీలను, ఋణాలను యివ్వటానికి ప్రతిపాదించబడింది. ఒక్కొక్క యింటికి రు. 750లు ధన సహాయం చేయుటానికి ప్రతిపాదించబడింది. ఇందులో రు. 250 లు సబ్సిడీగాను, రు. 500 లు ఋణంగాను ఇవ్వటం జరుగుతుంది. అయితే యీ సౌకర్యం పొందే ప్రతివ్యక్తి కొంత లేబరుని, సామాగ్రిని సమకూర్చుకొనవలసి ఉంటుంది. వాటివిలువ పై మొత్తంలో చేరదు. హరిజనులకో కలిసి నివసించేటందుకు యితర కులాలవారిని ప్రోత్సహించేనిమిత్తం, నిర్మించటానికి తలపెట్టిన ఇండ్లలో నూటికి 10 యిళ్లు వెనుకబడిన తరగతులవారికి ప్రత్యేకించబడుతున్నాయి. ఈ జిల్లాలో 54 యిళ్లను నిర్మించటంకోసం 1959—60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.48లక్ష కేటాయించబడింది.

## వెనుకబడిన తరగతులు

### వెనుకబడిన తరగతుల విద్యార్థులకు స్కాలరుషిప్పులు

వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు స్కాలరుషిప్పులు యివ్వటంకోసం రాజ్యప్రభుత్వంవారు ఏటా రు. 4.00 లక్షలు ఖర్చుచేస్తున్నారు. ఆంధ్ర

ప్రాంతంలోని వివిధ పాఠశాలల్లోను కళాశాలల్లోను చదువుకొంటున్న వెనుకబడిన తరగతుల విద్యార్థులకు అదనంగా యింకా 920 స్కాలరుషిప్పులు యివ్వటంకోసం ఈ సంవత్సరానికి రు. 2.74 లక్షల మొత్తం కేటాయించబడింది ఈ జిల్లాలోని వెనుకబడినతరగతుల విద్యార్థులకుకూడ యీ స్కాలరుషిప్పులు లభ్యమవుతాయి.

## వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు బోర్డింగు గ్రాంటులు

ఉన్నత పాఠశాలల్లోను, కళాశాలల్లోను చదువుకొంటున్న వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకు సబ్సిడైజుడు హాస్టళ్లలో బోర్డింగు గ్రాంట్లు యివ్వబడుచున్నాయి. ఒక్కొక్క విద్యార్థికి విద్యా సంవత్సరానికి రు. 150 లు చొప్పున యీ బోర్డింగు గ్రాంటులు యివ్వబడతాయి. అదనంగా 445 బోర్డింగు గ్రాంటులు మంజూరు చేయటంకోసం 1959—60 సంవత్సరానికి ప్రణాళికలో రు. 0.67 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన విద్యార్థులకుకూడ యీ బోర్డింగు గ్రాంటులు లభ్యమవుతాయి.

## వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలకు మధ్యాహ్న భోజనం

సాంఘిక సంక్షేమ శాఖవారిచే నిర్వహించబడుతున్న పాఠశాలలలో వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలు చేరటాన్ని ప్రోత్సహించేటందుకు, తద్వారా అస్పృశ్యతా నివారణకు దోహదం చేసేటందుకుగాను రెండవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభించబడినినాటినుండి సాంఘిక సంక్షేమశాఖ పాఠశాలల్లో చదువుకొంటున్న వెనుకబడిన తరగతుల పిల్లలకు మధ్యాహ్న భోజనం ఏర్పాటు చేయబడింది. ఈ పథకంకోసం 1959—60 లో రు. 0.50 లక్ష ఖర్చు పెట్టటానికి ప్రతిపాదించబడింది. ఈ జిల్లాలోని వెనుకబడిన తరగతులకు చెందిన పిల్లలకుకూడ యింగుమూలంగా లాభం చేకూరుతుంది.

## విముక్త జాతులు

### విద్య

విముక్త జాతులకు చెందిన పిల్లల తలిదండ్రులు తను పిల్లల విద్యకు కావలసిన సదుపాయాలను కలుగచేసే స్థితిలో లేనందువల్ల యీ పిల్లలు పాఠ

శాలలకు హాజరు కారు. ఇందువల్లయీ పిల్లలకు పుస్తకాలు, పలకలు మొదలగునవి సరఫరా చేయటానికి, స్కాలరు షిప్పులు మంజూరుచేయడానికి, యింతేకాక చిత్తూరు జిల్లాలో విముక్త జాతులవారికోసం నిర్మించబడిన కాలనీలలో ఏర్పాటు చేయబడిన రెండు పార్కులను. రెండు రేడియో సెట్లను నిర్వహించటానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 0.09 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని విముక్తజాతులకు చెందిన పిల్లలకుకూడ యీ పథకం క్రింద లాభం చేకూరుతుంది.

## గృహనిర్మాణం

విముక్తజాతులవారు తమ నివాస గృహాలను నిర్మించుకోవటానికి యీ పథకంక్రింద సహాయం చేయబడుతుంది. వారు తమ పాకలను క్రొత్తగా నిర్మించుకోదలచినట్లయితే రు. 100 లు విలువచేసే నిర్మాణ సామగ్రి సరఫరా చేయబడుతుంది. ప్రస్తుతమున్న యిళ్లనే వారు మరమ్మతు చేసికోదలచినట్లయితే ప్రతి కుటుంబానికి రు. 30 లు నగదు రూపంలో చెల్లించబడుతుంది. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 100 క్రొత్త యిళ్ల నిర్మాణానికి, 100 పాత యిళ్ల మరమ్మతుకుగాను రు. 0.130 లక్ష కేటాయించబడింది.

## వ్యవసాయం చేసుకోవటానికి సహాయం

ఈ పథకంక్రింద విముక్తజాతులవారికి ఆర్థికంగా సహాయపడేటందుకు వారిని వ్యవసాయంలో స్థిరపరచేటందుకుగాను వారికి కాడి ఎద్దులను సరఫరా చేయటానికి, పంపుసెట్లను నెలకొల్పటానికి, పాత బావుల మొదలయినవాటికి మరమ్మతులు చేయటానికి ప్రతిపాదింపబడింది. ఈ జిల్లాకు ఒక జత కాడి ఎద్దులను సరఫరా చేయటంకోసం 1959—60 సంవత్సరానికి రు. 300 లు కేటాయించబడినాయి.

## కుటీర పరిశ్రమలు

విముక్తజాతులవారు తమ వృత్తులను కొనసాగించుకోవటంకోసం యీ పథకంక్రింద వారికి సహాయం చేయబడుతుంది. పరికరాలు, పనిముట్లు,

ముడిపదార్థాల రూపంలో ప్రతివ్యక్తికి రు. 50ల వరకు యీ సహాయం చేయబడుతుంది. ఇందుకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.15 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 750/-లు యీ జిల్లాకు ప్రత్యేకించబడినాయి. ఇందుమూలంగా 15 మందికి లాభం చేకూరుతుంది.

### వైద్య సహాయం

ఈ పథకంక్రింద, విముక్త జాతులకు చెందిన వ్యాధిగ్రస్తులయినట్టి అర్హులైన 50మంది వ్యక్తులకు "డిస్క్రిషనరీ" గ్రాంటులు యివ్వబడతాయి. పై వ్యక్తులు తమకు కావలసిన మందులనుకొనుక్కోవటానికి, యితరఖర్చులకుగాను ఒక్కొక్కరికి రు. 40/-లు చొప్పున యీ గ్రాంటు యివ్వబడుతుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు 0.02 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 80 లు యీజిల్లాకు ప్రత్యేకించబడినాయి. ఈ జిల్లాలో విముక్త జాతులకుచెందిన ఇద్దరు "డిస్క్రిషనరీ" గ్రాంటులు యివ్వటంకోసం యీ డబ్బు వినియోగించబడుతుంది.

## షెడ్యూల్డు తెగల సంక్షేమం

### విద్య

### ప్రభుత్వ సహాయం పొందే హాస్టళ్ళలో బోర్డర్లసంఖ్యను పెంచడం

ప్రభుత్వ సహాయంపొందే హాస్టళ్ళలో చేరడానికివచ్చే ట్రయిబలు విద్యార్థుల సంఖ్య ఎక్కువవుతున్నందువల్ల చింతపల్లి, కూనవరంలలో ఉన్న హాస్టళ్ళలో బోర్డర్ల సంఖ్య 1956—57లో ఎక్కువచేయబడింది. చింతపల్లిలోని హాస్టలుకు 7, కూనవరంలోని హాస్టలుకు 15 బోర్డింగు గ్రాంటులు అదనంగా యివ్వబడినాయి. 1959—60 లో యీ అదనపు గ్రాంటులు కొనసాగించబడతాయి. ఇందుకు ప్రణాళికలో రు. 0.02 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 650/—లు యీ జిల్లాకు కేటాయించ బడినాయి.

### పాడేరులోను, మారేడుమిల్లిలోను ప్రభుత్వ హాస్టళ్ళను ఎర్పాటుచేయడం

ట్రయిబలు పిల్లంకోసం తూర్పుగోదావరి జిల్లాలోని పుల్లంగిలో ఒకటి విశాఖపట్టణం జిల్లాలోని పాడేరులో ఒకటి— మొత్తం రెండు ప్రభుత్వ హాస్టళ్ళు

1956—57 లో ప్రారంభించబడినాయి. ఇవి యీ సంవత్సరంలో మొత్తం 50 మంది బోర్డర్లతో కొనసాగించబడతాయి. ఇందుకు రు. 0.05 లక్ష వ్యయమవుతుంది. ఇందులో రు. 0.025 లక్ష ఈ జిల్లాకు కేటాయించబడింది. పుల్లంగిలో ప్రారంభించబడిన హాస్టలు 1958—59 లో మారేడు మిల్లికి మార్చబడింది.

## ప్రభుత్వ సహాయం పొందే హాస్టళ్ళను ప్రభుత్వ బోర్డింగు హోములుగా మార్చడం

ప్రభుత్వబోర్డింగు హోములుగా మార్చబడిన యీ జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాల్లో ఉన్న నాలుగు ప్రభుత్వ సహాయం పొందే హాస్టళ్ళను కొనసాగించడంకోసం 1959—60 సంవత్సరానికి రు. 0.0468 లక్ష కేటాయించబడింది.

ఈ జిల్లాలోని ప్రభుత్వ సహాయంపొందే హాస్టళ్ళను ప్రభుత్వ బోర్డింగు హోములుగా మార్చడానికి, బోర్డింగు ఛార్జిని 41 నయాపైసలనుండి 50 నయాపైసలకు పెంచడానికిగాను యింకా రు. 0.0688 లక్షకూడ కేటాయించబడింది.

## పాఠశాలలలో చదువుకొంటున్న ట్రయిబలు పిల్లలకు పుస్తకాలు, పలకలు, దుస్తులసరఫరా.

ట్రయిబలు ప్రజలు తమ పిల్లలకు చదువుచెప్పించేటందుకు ఉత్సాహం కలిగించే నిమిత్తం ప్రాథమికపాఠశాలలోను, ప్రాథమికోన్నత పాఠశాలలోను చదువుకొంటున్న ట్రయిబలు పిల్లలకు పుస్తకాలు, పలకలు, దుస్తులు సరఫరా చేయడానికి సంబంధించిన పథకాన్ని 1959—60లో రు. 0.4067 లక్షవ్యయంతో కొనసాగించడానికి ప్రతిపాదించబడింది. ఈ పథకం వల్ల 6,762 మంది పిల్లలకు లాభంచేకూరుతుందని ఆశించబడుతున్నది.

## ఏజెన్సీ ప్రాంతాలలో పాత ప్రాథమిక పాఠశాలలను కొనసాగించడం; క్రొత్తవాటిని స్థాపించడం

ట్రయిబలు పిల్లల సౌకర్యార్థం ఈ జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాలలో యింతకు ముందు స్థాపించిన 8 ప్రాథమిక పాఠశాలలను కొనసాగించడానికి

క్రొత్తగా నాలిగింటిని స్థాపించడానికిగాను 1959—69 ప్రణాళికలో రు .0.22972 లక్ష కేటాయించబడింది.

## ఏజెన్సీ ప్రాంతాలలోని పాఠశాలలకు, హాస్టళ్ళకు పక్కా భవనాల నిర్మాణం

ఏజెన్సీ ప్రాంతాలలోని పాఠశాలలకు శాశ్వతమైన భవనాలు లేనందు వల్ల యీ జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాలలో 1959—60 లో 4 పక్కాభవనాల్ను నిర్మించడానికి ప్రతిపాదించబడింది. ఇందుకు యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.36 లక్ష కేటాయించబడింది.

## పాడేరులోని మాధ్యమిక పాఠశాలను ఉన్నత పాఠశాల స్థాయికి పెంచటం

పాడేరులోని ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలను ఉన్నత పాఠశాల స్థాయికి పెంచడంకోసం యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.10 లక్ష కేటాయించబడింది.

## దౌనూరులో ఉన్న ప్రభుత్వ బోర్డింగు హోములో బోర్డర్ల సంఖ్యను పెంచడం; భవనాలు నిర్మించడం

విశాఖపట్టణం జిల్లా దౌనూరులో ఉన్న ప్రభుత్వ బోర్డింగు హోములో బోర్డర్ల సంఖ్యను పెంచడానికి, యీ బోర్డింగుహోముకోసం ఒక పక్కా భవనాన్ని నిర్మించేటందుకుగాను ప్రణాళికలో రు. 5,556లు కేటాయించబడినాయి.

## శృంగవరపుకోటలోని బోర్డు ఉన్నత పాఠశాలకు అనుబంధించబడిన నాన్-బేసిక్ శిక్షణ విభాగాన్ని బేసిక్ శిక్షణ విభాగంగా మార్చడం

శృంగవరపుకోటలోని బోర్డు ఉన్నత పాఠశాలకు అనుబంధించబడిన నాన్ బేసిక్ శిక్షణవిభాగాన్ని బేసిక్ శిక్షణవిభాగంగా మార్చడానికి, విశాఖపట్టణం జిల్లాలోని అరకులోయలో ఉన్న ప్రభుత్వ మాధ్యమిక పాఠశాలకు దీనిని మార్చడానికిగాను రు. 0.06 లక్ష కేటాయించ బడింది.

## విశాఖపట్టణం జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాలకోసం స్కూళ్ళ డిప్యూటీ ఇన్స్పెక్టర్ల నియామకం

విశాఖపట్టణం జిల్లాలోని ఏజెన్సీప్రాంతాల్లో పనిచేయుటకు 5గురు స్కూళ్ళ డిప్యూటీ ఇన్స్పెక్టర్లను నియమించడంకోసం యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.24 లక్ష కేటాయించ బడింది.

## వ్యవసాయం

### గిరిజనులకుప్రదర్శనమేస్త్రీలుగా శిక్షణ యివ్వటం

ట్రయిబలు ప్రజలలో గట్టిగా ప్రచారం జరపటం కోసం ఏజెన్సీప్రాంతాలకుచెందిన ఎంపిక చేయబడిన గిరిజనులకు మేలురకం వ్యవసాయ విధానలలో శిక్షణ యివ్వబడుతుంది. ఆతరువాత వారు ప్రదర్శనమేస్త్రీలుగా నియమించ బడతారు. భూమి యున్న గిరిజనులకుకూడ వారు తమ స్వంత నమూనా క్షేత్రాలను స్థాపించుకోవటంకోసం శిక్షణ యివ్వబడుతుంది.

ఈ శిక్షణ వీరికి ఆరకులోయలో సంవత్సరమునకు ఆర్నెల్ల పాటు యివ్వబడుతుంది. 1957—59లలో 76 మంది గిరిజనులు శిక్షణ పొందారు. 1959-60 లో ఈ పథకాన్ని రు. 0.17 లక్షవ్యయంతో కొనసాగించడానికి, 60 మంది గిరిజనులకు శిక్షణ యివ్వడానికి ప్రతిపాదింప బడింది.

### పైలట్ ప్రదర్శన క్షేత్రాలను ప్రారంభించటం

మేలురకం వ్యవసాయ విధానలలో ట్రయిబలు ప్రజలకు శిక్షణ యివ్వడంలో 1957-58 యీ జిల్లాలోని తాజంగిలో స్థాపించ బడిన పైలట్ ప్రదర్శన క్షేత్రం 1959—60లో రు. 0 107 లక్షవ్యయంతో కొనసాగించ బడుతుంది. గిరిజనులకు పంపకం చేసే నిమిత్తం యీ క్షేత్రాలలో మేలురకం విత్తనాలు, అంట్లు, పండ్ల మొక్కలు మొదలయినవి ఉత్పత్తి చేయబడతాయి.

### ఏజెన్సీ ప్రాంతాల్లో ప్రదర్శన యూనిట్లు నెలకొల్పటం

మేలురకం వ్యవసాయ విధానాలను ట్రయిబలు ప్రజలకు తెలిపేటందుకుగాను ఆంధ్రలోని ఏజెన్సీ జిల్లాలలో 1958-59 నుండి మొదలుపెట్టి 8ప్రదర్శన

యూనిట్లను స్థాపించడానికి ప్రతిపాదించ బడింది. అదే ప్రకారం 1958-59 లో విశాఖపట్టణం జిల్లాలోని చింతపల్లిలో ఒక ప్రదర్శన యూనిట్టు ఏర్పాటు చేయబడింది. ఆంధ్రప్రాంతంలో 7 ప్రదర్శన యూనిట్లను ప్రారంభించడానికి, ఇంతకు ముందు స్థాపించినదాన్ని కొనసాగించడానికిగాను 1959—60 ప్రణాళికలో రు. 1.55 లక్షల మొత్తం కేటాయించబడింది. ఇందులో రు. 0.78 లక్ష యీ జిల్లాలోని అరకు లోయ, అనంతగిరి, లోతుగెడ్డలలో మూడు ప్రదర్శన యూనిట్లను ప్రారంభించడానికిగాను ప్రత్యేకించబడింది.

## కుటీర పరిశ్రమలు

### విశాఖపట్టణం జిల్లాలో వెదురు, పేము బుట్టల అల్లకానికి సంబంధించిన పథకం

మేలురకం వెదురు, పేము వస్తువులను తయారుచేయడంలో ట్రయిబలు ప్రజలకు శిక్షణ యివ్వడంకోసం విశాఖపట్టణం జిల్లాలోని పాడేరులో వెదురు, పేము బుట్టల తయారీకి సంబంధించిన కేంద్రమొకటి 1957—58 లో స్థాపించబడింది. 1957—58 లలో 28 మంది ట్రయిబలు అభ్యర్థులకు శిక్షణ యివ్వబడింది. 1959—60 లో యీ కేంద్రాన్ని కొనసాగించడానికి, 15 మంది ట్రయిబలు ప్రజలకు శిక్షణ యివ్వడానికి ప్రతిపాదింపబడింది. ఇందుకు రు. 0.06 లక్ష కేటాయించబడింది.

## పశుగణాభి వృద్ధి

### సంచార పశువైద్యశాలలు, పశువైద్యశాలలు స్థాపించడం

ఏజెన్సీ ప్రాంతాల్లోని పశువులకు మంచిచికిత్స చేయడానికి, తగినన్ని వ్యాధి నిరోధక చర్యలను తీసికొనేటందుకుగాను అవసరమైన సిబ్బందితోను, మందులు, కుర్చీలు, బల్లలు మొదలయిన కొన్ని సామానులు వగైరాలతో యీ జిల్లాలో ఒక పశువైద్యశాల 1957—58 లో ప్రారంభించబడింది. దీని కొనసాగింపుకుగాను యీ సంవత్సరం రు. 0.0375 లక్ష కేటాయించబడింది.

### చింతపల్లిలో పశుగణాభి వృద్ధి క్షేత్రం

విశాఖపట్టణం జిల్లాలోని చింతపల్లిలో స్థాపించబడిన పశుగణాభివృద్ధి క్షేత్రం 1955 నుండి కొనసాగించబడుతున్నది. 1959—60 లో రు. 1. 92

లక్షల మొత్తం వ్యయంతో ఈ క్షేత్రంలో నియమించబడిన సిబ్బందిని కొనసాగించడానికి, యీ క్షేత్రానికి యింకా అభివృద్ధి పనులను చేయడానికిగాను యీ పథకం క్రింద ప్రతిపాదించబడింది. ఈ జిల్లాలోని ట్రయిబలు ప్రజలకు యీ క్షేత్రం ప్రత్యక్ష ప్రదర్శన కేంద్రంగా ఉపయోగపడుతుంది.

## పశువుల పంపకం

ఆంధ్రప్రాంతంలోని ఏజెన్సీ ప్రదేశాల్లో విస్తారంగా పచ్చిక బీళ్ళున్నాయి. ఈ ప్రాంతాలలో పెంచేటందుకు మేలురకం పశువులను సరఫరా చేయడానికి సంబంధించిన పథకం ఒకటి మొదటి ప్రణాళికా కాలంలో అమలులో ఉండేది. ఈ ప్రాంతాలలో పశుగణాభివృద్ధిని కొనసాగించే నిమిత్తం యీ జిల్లాలో ఒక ఆబోతును, ఒక ఆవును, 7 గొర్రెలను, 100 కోళ్ళను పంపకం చేయడానికి ప్రతిపాదించబడింది. ఇందుకోసం 1959—60 ప్రణాళికలో రు 0.0472 లక్ష కేటాయించబడింది.

## రవాణా సౌకర్యాలు (రోడ్లు)

ఏజెన్సీ ప్రాంతాలలో ఉత్తమ రవాణా సౌకర్యాలను కలిగించడంకోసం 1959—60 ప్రణాళికలో రు. 7.20 లక్షల మొత్తం కేటాయించబడింది. క్రింది పనులు నిర్వహించబడతాయి.

| వరుస సంఖ్య | పథకం పేరు | 1959—60 లో కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | జి. మదుగోలు, లోతుగెడ్డ, లమ్మసింగిల మీదుగా పాడేరు—తాజంగిల మధ్య రోడ్డులేనిచోట్ల రోడ్డు నిర్మించడం; ఉన్న రోడ్లకు అభివృద్ధి పనులు చేయడం. .... | 1.00 |
| 2. | పాడేరునుండి సుజనకోటకు "ఫెయిర్ వెదర్" రోడ్డు నిర్మించడం .... | 1.00 |
| 3. | హుకుంపేట, కించుమండల మీదుగా పాడేరు నుండి ఒరిస్సా సరిహద్దుకు "ఫెయిర్ వెదర్" రోడ్డు నిర్మించడం .... | 1.00 |

| | | |
|---|---|---|
| 4. | లంకపాకలమీదుగా ధారకొండనుండి సూకెంకు రోడ్డు నిర్మించడం .... | 2.00 |
| 5. | సుజనకోటనుండి దుదుమాకు రోడ్డు నిర్మించడం. | 1.00 |
| 6. | పెద్దవలసనుండి కాట్రగడ్డకు రోడ్డు నిర్మించడం | 1.20 |

## గ్రామీణ రోడ్లు

### ఏజెన్సీ గ్రామాంలో చిన్నతరహా గ్రామీణ రోడ్లను నిర్మించడం; ప్రస్తుత మున్నవాటికి మరమ్మతులు చేయడం.

ఈ జిల్లాలోని ఏజెన్సీప్రాంతాల్లో చిన్నతరహాగ్రామీణ రోడ్లను నిర్మించడానికి, ప్రస్తుతమున్న వాటికి మరమ్మతులు చేయడానికిగాను 1959-60 ప్రణాళికలో రు. 0.08 లక్ష కేటాయించ బడింది.

## భూస్థిరీకరణ

ట్రయిబలు ప్రజలను శాశ్వతంగా వ్యవసాయంలో స్థిరపరచడానికి, వారిచేత పోడు వ్యవసాయాన్ని మాన్పించేటందుకు గాను క్రిందికాలనీలలో పాకలను నిర్మించి. భూములను సాగులోనికి తెచ్చి వాటిని ట్రయిబలు కుటుంబాలకు కేటాయించడానికి ప్రతిపాదించ బడింది. 1959-60లో ప్రతి కాలనీకి కేటాయించ బడిన మొత్తం వివరాలు క్రింద యివ్వబడినాయి.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూ. లక్షలలో) |
|---|---|---|
| 1. | తాజంగి భూ స్థిరీకరణ పథకము | 1.50 |
| 2. | మంపకించువానిపాలెం భూ స్థిరీకరణ పథకం | 0.52 |
| 3. | ఎరుకలు, యానాదులు, సుగాలీలకు భూ స్థిరీకరణ పథకం ... | 2.00 * |

## అరకు లోయలోని సిబ్బందికి గృహాల నిర్మాణం; సురక్షిత నీటి సరఫరా సౌకర్యం

అరకులోయలోని వివిధ ప్రభుత్వ శాఖలలో పనిచేస్తున్న సిబ్బందికికోసం పక్కా భవనాల నిర్మాణాన్ని కొనసాగించుటకుగాను 1959—60 ప్రణాళికలో రు. 1.00 లక్ష కేటాయించబడింది.

---

* ఆంధ్రలోని ఏజెన్సీ జిల్లాలకొరకు

## ఏజెన్సీ ప్రాంతాల్లో మత్స్య పరిశ్రమాభివృద్ధి

శాస్త్రీయ పద్ధతుల్లో మత్స్య పరిశ్రమను అవలంబించేటందుకు ట్రయిబలు ప్రజలను ప్రోత్సహించే నిమిత్తం చేపపిల్లలను పంపకం చేయడానికొసం మత్స్య పరిశ్రమాభివృద్ధికిగాను 1959—60 సంవత్సరానికి యీ జిల్లాకు రు. 0.025 లక్ష కేటాయించబడింది.

## నీటిపారుదల

క్రింది నీటి పారుదల పనులను పూర్తిచేయడంకోసం 1959—60 సంవత్సరానికి యీ జిల్లాకు రు. 0.110 లక్ష కేటాయించబడింది. ప్రతి పథకానికి చేయబడిన కేటాయింపు, నీటిపారుదల జరిగే ప్రదేశం వివరాలుక్రింద యివ్వబడినాయి.

| వరుస సంఖ్య | పథకం పేరు | కేటాయించబడిన మొత్తం (రూపాయలు, లక్షలలో) | పూర్తయింతరువాత నీటి పారుదల జరిగే ప్రదేశం (ఎకరాలలో) |
|---|---|---|---|
| 1. | మదుగుల గ్రామందగ్గర "బ్రిడిల్ పాత్" యొక్క మై. 2/0—2/2 వద్ద నీటిపారుదల చెరువు నిర్మాణం .... | 0.067 | 75 |
| 2. | నందిగూడ గ్రామం దగ్గర "బ్రిడిల్ పాత్" యొక్క మై. 4/0 వద్ద నీటి పారుదల చెరువు నిర్మాణం | 0.043 | 45 |

## విశాఖపట్టణం జిల్లాలో ఆర్థిక మరియు అభివృద్ధి సహకార కార్పొరేషను

ఆంధ్ర షెడ్యూల్డు తెగల సహకార ఆర్థిక మరియు అభివృద్ధి కార్పొరేషను విశాఖపట్టణంలో 1956—57 లో ప్రారంభించబడింది. ఈ కార్పొరేషను, దాని ప్రీ-ప్రైమరీ మార్కెటింగు సంఘాలన్నీ నడపడానికి

నియమించబడిన సిబ్బంది 1959—60 లో కూడ కొనసాగించబడుతుంది. ఇందుకు రు. 2.50 లక్షల మొత్తం కేటాయించబడింది.

## ఏజెన్సీ ప్రాంతాల్లో రేడియోసెట్లను స్థాపించడం

ఏజెన్సీ గ్రామాల్లో 7 రేడియో సెట్లను నెలకొల్పడానికి, యింతకు ముందు నెలకొల్పిన పథ్నాలిగింటిని నిర్వహించడానికిగాను యీ జిల్లాకు 1959—60 సంవత్సరానికి రు. 0.0364 లక్ష కేటాయించబడింది.

## ట్రయిబలు ప్రజలను గురించి తెలిసికోవడం కోసం సాంస్కృతిక పరిశోధన సంస్థ ఏర్పాటు

ట్రయిబలు ప్రజలసమస్యలు, జీవితవిధానాలు, నాగరికతను గురించి తెలిసికోవడంకోసం రు 0.50 లక్ష వ్యయంతో సాంస్కృతిక పరిశోధన సంస్థ నొకదాన్ని 1959—60 లో ఏర్పాటు చేయడానికి ప్రతిపాదింపబడింది.

## భూసార రక్షణ

ట్రయిబలు ప్రజలు అచరిస్తున్న పోడు వ్యవసాయంవల్ల భూసారం తగ్గిపోవడం ఎక్కువయిపోతున్నది. మాచ్కండ్ క్యాచ్మెంటు ప్రాంతంలోని కొండ సాలోవులు పట్టివయిపోతున్నాయి. కొండవాగుల మూలంగా సారవంతమయిన నేల కొట్టుకొనిపోతున్నది. ఇందువల్ల యీ ప్రాంతాల్లో భూసార రక్షణ చర్యలు తీసికోవడంకోసం 1959—60 సంవత్సరానికి రు. 1.20 లక్షల మొత్తం కేటాయించబడింది.

## సహకారం

### అనంతగిరి సహకార సంఘం అభివృద్ధి

మొదటి ప్రణాళికా కాలంలో స్థాపించబడిన అనంతగిరిలోని సహకార సంఘం అభివృద్ధికోసం 1959—60 ప్రణాళికలో రు. 0.18 లక్ష కేటాయించబడింది. ట్రయిబలు ప్రజలకు రు. 25,000లు విలువచేసే గృహావసర వస్తువులు సరఫరా చేయబడతాయి. రు. 20,000 లు విలువచేసే అటవీ ఉత్పత్తులు వారి

నుండి కొనసాగుతాయి. రు. 10,000 ల వరకు ఋణాలు యివ్వబడతాయి, రు. 0.07 లక్ష వ్యయంతో ఒక గిడ్డంగిని నిర్మించడానికికూడ ప్రతిపాదింప బడింది. ఇంతేకాక సంఘంకోసం నియమించబడిన సీనియరు ఇనస్పెక్టరు, జవాను కొనసాగించబడతారు.

## స్త్రీ సంక్షేమం

### ఏజెన్సీ ప్రాంతాల్లో స్త్రీ సంక్షేమ శాఖలను ఏర్పాటుచేయడం

ఆరోగ్యకరమైన, పరిశుభ్రమైన పద్ధతుల్లో నివసించటాన్ని గూర్చి గ్రిజన స్త్రీలకు బోధించేటందుకు, యింతేకాక వారికి తమ కుటుంబాలను ఎలా పొదుపుగాసాగించాలి అన్న విషయాన్నిగురించి, తమ తీరిక కాలాన్ని ఎలా సద్వినియోగం చేసుకోవాలి అన్న విషయంగురించి వివరించటానికిగాను మొదటి ప్రణాళికా కాలంలో స్త్రీ సంక్షేమ కేంద్రాలు నెలకొల్పబడినాయి. రెండవ ప్రణాళికా కాలంలో యింకా 3 కేంద్రాలు 1956—59 ల లో నెలకొల్ప బడినాయి. ఈ సంవత్సరం యింకా 3 కేంద్రాలను నెలకొల్పడానికి ప్రతి పాదింపబడింది. ఇందుకుగాను ప్రణాళికలో రు. 0.56 లక్ష కేటాయించ బడింది. ఇందులో రు. 0.187 లక్ష 1957—58లో పాడేరులో స్థాపించ బడిన కేంద్రాన్ని కొనసాగించేటందుకు, క్రొత్తగా యింకో కేంద్రాన్ని స్థాపించేటం దుకుగాను యీ జిల్లాకోసం ప్రత్యేకించ బడింది.

### ఫీల్డుసిబ్బందికి పునశ్చరణ తరగతులు

ప్రభుత్వంవారిచే నిర్వహించ బడుతున్న వివిధ పథకాలు, అభివృద్ధి కార్యక్రమాన్ని గురించి స్త్రీ సంక్షేమ శాఖయొక్క ఫీల్డుసిబ్బంది తమ పరిజ్ఞా నాన్ని ఎక్కువచేసుకునేటందుకుగాను యీ పథకంక్రింద ఏజెన్సీ ప్రాంతాలలో పునశ్చరణ తరగతులు నిర్వహించ బడతాయి. ఈ సంవత్సరం 5మందికి శిక్షణ యివ్వబడుతుంది. ఇందుకు రు. 0.005 లక్ష కేటాయించ బడింది.

### రోగులకు, అవిటి వారికి సహాయం

కాయకష్టం చేయలేనటువంటి గ్రిజన స్త్రీ రోగులకు సహాయం చేయ డానికి, అవిటి వారికి పునరావాసం కల్పించేటందుకుగాను యీ పథకం ఉద్దేశించ

బడింది. ఇందుకుగాను యీ జిల్లాకు యీసంవత్సరం రు. 0.025 లక్ష కేటాయించ బడింది. ఈ పథకంవల్ల 13 మందిస్త్రీలు లాభం పొందుతారు.

## వైద్యం

### విశాఖపట్టణం జిల్లాలోని వైద్యాధికారులచే పర్యటన

ఏజెన్సీ గ్రామాల్లోని ప్రజలకు వైద్య సహాయం చేయుడంకోసం పెద్ద వలస, సీతంపేటలలో ఉన్న ప్రభుత్వ వైద్యాలయాల అధికారి మెటర్నటీ అసిస్టెంటుతో కలసి పక్షంరోజుల కొకసారి శ్రీకాకుళం, విశాఖపట్టణం జిల్లాలోని ఏజెన్సీ గ్రామాలలో పర్యటిస్తారు. 1057-58లో యీ పథకం ప్రారంభించ బడింది. ఈ సంవత్సరం కొనసాగించ బడుతుంది. ఇందుకు రు. 0.012 లక్ష కేటాయించ బడింది.

### చింతపల్లిలోని వైద్యశాలను 12 పడకలు ఉండే ఆసుపత్రిగా మార్చడం

చింతపల్లిలోని 12పడకలుండే ఆసుపత్రిని కొనసాగించడం కోసం 1959-60 ప్రణాళికలో రు. 0-25 లక్ష కేటాయించ బడింది.

### "ఎమర్జన్సీ వార్డు" తో సుజనకోటలో వైద్యాలయం స్థాపన

గిరిజన ప్రజలకు వైద్య సౌకర్యాలను కలిగించడంకోసం రు. 0.16 లక్షవ్యయంతో 1959-60లో సుజనకోటలో ఒక వైద్యాలయాన్ని "ఎమర్జన్సీ వార్డు" తోసహా స్థాపించడానికి ప్రతిపాదింప బడింది.

### "ఎమర్జన్సీవార్డు"తో జి. మదుగోలులో ప్రభుత్వ వైద్యాలయ స్థాపన

జి.మదుగోలులో ఒక వైద్యాలయం "ఎమర్జన్సీ వార్డు"తో సహా 1957—58 లో ప్రారంభించ బడింది. దీని కొనసాగింపుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.15 లక్ష కేటాయించ బడింది.

### కృష్ణదేవిపేటలోని వైద్యాలయాన్ని 12 పడకలు ఉండే స్త్రీల, పిల్లల ఆసుపత్రిగా మార్చడం, సిబ్బందికి ఇళ్ళ నిర్మాణం

కృష్ణదేవిపేటలోని వైద్యాలయం 12 పడకలు వుండే స్త్రీల, పిల్లల ఆసుపత్రిగా మార్చబడింది. 1959-60లో దీనిని కొనసాగించడానికి ప్రతిపాదింప

బడింది. ఇందుకు యీ సంవత్సరం ప్రణాళికలో రు. 0.16 లక్ష కేటాయించ బడింది.

## ప్రజారోగ్యం

### ఎజెన్సీ ప్రాంతాలలో మలేరియా నివారణ చర్యలు

ఆంధ్రలోని ఏజెన్సీ ప్రాంతాల్లో ప్రజలకు ఎక్కువగా తగిలే వ్యాధి మలేరియా. మొదటి ప్రణాళికా కాలంలో మలేరియా నివారణ చర్యలు తీసికోబడినాయి. రెండవ ప్రణాళికా కాలంలో యీ చర్యలు కొనసాగించ బడుతున్నాయి. ఆంధ్రలోని యితర ఏజెన్సీ ప్రాంతాలకుకూడ యీ పథకాన్ని విస్తరింపచేయటంకోసం యీసంవత్సరం రు. 5.00లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు, 1.88లక్షల మొత్తం యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

### ఎజెన్సీ ప్రాంతాలలో ప్రసూతి, శిశు ఆరోగ్య కేంద్రాలు

శిశు మరణాలను అరికట్టేటందుకుగాను 1957--59 సంవత్సరాలలో 3 ప్రసూతి, శిశు ఆరోగ్య కేంద్రాలు ప్రారంభించ బడినాయి. ఈసంవత్సరం ఇంకో కేంద్రాన్ని ప్రారంభించడానికి తలపెట్టబడింది. పాత కేంద్రాలను కొనసాగించడానికి క్రొత్త కేంద్రాలను ప్రారంభించడానికిగాను 1959—60 ప్రణాళికలో ర. 0.73 లక్ష కేటాయించబడింది. ఇందులో రు. 0.39 లక్ష యీ జిల్లాకు ప్రత్యేకించ బడింది.

### ఏజెన్సీ ప్రాంతాలలో మంచినీటి బావుల త్రవ్వకం

ఏజెన్సీ ప్రాంతాల్లో సురక్షితమైన మంచినీటి సౌకర్యాలు లేకపోవడం వల్లట్రయిబలు ప్రజలు వాగులనుండి, కుంటలనుండి త్రాగేటందుకు నీటిని వాడుకొంటున్నారు. ఇందువల్ల వారి అరోగ్యానికి హాని కలుగుతున్నది. ఈ ట్రయిబలు ప్రజలకు మంచినీటి సరఫరా సౌకర్యాన్ని కలిగించడంకోసం రు. 0.15 లక్ష వ్యయంతో యీ జిల్లాలోని ఏజెన్సీ ప్రాంతాలలో 3బావులను త్రవ్వడానికి ప్రతిపాదింప బడింది.

### స్వచ్ఛంద సంస్థలకు సహాయం

ఆంధ్ర ప్రాంతంలోని ఏజెన్సీ ప్రదేశాల్లో సంక్షేమ కార్యక్రమాల్ని కొనసాగిస్తున్న స్వచ్ఛంద సంస్థలకు ఆర్థిక సహాయం అందచేయుటకుకోసం 1959—60 లో రు. 0.90 లక్ష కేటాయించబడింది. ఈ జిల్లాలోని స్వచ్ఛంద సంస్థలకుకూడ యీ పథకంక్రింద సహాయం లభిస్తుంది.

## స్త్రీ సంక్షేమం

### ప్రస్తుతమున్న స్త్రీ సంక్షేమశాఖ విభాగాల అభివృద్ధి

స్త్రీ సంక్షేమశాఖ కార్యక్రమాలను తీవ్రంచేయటానికి, అవి మరింత ప్రయోజనకరంగా ఉండేటట్లు చేయటానికిగాను దృశ్యశ్రవణ పరికరాలు, పొండు ప్రాజెక్టర్లు, విద్యాబోధన పటాలు, కెమేరాలు, రేడియోలు, సైకిళ్లు కుట్టుమిషనులు మొదలయినటువంటి పరికరాలను, యితర ముఖ్య సామాగ్రిని ఆంధ్రలో ప్రస్తుతమున్న 12 స్త్రీ సంక్షేమశాఖ విభాగాలకు రు. 0.10 లక్ష వ్యయంతో 1959—60 లో సరఫరా చేయుటానికి ప్రతిపాదింపబడింది. ఇందులో రు. 900లు ఈ జిల్లాకు కేటాయించబడినాయి.

## సాంఘిక సంక్షేమం

### సాంఘిక సంక్షేమ విస్తరణ కేంద్రాలు

ప్రస్తుతమున్న 2 సంక్షేమ విస్తరణ కేంద్రాలను నిర్వహించటానికి, ఈ జిల్లాలో మొదటిదశ బ్లాకుల్లో అదనంగా ఒక కో-ఆర్డినేటెడ్ ప్యాటర్న్ పద్ధతిని మరొక ప్రాజెక్టు ప్రారంభించడానికి రాజ్య ప్రభుత్వవాటాక్రింద ప్రణాళికలో ఈ సంవత్సరం రు. 0.386 లక్ష మొత్తం కేటాయించ బడింది. ఈ ప్రారంభించబోయే ప్రాజెక్టుకు అయ్యే ఖర్చును బ్లాకులు, కేంద్ర సాంఘిక సంక్షేమబోర్డు, రాజ్యప్రభుత్వం 5:12:6 నిష్పత్తిలో భరిస్తాయి. ప్రజలనుంచి సేకరించే మాచింగు విరాళాలు కూడ ఇందుకు తోడవుతాయి.

## సాంఘిక, నైతిక పునరుద్ధరణ, సంరక్షణ కార్యక్రమాలు.

నైతిక పునరుద్ధరణ కేంద్రాలనుండి విడుదల చేయబడిన స్త్రీలకోసం ఒక ప్రభుత్వ సదనాన్ని, 14 జిల్లా ఆశ్రయ కేంద్రాలను (పురుషులకు 3, స్త్రీలకు 11) ప్రారంభించడానికి అయ్యే వ్యయంలో రాజ్య ప్రభుత్వం వాటా క్రింద 1959-60 ప్రణాళికలో రు. 6.32 లక్షల మొత్తం కేటాయించ బడింది. రాష్ట్రంలో ఇంతకుముందు ప్రారంభించిన ప్రభుత్వ సదనాలు, జిల్లా ఆశ్రయ కేంద్రాలుకూడ కొనసాగించ బడతాయి. పై కేటాయింపు మొత్తంలో రు. 0.153 లక్ష స్త్రీలకు గాను ఒక జిల్లా ఆశ్రయ కేంద్రం ప్రారంభించడానికి గాను ఈ జిల్లాకు కేటాయించ బడింది.

## భిక్షుక గృహం

భిక్షుక వృత్తితో జీవించే 80 మందికి ప్రాథమిక విద్యగరపటానికి, పాదరక్షలు తయారు చేయటం, వడ్రంగం, నేతపని, దర్జీపని మొదలగు వాటిలో శిక్షణ యివ్వటానికిగాను యీ జిల్లాలో ఒక భిక్షుక గృహం 1959—60లో ఏర్పాటుచేయాటానికి ప్రతిపాదింప బడింది. వీరికి భోజన, వైద్యసౌకర్యాలు సమకూర్చ బడతాయి. ఇందుకు రు. 0.40 లక్ష ఖర్చవుతుంది. గ్రాంటు-ఇన్-ఎయిడ్ పథకం క్రింద పైడబ్బు సమకూర్చ బడుతుంది.

## మున్సిపలు రోడ్లు, అభివృద్ధి పనులు.

మున్సిపాలిటీల, రెండు పట్టణ పంచాయతీల యొక్క ఆదాయమార్గాలను అభివృద్ధిపరచే ఉద్దేశంతోను స్థానిక ప్రజలకు మరికొన్ని సౌకర్యాలను కలుగ జేసే ఉద్దేశంతోను రెండవ ప్రణాళికలో రు. 47.54 లక్షలమొత్తం కేటాయించ బడింది. దీర్ఘకాలిక ఋణాల రూపంలో ఆర్థిక సహాయం కలుగజేయడానికి ఈ మొత్తం వినియోగించ బడుతుంది. ఇందులో రు. 21.42 లక్షలు మొదటి మూడుసంవత్సరాలలో ఖర్చుచేయబడ్డాయి. ఈ సంవత్సరపు ప్రణాళికలో రు 11.59 లక్షల మొత్తం కేటాయించ బడింది. అందులో రు. 0.15 లక్ష

మొత్తం 1958—59లో హౌసు ప్లానింగు డైరెక్టరు కార్యాలయంలో నియమించబడిన అదనపు సిబ్బందిని కొనసాగించడానికి వినియోగించ బడుతుంది. మిగిలిన రు. 11.44 లక్షలలోను రు. 1.10 లక్షల మొత్తం ఈ జిల్లాకు కేటాయించబడింది. ఋణం మొత్తం, స్థానికసంస్థ పేరు, పని వివరం క్రింద తెలుప బడ్డాయి.

| స్థానికసంస్థపేరు | పని వివరము. | అప్పు మొత్తం (రూపాయలు లక్షలలో) |
|---|---|---|
| విశాఖపట్టణం పురపాలకసంఘం | చెంగలారావుపేట హౌసు ప్లానింగు పథకం | 0.60 |
| ,, | మార్కెట్టుకు అభివృద్ధి పనులు | 0.30 |
| అనకాపల్లి పుర పాలక సంఘం | బజారు, బస్సు స్టాండు లకు అభివృద్ధిపనులు | 0.20 |
| | మొత్తం | 1 10 |

# రేడియో ప్రసారం

## కమ్యూనిటీ రేడియోసెట్ల స్థాపన, నిర్వహణ

రెండవ పంచవర్ష ప్రణాళికా కాలంలో 420 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పటానికి ప్రతిపాదించబడింది. ఇందులో 216 సెట్లుమాత్రం 1956—59 సంవత్సరాల కాలంలో యీ జిల్లాలో నెలకొల్పబడినాయి. ఈ సంవత్సరంలో యీ జిల్లాలో 10 కమ్యూనిటీ రేడియో సెట్లను నెలకొల్పటానికి, 1-4-1959 తేదీకి పూర్వం నెలకొల్పబడిన అన్ని సెట్లనూ నిర్వహించడానికి ప్రతిపాదింప బడింది. ఇందుకుగాను యీ సంవత్సరపు ప్రణాళికలో రు. 0.306 లక్ష మొత్తం కేటాయించబడింది.

# ప్రచారం

రెండవ పంచవర్ష ప్రణాళికను విజయవంతంగా అమలుపరచటం కోసం ప్రణాళికను గురించి ప్రజలలో శ్రద్ధాసక్తులు కలిగేటట్లు చేసేటందుకు, వారి సంపూర్ణసహకారాన్ని పొందేటందుకు, వారు యీ కార్యక్రమంలో ఎక్కువగా పాల్గొనేటట్లు చేసేటందుకుగాను వివిధ ప్రచార సాధనాల ద్వారా అభివృద్ధి కార్యక్రమాలను గురించి ప్రచారంచేయటం కోసం 1956—57 లో ఏకీకృత కార్యక్రమం ఒకటి ప్రారంభించ బడింది. ఈ కార్యక్రమాన్ని కొనసాగించటానికి ఈ సంవత్సరపు ప్రణాళికలో రు. 6.80 లక్షల మొత్తం కేటాయించ బడింది. ఇందులో రు. 17,317 లు యీ జిల్లాలో క్రిందివిధంగా వినియోగించ బడినాయి.

| | | రూపాయలు. |
|---|---|---|
| 1. | పర్సనల్ అసిస్టెంట్లు, యితర సిబ్బందికి జీతాలు .... | 5,987 |
| 2. | సంచార ప్రచార వ్యానులకు పెట్రోలు, యితర ఖర్చులకు... ... | 2,400 |
| 3. | జిల్లా స్థాయిలో ఏర్పాటు చేయబడే ప్రదర్శనలో పాల్గొనేటందుకు ... | 250 |
| 4. | సంగీత నాటకోత్సవాలు ఏర్పాటుచేయుడానికి | 500 |
| 5. | జిల్లా, తాలూకా కేంద్రాలలో ప్రణాళికా వారోత్సవాలు ఏర్పాటు చేయటానికి ... | 900 |
| 6. | జిల్లాలో పనిచేస్తున్న బుర్రకథ దళాల నిర్వహణకు. .... | 2,280 |
| 7. | సంచార వ్యానులకు పరికరాలు. ... | 5,000 |
| | మొత్తం | 17,317 |

## అర్థ గణాంక శాఖ

1958—59 లో యీ జిల్లాలో ఒక జిల్లా గణాంకశాఖ ఏర్పాటు చేయబడింది. ఒక జిల్లా గణాంకాధికారి (గెజిటెడ్), ఒక ఎకనామిక్ ఇన్వెస్టిగేటరు, ఒక అప్పరు డివిజనుగుమాస్తా, ఇద్దరు జవానులు యిందులో నియమించబడినారు. జిల్లాస్థాయిలో రాజ్యంయొక్క గణాంక సేకరణ కార్యక్రమాలను సమన్వయ పరచటానికి, సేకరించబడి సంకలనం చేయబడే గణాంక వివరాలలో లోపాలులేకుండా ఉండేటట్టుచేయటానికి "లయజన్ ఏజెన్సీ"గా జిల్లా గణాంక విభాగం పనిచేస్తుంది. ఇందుకుగాను 1959—60 ప్రణాళికలో రు. 0.10 లక్ష యీ జిల్లాకు కేటాయించబడింది.

## తంతి, తపాలా సౌకర్యాలు

1959—60లో 53 తపాలా ఆఫీసులను స్థాపించటానికి, ఇంతేకాక విశాఖపట్టణం (ఎస్.ఒ),గాంధీనగరం మార్కెట్టు, కంచిలి, పాడేరు, కోటఉరట్ల, గూడెం, సుజన కోటలలో 7 టెలిగ్రాఫ్ (కంబైండు) ఆఫీసులను నెలకొల్పటానికి ప్రతిపాదింప బడింది. శృంగవరపు కోటలో ఒకపబ్లిక్ కాల్ ఆఫీసును నెలకొల్ప డానికికూడ ప్రతిపాదింపబడింది.

## రైలు మార్గాలు

విశాఖపట్టణం జిల్లా లో రైలుమార్గాలకు సంబంధించి 1959—60 లో క్రింది కార్యక్రమం అమలు జరుప బడుతుంది.

1. విజయనగరంలో రైల్వేకాలనీ అభివృద్ధికోసం భూమిని స్వాధీనం చేసికోవడం; నీటిసరఫరా సౌకర్యాన్ని అధికం చేయడం; రవాణా చేయవలసిన వస్తువులను రైల్వే వాగన్లలోనికి చేరవేయటానికి, వాటిలోనుండి బయటికి తీయడానికి ఉపయోగించ బడుతున్న ప్లాటుఫారంమీద కప్పు వేయడం;

గూడ్సు షెడ్డు చుట్టూరా గోడనిర్మించి దానిమీద ముండ్లతీగ కంచెవేయడం; గూడ్సు షెడ్డులో అగ్నిమాపక సాధనాలను నెలకొల్పడం; విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని విస్తరింపచేయడం; ప్రయాణీకుల నుద్దేశించి ప్రకటనలు చేయడంకోసం లౌడ్ స్పీకర్లను ఏర్పాటుచేయడం; ఆర్. ఎం. ఎస్. బిల్డింగ్‌కు మరుగు దొడ్ల సౌకర్యం ఏర్పాటు చేయడం; ప్రయాణీకుల కోసం ప్లాటు ఫారం "లాక్ ఫాస్టు" ఏర్పాటు చేయడం; ప్లాటు ఫారం మీద 25 లైన్ల "ఆటో ఎక్స్ ఛేంజిని" ఏర్పాటు చేయడం; నాలుగు నీటి కొళాయిలను ప్లాటు ఫారంమీద నెల కొల్పడం; ప్లాటు ఫారంమీద అదనంగా లైట్ల సౌకర్యాన్ని కలిగించడం; అప్రోచ్ రోడ్డు నిర్మించడం.

2. అలమంద స్టేషనులో గొట్టపుబావి, వాటరు షెల్టరు ఏర్పాటు చేయడం; స్టేషనులో విద్యుచ్ఛక్తి దీపాలను ఏర్పాటుచేయడం.

3. కొత్తవలసలో "వాటర్ ట్రఫ్" ఏర్పాటు చేయడం; అదనంగా విద్యుచ్ఛక్తి దీపాలను ప్లాటు ఫారం మీద ఏర్పాటు చేయడం; అప్రోచ్ రోడ్డు నిర్మించడం.

4 పెందుర్తిలో ప్లాటు ఫారంమీద అదనంగా దీపాలను ఏర్పాటు చేయడం; అప్రోచ్ రోడ్డు నిర్మించడం.

5. సింహాచలంలో "అవాయిడింగ్ లైన్ల"ను ఉపయోగంలోనికి తీసుకరావడం; వెయిటింగు హాలును నిర్మించడం; అప్రోచ్ రోడ్డుకు తారువేయడం; ప్లాటు ఫారంమీద అదనంగా దీప సౌకర్యాన్ని కలిగించడం; అప్రోచ్‌రోడ్డు నిర్మించడం.

6. వాల్తేరులోని ఆర్. ఎం. ఎస్. ఆఫీసును, మొదటి తరగతి పురుష ప్రయాణీకుల వెయిటింగు రూమును కలుపుతూ శాఖాహార, మాంసాహార ఫలహార శాలలను ప్లాటుఫారంమీద నిర్మించడం; శాకాహార ఫలహార శాలకు అదనపువసతిని కల్పించడం; రైల్వే సహకార స్టోరుకు మార్పులు చెయ్యడం; "ఓవర్ హెడ్

క్యారేజీ" నీటిసౌకర్యాన్ని కలిగించడం; సౌత్ సైడింగులో "వాటర్ కాలం" ను ఏర్పాటు చేయడం; పార్సెల్ ప్లాటు ఫారంను ఏర్పాటుచేయడం; మరుగు దొడ్డిని, మూత్రశాలను సిబ్బందికోసం నిర్మించడం; ఆర్. ఎస్. పోస్టు ఆఫీసుకోసం మరుగు దొడ్డిని నిర్మించడం; విద్యుచ్ఛక్తి సౌకర్యాన్ని విస్తరింప చేయడం; ప్రయాణీకుల నుద్దేశించి ప్రకటనలు చేయడంకోసం లౌడ్ స్పీకర్ల ఏర్పాటు; "లెఫ్టులగేజి రూము" (12′ × 10′ ను ఏర్పాటుచేయడం; ప్లాటు ఫారంమీద అదనంగా దీపసౌకర్యాన్ని సమకూర్చడం; అప్రోచ్ రోడ్డును నిర్మించడం.

7. విశాఖపట్టణం టౌనులో అదనంగా "గూడ్సు షెడ్డు" సౌకర్యాలను కలిగించడం; ప్లాటు ఫారంమీద లైటింగ్ సౌకర్యాన్ని కలిగించడం; అప్రోచ్ రోడ్డు నిర్మించడం. విజయనగరం—గోపాలపట్నం మధ్య డబుల్ లైను వేయడం; వాల్తేరులో స్టోర్సు డిపోను తిరిగి నిర్మించడం.

పలాస—కుర్దా రోడ్డు, భద్రక్—ఖర్గపూరు—వాల్తేరులను కలుపుతూ క్రొత్త వైర్‌లెస్ స్టేషనును ఏర్పాటుచేయడం; గజపతినగరం—విజయనగరంల మధ్య క్రాసింగ్ స్టేషనును ఏర్పాటు చేయడం.

# విశాఖపట్టణం జిల్లా ప్రణాళిక, అభివృద్ధిసంఘం సభ్యుల జాబితా

## ప్రణాళిక, అభివృద్ధికి సంబంధించిన జిల్లాఅధికార్లు

1. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, పబ్లిక్ వర్క్సుశాఖ, విశాఖపట్టణం
2. డివిజనల్ ఇంజనీరు (హైవేస్)విశాఖపట్టణం
3. డివిజనల్ ఇంజనీరు (ఎలక్ట్రిసిటి) విశాఖపట్టణం
4. పరిశ్రమల, వాణిజ్యశాఖ అసిస్టెంటు డైరెక్టరు, విశాఖపట్టణం

5. జిల్లాపోలీసు సూపరింటెండెంటు, విశాఖపట్టణం
6. జిల్లా పశువైద్య శాఖాధికారి, విశాఖపట్టణం
7. జిల్లా వైద్యశాఖాధికారి, విశాఖపట్టణం
8. జిల్లా విద్యాశాఖాధికారి, విశాఖపట్టణం
9. జిల్లా ఆరోగ్యశాఖాధికారి, విశాఖపట్టణం
10. సహకారసంఘాల డిప్యూటి రిజిస్ట్రారు, విశాఖపట్టణం
11. జిల్లా వ్యవసాయశాఖాధికారి, విశాఖపట్టణం
12. జిల్లా సంక్షేమశాఖాధికారి, విశాఖపట్టణం
13. జిల్లా పంచాయతి ఆఫీసరు, విశాఖపట్టణం
14 డిప్యూటిరిజిస్ట్రారు డెవలప్‌మెంటు ఆఫీసరు, కో—ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్, విజయనగరం

### సంఘంలో సభ్యులుగా చేర్చబడిన అధికార్లు

15. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు, స్పెషల్ ఇన్వెస్టిగేషన్ డివిజన్ విజయనగరం
16. ఎలక్ట్రికల్ ఇంజనీరు, (కన్‌స్ట్రక్షన్) విశాఖపట్టణం
17. హెల్త్ ఆఫీసరు, ఆర్.హెచ్.సి. సింహాచలం
18. ఏజెన్సీ అభివృద్ధికి సంబంధించిన ప్రత్యేక జిల్లా పశువైద్య శాఖాధికారి, కాకినాడ
19. ఏజెన్సీకి సంబంధించిన ప్రత్యేక జిల్లా వ్యవసాయ శాఖాధికారి, కాకినాడ
20. ప్రత్యేకజిల్లా వ్యవసాయ శాఖాధికారి, అరకులోయ
21. ఏజెన్సీవిద్యకు సంబంధించిన ప్రత్యేకజిల్లా విద్యాశాఖాధికారి, కాకినాడ
22. జిల్లా అటవీశాఖాధికారి (నార్త్) విజయనగరం
23. జిల్లా అటవీశాఖాధికారి (సౌత్) విశాఖపట్టణం

24. అసిస్టెంటు ఇంజనీరు, స్పెషల్ ఇన్వెస్టిగేషన్ డివిజన్, చోడవరం
25. అసిస్టెంటు రేడియోఇంజనీరు, కాకినాడ
26. సహకార సంఘాలడిప్యూటి రిజిస్ట్రారు, అనకాపలి
27. అసిస్టెంటు రేడియోఇంజనీరు, విశాఖపట్టణం
28. ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్‌ఛేంజి ఆఫీసరు, విశాఖపట్టణం
29. ఇన్‌స్పెక్ట్రిస్ ఆఫ్ గర్ల్‌స్కూల్స్, ఫస్ట్ సర్కిల్, రాజమండ్రి
30. ఎక్జిక్యూటివ్ ఇంజనీరు (ఫ్లడ్ రిపైర్స్ డివిజను) అనకాపల్లి
31. ప్రత్యేకజిల్లా విద్యాశాఖాధికారి, జిల్లాబోర్డు, విశాఖపట్టణం
32. సూపరింటెండెంటు, ప్రభుత్వ పాడి క్షేత్రం, హనుమంతవాక, విశాఖపట్టణం
33 పంచవర్ష ప్రణాళికల ఫీల్డుపబ్లిసిటీ ఆఫీసరు, విశాఖపట్టణం

## లోకసభ, రాజ్యసభ సభ్యులు

34. శ్రీ పి. విజయరామ గజపతిరాజు, ఎం.పి., ఫోర్ట్, విజయనగరం
35. శ్రీ ఎం. సూర్యనారాయణమూర్తి, ఎం.పి., కొండకర్ల(వయా) అనకాపల్లి
36. శ్రీ కె. వీరన్నపాదల్, ఎం.పి., పెదవలస. చింతపల్లితాలూక
37. శ్రీ జె.వి.కె. వల్లభరావు, రాజ్యసభ సభ్యుడు, విజయనగరం
38. శ్రీ వి. వి. రమణ, రాజ్యసభ సభ్యుడు, అనకాపల్లి
39. శ్రీ దిప్పలసూరిదొర, ఎం.పి. పరికి, తోనంపోస్టు, ఆలూరు తాలూక, శ్రీకాకుళంజిల్లా
40. శ్రీ బిడ్డిక సత్యనారాయణ, ఎం.పి., మోక్షరాజపురంపోస్టు, శ్రీకాకుళంజిల్లా

## విధానమండలిసభ్యులు

41. శ్రీ ఎ. అప్పన్నదొర ఉరఫ్ బాబ్జిరావు ఎం.ఎల్.సి., విజయనగరం పురపాలక సంఘాధ్యక్షుడు, విజయనగరం

42. శ్రీ కొమ్మూరు అప్పడు, ఎం.ఎల్.సి., భోగాపురం, భీముని పట్టణం తాలూకా

43. శ్రీ పెంటకోట వెంకటరమణ, ఎం.ఎల్.సి., మునగపాక పంచాయతి అధ్యక్షుడు, అనకాపల్లి తాలూకా

44. శ్రీ జి. బి. అప్పారావు, విజిసిగిరి, శృంగరపుకోట తాలూకా

45. శ్రీ పెమ్మరాజు వెంకటరావు, బి.ఎ., ఎం.ఎల్.సి., గాంధిభవన్, హైదరాబాదు

## విధాన సభ సభ్యులు

46. శ్రీ తడ్డి సన్యాసినాయుడు, ఎం.ఎల్.ఎ., చల్లపేట, సాలూరు తాలూకా, శ్రీకాకుళం

47. శ్రీ ఎ. వి. భానోజిరావు, ఎం.ఎల్.ఎ., విశాఖపట్టణం పురపాలక సంఘాధ్యక్షుడు, విశాఖపట్టణం

48. సి. హెచ్. వి. సూర్యనారాణరాజు ఉరఫ్ సన్యాసిరాజు, ఎం.ఎల్.ఎ., పటికొప్పాక, ఎలమంచిలి తాలూకా

49. శ్రీ బత్తం శ్రీరామమూర్తి, ఎం.ఎల్.ఎ., ఫోర్టు, విజయనగరం

50. శ్రీ రాజసాగి సూర్యనారాయణరాజు, ఎం.ఎల్.ఎ., తంగేడు, నరసిపట్టణం తాలూకా

51. శ్రీ గొట్టిముక్కల జగన్నాథరాజు, ఎం.ఎల్.ఎ., డాబాగార్డెన్స్, విశాఖపట్టణం

52. శ్రీ కె. వి. ఎస్. పద్మనాభరాజు, ఎం.ఎల్.ఎ., అన్నంరాజుపేట శృంగరపుకోట తాలూకా

53. శ్రీ డి. శ్రీరామమూర్తి, ఎం.ఎల్.ఎ., వడ్డాది, చోడవరం

54. శ్రీ బి.జి.ఎం ఎ., నరసింగరావు, ఎం.ఎల్.ఎ., విశాఖపట్టణం తాలూక.

55. రుతల లచ్చపాత్రుడు, ఎం.ఎల్.ఎ., నరసిపట్టణం

56. శ్రీ మత్స్యరస మాచరాజు, ఎం.ఎల్.ఎ., జి. మదుగోలు, చింతపల్లి తాలూక

57. శ్రీ బీసెట్టి అప్పారావు, ఎం.ఎల్.ఎ., అనకాపల్లి

58. శ్రీ మజ్జి పైడయ్యనాయుడు, ఎం.ఎల్.ఎ., నరసింగబిల్లి అనకాపల్లి తాలూక

59. శ్రీ రెడ్డి జగన్నాథం, ఎం.ఎల్.ఎ., వేచలం, చోడవరం తాలూక

60. శ్రీ బోత్స ఆదినారాయణ, ఎం.ఎల్.ఎ, విజయనగరం

61. శ్రీ పటినాగయ్య. ఎం.ఎల్.ఎ., విశాఖపట్టణం

62. శ్రీ జి. సూర్యనారాయణ, ఎం.ఎల్.ఎ., విజయనగరం

63. శ్రీ గుజ్జల రామునాయుడు, ఎం.ఎల్.ఎ, కొండిబ, శృంగవరపు కోట తాలూక

64. శ్రీ ముత్యాలపోతరాజు, ఎం.ఎల్.ఎ., నరసిపట్టణం

65. శ్రీ సి. హెచ్. వి. సోమయాజులు, ఎం.ఎల్.ఎ., విజయనగరం

66 విశాఖపట్టణం జిల్లా బోర్డు స్పెషల్ ఆఫీసరుయొక్క పర్సనల్ అసిస్టెంటు

## జిల్లాలో ఉన్న పురపాలక సంఘాల అధ్యక్షులు

67. శ్రీ బాది భోగలింగం, అనకాపల్లి పురపాలక సంఘాధ్యక్షుడు అనకాపల్లి

68. శ్రీ కె. సూర్యనారాయణ నాయుడు, భీమునిపట్నం పురపాలక సంఘాధ్యక్షుడు

## బ్లాకు ప్రణాళిక, అభివృద్ధి సంఘాల అధ్యక్షులు

69. సబ్ కలెక్టరు, విజయనగరం

70. అసిస్టెంటు కలెక్టరు, నరసిపట్టణం

## ప్రాజెక్టు ఎక్జిక్యూటివ్ ఆఫీసర్లు, బ్లాకు డెవలప్‌మెంట్ ఆఫీసరు

71. ప్రాజెక్టు ఎక్జిక్యూటివ్ ఆఫీసరు, అరకులోయ

72. ప్రాజెక్టు ఎక్జిక్యూటివ్ ఆఫీసరు, పాడేరు (వయా) మదుగోలు
73. బ్లాకు డెవలప్‌మెంట్ ఆఫీసరు, పెందుర్తి
74. ,, సబ్బవరం
75. ,, కోటఉరుట్ల
76. ,, నక్కపల్లి
77. ,, కనితి
78. ,, రోలుగుంట
79. ,, నరసిపట్నం
80. ,, భీమునిపట్నం
81. ,, కాసింకోట
82. ,, ఎ. కోడూరు
83. ,, గాజులరేగ
84. ,, అచ్యుతాపురం
85. ,, వడ్డాది
86. ,, కొత్తవలస
87. ,, పార్వడ

## కో-అప్టు చేయబడిన అనధికారసభ్యులు

88. శ్రీ పెనుమత్స బాపిరాజు, చినబొడ్డేపల్లి, నరసిపట్నం తాలూక (జిల్లా బ్లాకు ప్రణాళిక, అభివృద్ధి సంఘముల ప్రతినిధి)
89. శ్రీ పి. ఎల్. ఎన్. రాజు, కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు అధ్యక్షుడు, విజయనగరం, జిల్లా ప్రణాళిక, అభివృద్ధిసంఘం ఉపాధ్యక్షుడు
90. శ్రీ డి. వెంకయ్యా ఉరఫ్ బుల్లినోర, మంగవరం, ఎలమంచిలి తాలూక

91. శ్రీ టి. వి. రమణయ్య, కొత్తవలస, శృంగవరపుకోట తాలూక, (పంచాయతి ప్రతినిధి)

92. శ్రీ కె. మలాంనాయుడు, కొత్తపాడేరు, పాడేరు. ఓ. ఒ. (వయా) మదుగోలు

93. శ్రీ వి. సోమేశ్వరం పంతులు, బి.ఎ., బి.ఎల్., అడ్వకేటు, భారతసేవక సమాజ్ కన్వీనరు, విజయనగరం

94. శ్రీమతి జి.పి.ఎస్. మూర్తి, విశాఖపట్టణం (భారత రెడ్ క్రాస్ సంస్థ స్త్రీల ప్రతినిధి)

95. శ్రీ కాకర్లపూడి సీతారామరాజు. ఆలమంద (వయా) విజయ నగరం ఆర్. ఎస్

96. శ్రీ ఎం. సత్యరాజు. వాల్తేరు వేమ సమాజం గౌరవ సభ్యుడు

97. శ్రీ గెడ్డం సన్యాసిరావు, పాయకరావుపేట (వయా) తుని

98. శ్రీ జి. ఎ. స్వామి, కొనడ, భీమునిపట్నం తాలూక

99. శ్రీ రాజసాగి సీతారామరాజు, తంగేడు, నరసీపట్నం తాలూక

100. శ్రీ కె. సత్యనారాయణ, రిటైర్డు మెడికల్ ఆఫీసరు, సబ్బవరం

101. శ్రీ భూపతి పైడికొండ, కస్పా జగన్నాథపురం, చోడవరం తాలూక

102. శ్రీ పైలా అప్పారావు, పరవడ, అనకాపల్లి తాలూక

103. శ్రీ ఆర్. జగన్నాథరావు, అధ్యక్షుడు, జిల్లా చేనేత పనివారి సంఘం, గోడిచెర్ల, ఎలమంచిలి తాలూక

104. శ్రీ ఆవగడ్డ చంద్రరావు, బి. ఎ., వాపిలపాడు పోస్టు (వయా) చోడవరం, శృంగవరపుకోట తాలూక

105 శ్రీ ఎలపకుర్తి సత్యనారాయణ, తెలుగుబిల్లి పంచాయతి అధ్యక్షుడు, తెలుగుబిల్లి, చోడవరం తాలూక

